# ప్రాణదానం



డా. పి. రామమూర్తి

గంగా ప్రచురణలు, గుంటూరు.
సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
దర్శ గ్రంథమండలి, విజయవాడ.

3 578

# సమర్పణ

స్వార్థాలతోను, కక్షలతోను, కార్పణ్యాలతోను యీర్ష్యాద్వేషాలతోను, మతం పేరిట జరిగే బూటకనాటకాలతోను, దేవుని పేర చేస్తున్న ఘోరమోసాలతోను కలుషితమై సర్వనాశనంవైపు పరువులెడుతున్న మానవాళికి, 2500 సంవత్సరాలక్రితమే త్యాగస్వభావాన్ని అలవర్చి వ్యక్తిగత స్వార్థపూరితకోర్కెలను నిర్మూలించి, సమష్టిస్వభావాన్ని, సేవాభావాన్ని, ప్రేమాదరాన్ని, అహింసాభావాన్ని అనుభవంలో అలవర్చి, కుల మత కలిమిలేములులేని సమాజాన్ని సృష్టించి, సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని మానవజాతికి చవిజూపిన శాంతిదాత అహింసామూర్తి, దళితజాతివుద్ధారకుడునైన బుద్ధదేవునికి—

పి. రామమూర్తి

# నా మాట

నా మిత్రులు నలుగురు కలిసి, ఒక ఫిల్మునిర్మాణానికి రెండులక్షలపెట్టుబడి సరిజేసుకుని, అందుకుపకరించు కథను వ్రాయమని కోరారు, ప్రోత్సహించారు. కథ చరిత్రాత్మకమైందిగాను, సాంఘికమైందిగాను, లైలా మజ్నూవలెను, దేవదాసువలెను, వుండాలని వారి ఆదేశము.

వారిఆశయానికి సరితూగు కథను చరిత్రాత్మకమైంది యెన్నుకున్నాను. కాని, వారికోర్కెనే గీటుగా చేసుకోనొల్లక వుత్సాహవంతమైన నవలగా చిత్రించ ప్రయత్నించాను. మిత్రులు కేలంగిపాత్రకూడా వుండాలన్నారు. ఆ ఫలితంగానే యీ చరిత్రాత్మకనవలలో "నందా, మిశ్రానంద్" పాత్రలను కల్పించాను. వారి ఆదుర్దాకొంది యీ నవలను ఒకనెలలోనే పూర్తిచేశాను.

పదేపదే కోరి, వత్తిడిపెట్టినవారిలో ఒకమిత్రుని నాడీ జాతకంలో, సినిమాలవైపు వెళ్ళితే సర్వనాశనం సంభవిస్తుందని వున్నదట. ఆ భయంతో ఆయన విరమించుకున్నారు. మిగిలినవారు వారిననుసరించారు.

ఈ రూపంగా యీ పుస్తకవ్రాతప్రతి ఒకసంవత్సరం వారివద్ద బందీగావున్నతదుపరి విముక్తిపొంది, నేడుప్రచురితమై మీాముందు కొస్తున్నది.

27-10-61
గుంటూరు

పి. రామమూర్తి

# పరిచయము

శ్రీరామమూర్తి నవలలు చక్కని రచనలు. ఆయన అనుభవాలు అనేకం, చూచినదేశాలు వివిధం - గ్రహించుకొన్నాడు యెన్నో నైతికరీతులు, వర్తనలు, అవసరాలు కూడ !

అందరం యెందరెందరినో అనుదినం చూస్తున్నాము. ఎన్నెన్నో అనుభవాలను పొందుచున్నాము. కాని, భావప్రపంచమందు కొంగ్రొత్త సృష్టికారకమగు జీవనరీతుల నూహించుకోగల్గినవారే నూతనరచనల నల్లగలరు; మనకు అందించగలరు. అట్టివారిలో ఉన్నతశ్రేణికి చెందిన రచయిత మన రామమూర్తి.

ఆయనవ్రాసిన నవలలను చదివితిమి; ఆనందించితిమి ! వాటిలో ప్రతిబింబించుచున్న ప్రపంచవీధులలో విహరించుచుంటిమి. ఎంతటిఆనందం పొందగలుగుచున్నాము. గొప్ప తలపులెన్నో వెల్లుబుకుచున్నవి. అభిమానపూరితమైన మాటలు, సంభాషణలు, వుత్సాహంకలిగించు చర్చలు, వుత్తేజితమగు తత్పరతలు వుత్తమరచనలలోనే కన్పడును. అవి రామమూర్తియొక్క సొత్తులు. కథలు చక్కగా అల్లుతారు. నాయికానాయకులకు వుదాత్తమగు సాంఘిక వాతావరణం కల్పించుతారు. వారిజీవితాలను అల్లిబిల్లిగా రూపొందించుతూనే మన కెందరికో నూతనోత్సాహాన్ని, సాధారణంగా అందజాలని సొంపు ఇంపులను అనుభవము

లోకి తేగల్గుతారు. ఈ సలక్షణాలే మంచి రచయితల సొత్తు. ఆ భాగ్యాన్ని తాను సంపాదించుకొని, తనరచనలద్వారా మన కర్పణచేస్తున్నారు రామమూర్తి.

ఈ నవల అడవి బాపిరాజుగారి "హిమబిందు" అంత స్తులోయున్నది. వీరిరచనలు కవిసామ్రాట్టు నోరివారి ధోర ణిని జ్ఞప్తికి తేస్తున్నది. ఆంధ్రులకు తమవారి, భారతీయులం దరి చారిత్రక, నైతికజీవిత చర్చల నందజేయాలనే తాప త్రయం రామమూర్తినవలలో కన్పించును. భాష, భావం -వొండొంటితో పూపుగా పోటీలలోనున్నవి.

కొన్నికొన్ని ఘట్టాలలో ఆయనరచన, అందరిజీవి తానుభవములలోవలెనే, "ప్లాటు" లేకుండా, ప్లానులకు మించి, హఠాత్తుగా జరుగు సంఘటనలకు తావిస్తూయుం డును. ఒకవిధంగా అనేకుల జీవితసరళి అలాగే వుండునేమో? మనంచేస్తున్న పనులు, అనుకుంటున్న ధోరణులకు విపరీ తంగా, వేర్వేరుగా ఎన్నెన్నో మారులు జరుగుచుండును గదా! అట్టి జీవితవైపరీత్యాలను ఆయనకథలు ప్రతిబిం బించుచున్నవా ?

వివిధ సాంఘిక, రాజకీయ సమస్యలపై, కథలద్వారా, ఇంత చక్కగా, చురుకుగా, చర్చలు సాగించగల్గు నవలలు మన తెలుగులో యీనాడు అంతగా అందడంలేదు. ఇట్టి చర్చలతోకూడిన కథ ప్రపంచము రామమూర్తియొక్క ప్రత్యేకశక్తి.

కథ ప్రారంభించుటతోడనే, మనలను తన రచనలలో నిమగ్నుల చేసుకోగల్గుశక్తి రామమూర్తికి గొప్పగా కలదు.

ప్రభ, అశ్వఘోషుల యీతపందెముతో ప్రారంభమగుచున్న యీ కథ, ఆ పందెపు పరవడులలో మనహృదయాల కెంత ప్రాణంపోస్తున్నది ! అటులే గ్రంథాంతరమువరకు, కథపై కథ, భారతదేశాన్నుండి ఈజిప్టువరకు, ఆంధ్రదేశమందే పురాతన, అధునాతన నాగరికరీతులవరకు, మన మనస్సుల నడుపుచున్నారు.

ఆ 1936-40 యుగాన, రైతాంగ విద్యాలయమందు మావద్ద వుండి రీ రామమూర్తి. ఆ బిడ్డలో ఏదో శక్తియున్న దని మా దంపతులం గ్రహించితిమి. కాని యింత సుందర మైన రచనాశక్తి, వుత్తేజితమైన భావుకా బోధనాశక్తి యిలాంటి గ్రామీణ స్వరూపియందుండునని తలంచలేదు. గ్రామీణులగు ఆ దువ్వూరి రామిరెడ్డి, శెట్టిపల్లి, మన శ్రీ తుమ్మల సీతారామమూర్తి యెన్నో తియ్యని తేజస్సు గల రచనల ఆంధ్రుల కర్పించిరి. అటులే యీ యువరచయిత మన రామమూర్తి ! వీరినవలలు అభివృద్ధిదాయకమైనవి; వుల్లాసపూరితమైనవి. చదివి, మేము చాలా ఆహ్లాదాన్ని పొందితిమి. చదువరులందరూ మావలెనే, రామమూర్తి స్వజనాత్మక ప్రపంచమందు తగినంత తృప్తి, స్వధర్మ నిర్వహణోత్సాహము పొందగల్గుదురని ఆశిస్తున్నాము. శ్రీ రామమూర్తి కివే మా దంపతుల ఆశీర్వాదములు—

నిడుబ్రోలు }<br>23-10-61 }

గోగినేని భారతీదేవి<br>M. L. C.

# అధ్యాయ సూచిక

# ప్రాణదానము:

## సాకేత సన్మానము

1వ శతాబ్దమునాటి విషయ మిది. ఆసియాఖండము లోని అనేక భూభాగాలందు బౌద్ధమతము విలసిల్లిన రోజు లవి. మతముద్వారాను, విజ్ఞానసంపత్తిద్వారాను, వాణిజ్యాల ద్వారాను భారతప్రభావము అలరారుచున్న కాల మది. పుష్యమిత్రుని పరిపాలనాకాలములో బౌద్ధమతప్రాభవం భారతదేశంలో సన్నగిలుట ప్రారంభించింది. ఆరోజుల్లో గ్రీకులతో మనకున్న వాణిజ్యసంబంధం అతి ఘనిష్ఠమైనది. అనేకమంది గ్రీకులు భారతవ్యాపారకేంద్రాలలో శాశ్వతంగా స్థిరపడిపోయారు. నేటి అయోధ్య నాడు సాకేతముగా ప్రసిద్ధపట్టణం. అప్పటి ఆ సాకేతములోని ఒక పేటంతా గ్రీకులతో నిండివుంది.

ఆరోజు పౌర్ణమి. చలిబాధ సన్నగిలి, పొలాల్లోని పంటలు యింటికిచేరి, అత్యంత ఆనందాన్నిచ్చే హోలీపండుగ రోజు అది. వినీలకాంతులను వెదజల్లుతూ, తరంగాలతో తప కరతాళనృత్యంసలుపుతూ, ఆత్మానందకోలాహలంతో కుతూ పరవళ్ళుత్రొక్కుతూ ప్రవహిస్తున్నది సరయూనది. య భాస్కరుని లేతకిరణాలు నదినీటిమీద కనకాంబర లను ప్రతిబింబిస్తూ, జిలిబిలినృత్యం సలుపుతున్నవి.

నదికి దక్షిణదిశగానున్న శ్రీరామచంద్రులవారిమందిర ప్రహరీగోడలకు నదీతరంగాలు తపతపకొట్టి క్రీడావిహారం చేస్తున్నవి. ఆలయాన్నంటివున్న సాకేతమహానగరం ఆకాశానికంటిన భవనధవళకాంతులతో శోభిస్తున్నది. పట్టణ పూర్వదిశను రెండుమైళ్ళ వైశాల్యంగలిగిన విశాల బౌద్ధ విహారవన మున్నది. అది బుద్ధభగవానుడు విహరించిన వనం గనుక, బౌద్ధవిహార్ అనేపేరు స్థిరపడిపోయింది. ఆ వనం మధ్య శిథిలావస్థలోనున్న తిన్నె ఒకటున్నది. బుద్ధభగవాను డచటికి వచ్చినపుడు, ఆ అరుగుమీద అధిష్టించే తన ప్రవచనాలు బోధించినట్లు జనశ్రుతి గలదు. విహారవనం ఫలపుష్ప వృక్షాలతో నిండివున్నది. కొంతభాగం దట్టమైన మహావృక్షాలతోను పర్ణశాలలతోను అరణ్యమువలె ద్యోతకమవు చున్నది. తిన్నెకు ఫర్లాంగుదూరంలో ఒక హాలుగానున్న నాట్టిమిద్దె పైభాగమంతా లతలు పాకించబడి, పొదరిల్లు రూపా న్నివ్వబడివున్నది. అది వుత్సాహవంతులైన శ్రీకు కళాకారులు నిర్మించుకున్న నాట్యప్రదర్శనశాల. మాధవీ, మాలతీలతలు వృక్షాలకు అల్లుకొని అందాన్ని శృంగారించినవి. దేవదారు, శాల్మలీ, గుల్బర్గావృక్షాలు గగనానికంటి వున్నవి. మందగమనపు పవనతెమ్మెరలు గుల్బర్గాపుష్పాల నుంచి కమనీయమైన సుగంధాన్ని మోసుకొస్తున్నవి. మయూరకూతలు గాబోలు వినిపిస్తున్నవి. బుద్ధవిహార్ లో దుప్పిపిల్లలు నిర్భీతిగా ఆడుకుంటున్నవి.

బుద్ధవిహార్ వెడల్పునా నదిఅంచుఅంతా హార్బరు నమూనాగా నిర్మించబడిన గొప్ప వార్ఫు. అది ప్రసిద్ధ

అంతర్జాతీయ వ్యాపార కేంద్రము. ఆ వార్ఫు యెదుట కనక రంగిత అమూల్య అంబారీతో అలంకరించబడి, పుష్పగుచ్ఛ తోరణాలతో శరీరమంతా అల్లబడిన గజరాజమొకటి ఘీంకరిస్తూ నిలిచివుంది. పట్టణంలోని స్త్రీ పురుషులంతా వార్ఫ అంతటా నిలిచి పట్టరాని ఉత్సాహంతో పులకలు వేస్తున్న మనస్సులతో కోలాహలం చేస్తున్నారు. వార్ఫుకు రెండోప్రక్క కూడా జనం కిటకిటలాడిపోతున్నది. ఏదృశ్యంకొరకో ప్రజలు ఆత్రతతో ముందుకు పడద్రోసుకుంటున్నారు. వార్ఫు మధ్యలో గజరాజము విరాజమానమైయున్నచోట పురపాలకాధ్యక్షులు, నగర ప్రముఖులు ఎత్తుగా నిర్మింపబడిన వేదికమీద ఆసీనులై, ప్రేక్షకుల కోలాహలాన్ని తిలకిస్తున్నారు. వార్ఫులోని నావలన్ని దూరంగా వుంచబడినవి. ఉత్తరపువద్దున వార్ఫు రెండుచివరల రెండునావలపై ప్రభాతభాస్కరుని ప్రతిమాంకితమైన జండాలు రెపరెపలాడుతున్నవి. శ్రావ్యమైన కంఠధ్వనితో ప్రభాతగానము వినిపిస్తున్నది.

ఆకస్మికంగా కోలాహలం పెద్దపెట్టున విజృంభించింది. "రాజనరేశ్ జిందాబాద్, ఆనందముకుల్ జిందాబాద్, జశ్ నందన్ జిందాబాద్, రంజిత్ లాల్ జిందాబాద్" అనే నినాదాలు మిన్నుముట్టినవి. వీరంతా ఒకనాడు విజయం పొందిన వీరవరులు; తిరిగి పోటీలో పాల్గొంటున్నారు. ఆ విజయలక్ష్మి ఎవరిని వరిస్తుందో తెలియక, యెవరికివారే కలలుగంటున్నారు. రాజనరేశ్ మూడుసంవత్సరాలు వరుసగా విజయంపొంది అందరినీ ఆకర్షించిన విజేత. ఈ విజేతలు, నూతన ఆకాంక్షితులు వార్ఫు రెండోప్రక్క (నదిప్రత్త

రపుగట్టు)న వచ్చి వరుసగా నిలిచి బాహువులను కుదించుకుంటున్నారు. కాళ్ళను జాడించుకుంటున్నారు. అందు కొందరు స్త్రీలుకూడా వున్నారు. ఆ వరుసమధ్యలో కొద్దిపాటి స్థూలకాయుడూ తనంతట తానే శిరస్సుపై డ్రామాలో కృష్ణపాత్ర ధరించు నెమలిపింఛమున్న కిరీటము ధరించి, అందరి కంటె వుత్సాహితుడై భూమిమీద నిలువ నిష్టములేనివానివలె పాదాలను ఆడించుకుంటూ శరీరాన్ని వూపుకుంటూ తన వక్షస్థలాన్ని తానే చూసి మురుసుకుంటూ తన్మయత్వంలోని దరహాసాన్ని ప్రకటించుకుంటూ మృదువుగా అధరాలతో వూదుతూ, హస్తాలతో తొడలమీద దరువులేసుకుంటున్న నందలాలు అందరినీ ఆకర్షిస్తున్నాడు. పసివారు ఆయన్ను చూసి మరింత ఆనందంలో మునకలు వేస్తున్నారు. వేదికమీద నున్న వేడుకప్రబంధకర్తలు సయితం నందలాల్‌ని చూసి ఆనందపడుతూ "ఈ పోటీలలో నందలాల్ లేకపోతే, ప్రేక్షకులలో యింత మనోరంజనే వుండదేమో! వుప్పులేనిపప్పువలె అయిపోతుందేమో!" అనుకుంటున్నారు. కాని, అతను యెన్నడూ విజయాన్ని పొందనందుకు అందరకూ విచారమే. పోటీలలో ఆఖరునవచ్చుటకు అతనలవాటుపడిపోయాడు. పది సంవత్సరాలనుంచి నందా పోటీలో విసుగులేకుండా పాల్గొంటున్నాడు.

నందా వైశ్యుడు. అతనితండ్రి పేరుబొందిన వ్యాపారి. మెసపటోమియా, మిశ్ర మొదలగుదేశాలలో తనవ్యాపారంలో లభించిన మిత్రవ్యాపారస్తుల ననేకులను ప్రోత్సహించి స్వయంగా సాకేతకు తీసుకొచ్చాడు. వారు శాశ్వ

నివాసాలేర్పరచుకుని ఆయనసహకారంతో వ్యాపారం చేసుకుంటున్నారు. వారందరికి నందాయడల అత్యధిక ఆదరముంది. నందాకు వ్యాపారంతో సంబంధంలేదు. ఆటపాటలతో ఆనందంగా కాలక్షేపంచేస్తుంటాడు. అందుకనే గ్రీకు యువకబృందంతో ఘనిష్టసంపర్కముంది. నాటికాప్రదర్శన కళను మనదేశంలో సాకేతలో గ్రీకులద్వారానే ప్రప్రథమంగా కార్యరంగంలో ప్రారంభించబడింది. బుద్ధవిహార్ లోని నాట్యశాలల్లో యే చిన్ని హడావుడి జరిగినా అందు ముందు నందలాల్‌కూడా గ్రీకుల్లలో కలిసిపోయి హడావుడిగా కనిపిస్తాడు. వారిలోవారికి అభిప్రాయభేదాలు పొడసూపినపుడు బుద్ధభగవానునిసూక్తులను నేత్రాలుమూసి వల్లిస్తుంటాడు నందా. వారంతా విస్మితులై మందహాసాలొలికిస్తూ ఆయన్ను 'అపర సోక్రటీస్' అంటారు. నందాకు ప్రాకృతభాషలో ప్రావీణ్యముందిగాని, సంస్కృతంలో వుత్సాహముండదు. అది ఆయన కంత తేలిగ్గా అర్థంగాదు. అయినా, అపేక్ష వుంది. అందుకే అశ్వఘోష్‌ను అపుడపుడు అంటకాగివుంటాడు. అశ్వఘోష్ వ్రాసిన శ్లోకాలు ఆయన్ను పరవశంచేస్తుంటవి. ఆ అభిమానంతోనే అశ్వఘోష్‌ను యీ విజయోత్సవాలలో పాల్గొని, పరాజయానందాన్ని తనతో పంచుకొనుటకు పట్టుబట్టి వప్పించాడు.

అశ్వఘోష్ దేహము స్థూలమూగాదు, పొట్టీగాదు. పలుచటిశరీరమైనందున యెత్తరిగా కనిపిస్తాడు. మొహం కోలగా అంతంలేనిఆలోచనలతో నిండివుంటుంది. నేత్రాలు భయపడుతున్నట్లుంటవి. నుదురు విశాలమైంది. తండ్రి

పౌరోహితుడు. తాను యేకైకపుత్రుడయినందున పొందిన అమితగారాబంతో కార్యరంగంలేని దిమ్మరిగా వుండి, "సోమరిశుంఠ" అనిపించుకున్నాడు. పగలంతా పట్టణంలోను, బుద్ధవిహార్‌లోను తిరిగితిరిగి వచ్చి రాత్రిపూట ప్రమిదముందు కూర్చుని తండ్రిగారు తయారుచేసి పదిలంచేసుకున్న తాళపత్రాలమీద గరగరమనిపిస్తూ గంటంతో తెల్లవార్లూ వ్రాస్తుంటాడు.

నిద్రమెలకువబొంది ఆ వ్రాస్తున్నది చూసినపుడు "ఒరే నాయనా, వయస్సొచ్చినా ఒక్కదమ్మిడీ సంపాదించలేనివాడివైనావు. నీ వ్రాసుబోని వ్రాతలకు ఆ చక్కటి పత్రాలను, నూనెను ఖర్చుబెట్టుటెందుకు చెప్పు?" అనుట తండ్రి గంగాప్రసాద్‌కి మామూలయిపోయింది. "తెల్లవార్లూ మేలుకుని తరువాత తలనొప్పని మూలుగుతూ ముసుగుబెట్టి పడుకోవటమెందుకు చెప్పు అశ్వం!" అంటుంది తల్లి.

అశ్వఘోష్‌ది అధికంగా మాట్లాడే స్వభావం కాదు. పురాతనరచనలకోరకు కాలుగాలినపిల్లివలె తిరుగుతూ, ఏదోఒకటి లభ్యమైనపుడు బుద్ధవిహార్‌లోని ఏ పొదరింటిలోనో దూరి, ఆ రచనాధ్యయనంలో లీనమైపోతుంటాడు. ఏపనీలేని అపరాహ్నసమయాలందు నిర్జనము నిర్మలము అయినచోట జమునానదిలో దుమికి బాగా అలసటచెందే వరకు యెదురీది, ఆతరువాత వాయుస్థంభనచేసి, శవాకారంలో నీటిమీద తేలి మైలువరకు వాలున కొట్టుకుపోయి, తిరిగి యెదురీతతో దిగినచోటికి చేరుతుంటాడు.

పట్టణంప్రక్కనున్న రామఘాటువద్ద అనేక నాగరిక స్త్రీ పురుషులు గ్రీకునారీమణులు పోటీలుపడి యీదుతుంటారు. కాని అశ్వఘోష్ వీరిలో యెన్నడూ కలియలేదు. అందుకే ఆయనయీత అజ్ఞాతమైనది. అయినా ఎదురీతలో అలవాటుగనుక తన యీతవడితన మెలాంటిదో ఆయనకూ తెలియదు.

గ్రీకుకళాకారులు సంస్కృతశ్లోకాలకు గొప్ప ఆతిథ్యతనిస్తుంటారు. నారిమెప్పులకొరకు సంస్కృతజ్ఞానాన్ని సంపాదించే ఆసక్తితో ప్రయాసపడి, అశ్వఘోష్ స్నేహాన్ని సంపాదించాడు నందనుడు. నందనునికి బౌద్ధ వాఙ్మయమంటే గొప్ప అభిరుచి. అందుకే బుద్ధభగవానుని ప్రవచనాలుగల ప్రాకృతరచనలను కొన్నిటిని సేకరించాడు. వాటిని అశ్వఘోష్‌కి సమర్పించాడు. ఈ రూపంలో వీరిద్దరి ఆత్మీయత పెల్లుబికింది. ఇరువురికి పట్టణంలో ప్రత్యక్షమైన అభిమానంగాని, ఆదరంగాని లేదు. నందనునికి గ్రీకునాట్యప్రదర్శనా సమితివారిలో మాత్రం విశిష్టమైన విలువున్నది. గ్రీకుయువకులుకూడా వ్యాపారాలకు పోతుండుటవలన, స్త్రీలే యెక్కువగా యింటిపట్టునుండుట జరుగుతుంటుంది. నాట్యప్రదర్శనా ప్రయత్నాలన్నీ విశేషించి గ్రీకుయువతులవే. అది మరింత అవకాశాన్నిచ్చింది నందలాలుకు. నందలాలు ఆకాయి పోకాయి కబుర్లకు, విచిత్రఅభిప్రాయాలకు, అర్థంలేనిఆలోచనలకు, పురుషత్వాన్ని మర్చిపోయి తానూ స్త్రీవలె తమతో కలిసిమెలగుటకు వారు మనోరంజనతో పొంగిపోయి, ఆయనపేరును స్త్రీలింగంలోకి మార్చి హాస్యాలు

పట్టిస్తూ "ఈ నందిని లేకపోతే మాకు సందడేలేదు" అంటుండేవారు.

పర్వతాలలో కైలాసపర్వతంవలె, కట్టడాలలో తాజ్ మహలువలె, నదులలో గంగానదివలె, సామ్రాట్టులలో అశోకసామ్రాట్టువలె, ప్రవక్తలలో బౌద్ధప్రవక్తవలె గ్రీకుయువతులలో ప్రభ విశిష్టస్థానాన్ని కలిగివుంది. అందాల పోటీలో ఆమె లోకవిజేతకాగలదు. ఆమెపలుకులలో మధురాలొలుకు కమనీయతవుంటుంది. ఆమె పాడితే పాషాణాలు మంచుకొండలు సూర్యరస్మికి కరిగి కారినట్లు ద్రవాలై తొణికిసలాడుతవి. ఆమెనవ్వు కారుమేఘాలలోని మెరుపును మరపిస్తుంది. ఆమెఅధరాలు రెండుక్రొనడులను నరుసజేసి వాల్చినట్లుండి గులాబిరేకులవలె అరుణవర్ణంలో నిగనిగలాడుతుంటవి. ఆమెలలాటము విశాలస్ఫటికఫలకమువలె నునుపులుదేలి శోభిస్తుంటుంది. విశాలమైన మీననయనాలమీది ఫలకాల కాటుకరంగు అద్వితీయఅందాన్ని గల్పిస్తుంటుంది. ఆమెముఖమండలము కోలగాను లేదు, గుండ్రమూ గాదు; సోగఆకారములో వుబ్బివుంటుంది. ఆమెకపోలాలు ఫాలభాగానికంటె విశాలమై మధ్య వుబ్బుదేలి ముఖమంతటికీ నిండుతనాన్నిస్తూ ఆకర్షిస్తుంటవి. ఆమె నవ్వినపుడు ఆ కపోలాలమీద లీలగా గనిపించు వక్రాలు మరింత మెరుగులు దిద్దుతుంటవి. చుబుకము తీర్చిదిద్దినట్లు పంచమినాటి చంద్రబింబమువలె వుంటుంది. ఆమెనాసికానిర్మాణంలో బ్రహ్మతననైపుణ్యాన్నంతా చూపాడు. తీర్చి అమర్చినట్లుంటుంది.

తరతరాలుగా వారికుటుంబం వ్యాపారస్తులు. తండ్రి దత్తమిత్రుడు బౌద్ధమతస్థుడు. ఆయనతండ్రికాలంలో వ్యాపారసంబంధంగా సాకేతమునకు వచ్చి స్థిరపడిపోయారు. బౌద్ధమత ఆచారవ్యవహారాలు విశ్వాసాలు జీర్ణించుకుపోయిన కుటుంబ మది. బుద్ధభగవానుని ప్రవచనాలు, కార్యరంగం లోని యదార్థస్వీకారము అహింస, సంఘసేవ వారిని నిత్య నూతనత్వంతో ఆకర్షిస్తుంటవి. తనసతీమణి బౌద్ధమతాచారా లను, హిందూమతాచారాలను మిళితంచేసి పాటిస్తున్నపుడు అంతర్గతంగా విస్మితుడవుతూ పట్టనట్లు వూరుకునేవాడు. అయిష్టకార్యాలు సలిపినా తన సతియెడల కరుణాభరితుడై వుండేవాడు. ఆమె తనపుత్రిక పేరు భారతీయసాంప్రదాయం లోని 'ప్రభ' అని పెట్టినపుడు ఆయన మందహాసంచేసి వూరుకున్నాడు. ప్రభ జన్మించినపుడు పేరుబొందిన పండి తోత్తముడయిన గంగాప్రసాద్‌ను పిలిపించి పూజలుసలి పించి, జాతకచక్రం వ్రాయించి, నామకరణభారం పండి తునికే వదిలింది. ప్రభసంవత్సరంలో జన్మించింది గనుక 'ప్రభ' నామధేయమే పెట్టమని చెప్పాడు పండితుడు. అందు కామె పరమానందభరితురాలైంది.

"మానవప్రతిభ యెంత శక్తివంతమైనదయినా, స్వయంప్రకాశం పొందజాలక అజ్ఞాతశక్తికోరకు వెదుకు తుంటుంది." అని పరిహాసంచేశాడు దత్తమిత్రుడు. ఆమె క్రోధాన్నభినయిస్తూ "ఎదుటివారి త్రుటుల వెదకుటకూడా మానవస్వభావమని గుర్తుంచుకోండి మహాశయా" అన్నది. ఆయన మళ్ళీ అనునయకంఠంతో "ఉన్నమాటంటే ఉలు

కెందుకు చెప్పు? నీవు అటు బౌద్ధమతాన్ని స్వీకరిస్తివి, యిటు హిందూపండితుని పిలిచి పూజలూ పునస్కారాలు చేయించి, ఆయనచేతనే నామకరణంచేయిస్తివి పాపాయికి.” అన్నాడు. ఆమె అధరాలు బిగబట్టి జాలిగాజూస్తూ “నామీద మీకు పరిహాసం పరిపాటయిపోయి అంటున్నారు గాని, చాలామంది బౌద్ధమతస్తులయిళ్ళలో యిలానే జరుగుతున్నది.” అన్నది. ఆయన నవ్వుముఖంతో “అందుకే మానవునికి విశ్వాసము తృప్తి లోపించినవంటున్నాను. బుద్ధభగవానుని సూక్తులు విన్నపుడు యదార్థసత్యాలు ప్రత్యక్షప్రమాణికాలుగా గోచరించి మనస్సు అటు మొగ్గుతుంది. కొంతదూరం పోయాక పిరికితనం వెంటాడుతుంది. వెంటనే యిటు మంత్రతంత్రాలవైపు మొగ్గుతుంది. వాటినీ వీటినీ మిళితంచేసి ద్వంద్వపయనంలో ఆత్మానందాన్ని సమకూర్చుకుంటారు. ఇది వుభయభ్రష్టత్వం కాదా చెప్పు?” అన్నాడు.

ఆమె చేతులుజోడించి నమస్కరిస్తూ “మీ పాదాలకు మ్రొక్కుతాను, ఈ సమయంలో అశుభవాక్కులు పలక్కండి. నా బిడ్డ బాగుండాలని అన్ని దేవుళ్ళకూ మ్రొక్కుతాను. పుణ్యభూమిగా పేరుపొందిన యీ దేశంలో వున్నాము; యిక్కడే నా బిడ్డ జన్మించింది. ఇక్కడి పేరే పెడతాను, ఇక్కడి దేవుళ్ళకే మ్రొక్కుతాను. నన్ను పిచ్చిదో వెర్రిదో అనుకోండి; నాకు చింతలేదు.” అన్నది భయకంపితకంఠంతో.

ఆయన దంతాలుబిగబట్టి నేత్రాలు పెద్దవిచేసి, హస్తంచాచి పరిహాసాన్ని కోపాన్ని మిళితంజేసినకంఠంతో "ఓ మహాదేవీ, నిన్నుగాదు నేను అంటున్నది, నీలాంటి వారందరినీ. ఇది పుణ్యభూమి గనుకనే, దేవుళ్ళసంఖ్య అసంఖ్యాకమయింది. ధర్మభూమి గనుకనే న్యాయం వ్యగ్య మైంది. అందుకే బుద్ధుడు వాటన్నిటిని తుడిచి, సంఘాన్ని చూపి సంఘక్షేమము, సంఘాభివృద్ధికొరకు సంఘసేనలో ఆత్మార్పితంచేయుటలోనే మానవలోకపు వున్నతిగలదని సంఘాన్ని చూపాడు. ఇపుడు మీరంతా చేరి ఆయన్నూ దేవుళ్లసంఖ్యాలిస్టులో కలిపి మిశ్రమపూజలు సలుపుతున్నారు. ఇది బౌద్ధమతంయెడ ద్రోహంగాదా చెప్పు?" అన్నాడు.

ఆమె అనభిజ్ఞురాలివలె వెలవెలబోతూ "ఇది బుద్ధ భగవానునియెడల ద్రోహమవుతుందంటారా? అయితే మరి యిక్కడ బౌద్ధమతస్థులంతా యిలాగే చేస్తున్నారండి!" అన్నది.

ఆయన వికటంగానవ్వుతూ "ఈ పుణ్యభూమిపై జరిగే ఘోర అఘాయిత్యాలకుకూడా ఏదో ఒక దేవుణ్ణి, అవసరాన్ని అవకాశాన్ని కల్పించి పుణ్యంగా సృష్టిస్తారు. అందుకే యిక్కడ అంత మానవకల్యాణకరమైన బౌద్ధధర్మం అడుగంటిపోతున్నది. అవిచ్ఛిన్నమైన విశ్వాసంలేనిచోట యిలానే జరుగుతుంటుంది. ఒక దేవునిమీద, ఒక విషయం మీద విశ్వాసంలేకపోతే జరిగేది అనర్థకమే" అన్నాడు.

మ్లానత చెందినముఖంతో విమూఢురాలివలె రుద్ధ కంఠంతో "ఇలాచేస్తే బుద్ధభగవానునికి అపచారంచేసినట్లవు తుందంటారా ?" అని ప్రశ్నించింది.

విజయంపొందిన వీరుసివలె పోజుబెట్టి, ఆయన "అవును" అన్నాడు. ఆమె గొప్ప అపచారం జేసినదానివలె కన్నీరుకారుస్తూ, స్వహస్తాలతో లెంపలు వేసుకుంటూ "బుద్ధదేవా! బిడ్డమీది మమకారంకొద్దీ యీ అపరాధం చేశాను. వ్యక్తిగతస్వార్థంతో యీ దేశంలోనివారంతా యిలాంటి అపచారాలను నిత్యమూ చేస్తున్నారు. అవిచ్ఛిన్న మైన విశ్వాసంతో మీరు చూపిన వెలుగులోనే నడువగల శక్తిని నాకు ప్రసాదించు భగవాన్ !" అని ప్రార్థించింది.

ఆయన కిలకిలనవ్వుతూ "నీవు పట్టి పిచ్చిదానివి. స్త్రీ స్వభావమే అంత విచిత్రమైంది గౌతముడు మానవునికి సంఘబుద్ధిద్వారా సమష్టిసుఖంతో మానవతరణోపాయ విధానాన్ని చూపాడు. అలా నడుచుకోమన్నాడుగాని, ఆయనకుగాని మరొకరికిగాని పూజలు పురస్కారాలు చేయమనలేదు. పాపపుణ్యాలు నరక స్వర్గాలే ఆయన పట్టి బూటకమన్నాడు. ఇక మీబోటి ఆయన వెర్రిభక్తులు ఆయన్నే దేవునిజేసి పూజిస్తున్నారు." అని హేళనగా అన్నాడు.

ఆమె క్రోధాన్ని ప్రస్ఫుటంజేస్తూ "మీరు అప్రస్తుత మైనవి చెప్పకండి. ప్రతిదీ విమర్శిస్తూ కూర్చోవటం వృద్ధ లక్షణాన్ని ప్రకటించుకోవటమవుతుంది. ఎవరిమీదనైనా భక్తివిశ్వాసాలు లేనిదే లక్ష్యమెలావస్తుంది? పెద్దవారికి

నమస్కరిస్తాము. అందరికంటె పెద్దవారిని పూజిస్తాను, విశ్వసిస్తాము. అది అపరాధమా? ఏమిటి? ఆయన్నొ మామూలువ్యక్తిగా భావిస్తే భక్తివిశ్వాసాలు యెక్కువ కాలం నిలువకపోవచ్చు; మీరు ఏమయినా అనుకోండి, నేను పూజిస్తాను." అంటూ ఆమె విసురుగా వెళ్ళిపోయింది. ఆయన జాలిగొల్పు ప్రేమదృక్కులతో ఆమె వెళ్ళినవైపే చూస్తూ వుండిపోయాడు.

ప్రభ అల్లారుముద్దుగా ఒకప్రక్క శాస్త్రోక్త బౌద్ధమతావలంబియైన తండ్రినడిలోను, మరోప్రక్క బుద్ధభగవానునియెడల అపారభక్తితో వుంటూ, హిందూసాంప్రదాయాలయెడ ప్రభావితురాలవుతూవున్న ప్రియమాతవడిలోను పెరిగి పెద్దదయింది.

బుద్ధవిహార్ నాటికాప్రదర్శనశాల ప్రబంధకర్త నేడు ప్రభే. ప్రభకు ప్రధమశిష్యుడుగా తయారయినాడు నందలాల్. నంద్‌లాల్ అమాయకుడు, స్నేహశీలి అని ఆమె మరింత ఆదరంగా చూస్తుంటుంది. నందలాల్ ప్రోత్సాహంతో తప్పక ఆమెకూడా యీతలపోటీలో పాల్గొనుటను సమ్మతించింది.

ఒకమాటు గెలుపుపొందినవారు తిరిగి పాల్గొంటే ఆ కీర్తి పోతుందేమోనని భయంతో తిరిగి యెక్కువమంది పాల్గొనరు. వోడినవారు తిరిగి పాల్గొనుట హాస్యాస్పదమని విరమించుకుంటారు. కాని, నందలాల్ అందుకు భిన్నుడు. వోటమినిగురించి అతనికి లక్ష్యంలేదు. పోటీలోపాల్గొని పొందే ఆనందమే అతనికి సంతృప్తినికలిగిస్తుంది. పదిసంవత్స

రాలనుంచి వరుసగా నోడిన అనుభవశాలి. తన దీర్ఘాను భవంతోనే తనకుతోడుగానుండను నో ప్రక్క ప్రభను ప్రోత్స హించాడు, మరో ప్రక్క అశ్వఘోషను ప్రోత్సహించాడు. అతని అమాయకత్వము నిస్వార్థత్వము, అల్పసంతోషము వివేకులను మరింత ఆకర్షిస్తుంటవి. అందువలన నందలాలు ప్రోత్సాహాన్ని అశ్వఘోష్‌కూడా అంగీకరించక తప్పలేదు. ప్రభకుగాని అశ్వఘోష్‌కుగాని గెలువగలమని, గెలవాలనే ఆశగాని లేశమాత్రమూ లేదు. నందలాల్‌తోపాటు మనో రంజననిమిత్తం పాల్గొనుటే వారిఆశయం. నందలాల్ కోరేదీ అదే.

ఈ పర్వదినంలాంటి క్రీడాపండుగ సాకేతలో యెంత కాలంనుంచి జరుగుతున్నదో యెవరికీ తెలియదు. వృద్ధులు కూడా తమబాల్యంనుంచీ యిదేరీతిలో హోలీపండుగరోజు వస్త్రవిహీనంగా స్త్రీపురుషులు ఈతలోపాల్గొని ఆ ప్రక్క నుంచి యీ ప్రక్కకు ముందుజేరినవారి నా సంవత్సరపు విజేతగా పరిగణించి, వారిని యేనుగఅంబారీమీద వూరే గించి, జేజేనినాదాలతో సత్కరించుట జరుగుచున్నట్లు చెబుతుంటారు. ఇందు రాకుమారులు రాకుమార్తెలు అంతఃపుర స్త్రీలుకూడా పాల్గొన్నట్లు చరిత్రవుంది. రామ ఘాటుప్రక్కనున్న శిలాశాసనంమీద వరుసగా యీ ఈతపోటీలలో గెలిచినవారిపేర్లు వరుసగా సంవత్సరవారీగా చెక్కివున్నవి.

# సరయూ విజయము

వేదికమీదనున్న అధిష్టానవర్గంవారి సౌంజ్ఞతో పుర పాలకసంఘుంజవాను మొదటి హెచ్చరికగా శంఖాన్ని పూరించాడు. మరికొందరుకూడా సిద్ధమైయున్నలైనులో చేరిపోయారు. హంగామాచేస్తూ నిలిచివున్న నందలాల్ లైను నొకమాటు పరికించి, ఆదుర్దాచిహ్నాలతో వెనుక నున్న ప్రేక్షకబృందాన్ని తిలకించాడు. అందు వెనుక ముందులాడుతూ నిలిచివున్న అశ్వఘోష్ కనిపించాడు. నంద్‌లాల్ రివ్వున వెళ్ళి అశ్వఘోష్‌హస్తంబట్టి లాగి లైనులో నిలిపాడు. పాపం! అశ్వం వివశుడై నిలిచి పోయాడు. ఇంకా యెవరికోరకో నందా వెదుకుతున్నాడు. జనంమధ్యలో దాగి, మందహాసంచేస్తూ చూస్తున్న ప్రభ కనిపించింది. జనంలో జొరబడి నందా ఆమెనుకూడా లాక్కొచ్చి తన ప్రక్కన నిలిపి, తానే విజయంబొందినట్లు మురిసిపోతూ దుస్తులనువిప్పి వెనుకప్రక్క వదిలాడు. అందరి కంటె ముందే తయారయి అందరివెనుక వడ్డుకుచేరటం ఆయనకలవాటు.

ద్వితీయశంఖారావంకూడా వినిపించింది. అందరూ వస్త్రాలను విసర్జించారు. నందాకు ఒకప్రక్క అశ్వం, మరో ప్రక్క ప్రభ వున్నారు. కాని, వారిలో ఒకరికొకరితో పరిచ యంలేదు. తృతీయశంఖారావంతో అందరూ ఒక్క మాటుగా కదనరంగములో కుదుకు సైనికులవలె నదిలో

దుమికాడు. రాజనరేశ్ హస్తాలు బారలుచాచుకుంటూ ఒంటెనడకనుబోలినట్లు అందరికీముందు అందకుండా పోతు న్నాడు. నందాను చలిబాధ పీడిస్తున్నదో, వుల్లాస మెక్కు వైందో సుడులుదిరుగుతూ అందరికంటె నాలుగుబారలు అధికంగా సర్కస్‌లోని జఫ్రూస్‌వలె వేసి, యీలలు వేసు కుంటూ తనను అందరూ గమనించునట్లు ఛాతీవరకు పైకి లేస్తూ ఫీట్సు ప్రదర్శిస్తున్నాడు. రెండుప్రక్కలా రెండు నావలు వారికి సమానాంతరంగా పరుగులెడుతున్నవి. అందున్న అధ్యక్షస్థానన్యాయాధీశులు దుర్భిణుల సహాయంతో యేకాగ్రంగా చూస్తున్నారు. పందిగజాలు దాటారు. రాజ నరేశ్ అందరికీముందు తేజోవంతంగా పోతున్నాడు. అందరి దృష్టికీ రాజనరేశ్ విజేతగా తోచింది. 'రాజనరేశ్ జిందా బాద్' అనే నినాదాలు మిన్నుముట్టుతున్నవి. ప్రభ చేతు లను నీటిలోపలే వుంచి కప్పయీతతో ఒక్కొక్క కుదు పుతో రెండుగజాలు దూకుతూ నరేశ్‌కు కొద్దివెనకవరకు చేరింది. ప్రజలలో కలవరం బయలుదేరింది. ప్రభ విజయం బొందే సూచనలు గనిపిస్తున్నవి, స్త్రీలలో వుత్సాహం పర వళ్ళుత్రొక్కుతున్నది. ప్రభ జిందాబాద్ అనే నినాదాలతో పాటు ప్రభ నరేశ్‌నుదాటి పదిగజాలు ముందుకుపోయింది. నరేశ్ నిరుత్సాహితుడైనాడు. ప్రేక్షకులందరి దృక్కులూ ప్రభమీద కేంద్రీకృతమై యున్నవి. స్త్రీలనుంచి గొప్ప ప్రోత్సాహనినాదా లందుతున్నవి ప్రభకు. పురుష ప్రేక్షకులంతా నివ్వెరపోతూ ఆశ్చర్యాన్వితులై వింతగా చూస్తున్నారు. ప్రభ నరేశ్‌నుదాటి యిరవైగజాలు ముందు

కొచ్చింది. నదిమధ్యభాగానికి చేరారు. నదిరెండువైపుల నుంచి కరతాళధ్వనులు జేజేనినాదాలు వినవస్తున్నవి. ప్రభ యీతదూకుడు యింకా పెరుగుతున్నది. ఉత్సాహబలం ఆమెకు మరింత జోరునిస్తున్నది. పాపం నిరుత్సాహం రాజ నరేశ్ శక్తిని కుంగదీసివేస్తున్నది. నందనుడు అందరివెనుకా అలుపుసలుపు లేకుండా ఆదుర్దా ఆవేశాలు లేకుండా ఆనందోత్సాహాలతో ఫీట్సుసలుపుతూ ప్రేక్షకుల కరతాళ ధ్వనులు తనకే జరుగుతున్నట్లు పరవశుడవుతూ, తానూ మధ్యమధ్య కరతాళధ్వనులుచేస్తూ, మునిగిపోయి, తిరిగి పైకిలేచి పోరుషంకలిగినట్లు పదిగజాలు ఆవేశంతో యీది, ఘనకార్యంసాధించినవానివలె ప్రేక్షకులవైపు అటూయిటూ వీరదృక్కులను బరపుతూ పసివారలకుమాత్రం మరింత ఆనందాన్నిగల్పిస్తూ అందరివెనుక పోతున్నాడు. నందలాల్ పోటీలో లేకపోతే ప్రేక్షకులలోని పిల్లలకు ఆ పుత్సాహమూ, ఆనందమూ, కేరింతలూ వుండవనిపిస్తున్నది. ఆ పిల్లలకు విజేతతో సంబంధంలేదు. కేవలం వారివేడుక ప్రారంభంనుంచి ఆఖరివరకు నందాతోనే ముడిపడిఉంది.

ప్రేక్షకులలోను ప్రముఖులలోను ప్రభ...విజేతగా స్థిరపడిపోయింది. స్త్రీ విజేతగావటం ముదావహమని పుర ప్రముఖు లనుకుంటున్నారు. బౌద్ధబిక్షువులకు, స్త్రీలకు ఇది మరింత ఆహ్లాదాన్ని గలిగిస్తున్నది. నాగసర్పము నీటిలోపడి బెదిరి, భీతితో తనపడగ పూర్ణంగా విప్పి, మంచుకొండనుంచి బరబర జారుతున్నదానివలె పరువులెత్తునట్లు యెవరో ఒక

బక్కపలుచటివ్యక్తి నీటిమీద బారలుచాచకుండా, కప్ప యీతవలె దూకుటకాకుండా, స్టీమ్‌యింజన్‌బోటువలె అతి వేగంగా సరసర వస్తుండుట జూచి అందరూ నివ్వెరపోయి చూస్తున్నారు. రెండునిమిషాలలో ఆ వ్యక్తి ప్రభప్రక్కకు సమానాంతరంగా చేరాడు. ప్రేక్షకస్త్రీబృందాలు హతాశులై నిట్టూర్పువిడుస్తూ "ప్రభా, ముందుకు పద, ఆ సర్ప యీతగానిని మిగులనీయకు" అని నినాదాలుచేస్తున్నారు. పురుషులలో యెవరోఒకరు పట్టజాలక చప్పట్లుచరుస్తూ "ఓసర్పయీతగాడా! ఆ కప్పయీతను మింగివెయ్యి" అని కేకలుపెట్టాడు. పైనుంచి తనకు జోరుగా వస్తున్న ప్రోత్సాహాన్ని పట్టజాలక తనప్రక్కగా ముందుకుపోబోతున్న ఆ వ్యక్తిమొఖాన నీరు బాగా పడునట్లు బారలుచాచి యీత వేస్తున్నది ప్రభ. పాపం ఆ పాముయీతతో పోతున్న వ్యక్తి ముఖంపై క్షణక్షణమూ తుంపర్లు జోరుగా పడుతున్నందున వివశుడై జోరును తగ్గించవలసివచ్చింది. ప్రభ మరింత ప్రోత్సాహప్రేరితురాలై బారలను యింకా జోరుగా వేస్తూ ప్రక్కవ్యక్తిముఖానికి నీరు తపాతపా తగులునట్లు చేస్తున్నది. గాలిలో తేలియాడు విహంగమువలె నీటిలో నిపుణుడైన ఆ వ్యక్తి ఆమెచిలిపిచర్యలనుంచి తప్పుకొనుటకు గాని, అరికట్టుటకుగాని శక్తిహీనుడుగాదు. ఆయనస్వభావం విజయానికి అర్రులుచాచునదిగానట్లు తోస్తున్నది. మధ్యలో స్వాభావికం గాకలిగిన పుత్సాహంతో అందరిముందుకూ రాగలిగాడు. ప్రభ చిలిపిగా యీర్ష్యాద్వేషిగా, స్వార్థిగా చేస్తున్నచర్యలు

ఆయన్ను పులకరింపజేస్తున్నాో యేమో సహిస్తూ ఆమెకు అతిసన్నిహితంగానే సమానంగానే పోతున్నాడు. ఆయన మొండితనానికి విసిగి గాభోలు ప్రభ ఇంకా వుగ్రతరూపంలో ఆయనముఖానికి నీటినికొడుతున్నది. ప్రత్యామ్నాయంగా తిరిగి చిందించుట కాయన కిష్టంలేక, నీటిలోపలగా ఆమెకుడి చేతిమణికట్టును గట్టిగా పట్టి లోపలకు నొక్కి, పైకిలేవనీయకుండా వుంచాడు. ఆమె వెలవెలబోతూ, నిస్సహాయతలో నిట్టూర్పువిడుస్తూ ఆ ద్వితీయహస్తాన్నికూడా పైకి బారచాచకుండా లోపలేవుంచి, యీదుతూ ఆయాసపడుతున్నది. న్యాయప్రముఖులు దుర్భిణిలతో అతిశ్రద్ధగా పరికిస్తున్నారు. ఈ నీటిలోపలి వీరిరువురి చర్య వారికి గోచరించుటలేదు. వారికీ విషయం తెలిస్తే దోషం యెవరికంటగడతారో తెలియదు.

ఆమెహస్తాన్ని గట్టిగా నీటిలోపలే పట్టివుంచినవ్యక్తి వంటిచేత్తోనే అవలీలగా యీదగలుగుతున్నాడు. కాని, ప్రభ శక్తి క్షీణించి, తనహస్తాన్ని గుంజుకో ప్రయత్నించి విఫలురాలవుతున్నది. ఇప్పుడు యిద్దరూ ఒకేసమానాంతరంలో పోతున్నారు. ఇది ప్రేక్షకులకు విచిత్రంగా తోస్తున్నది. వారిరువురు రాజీపడి సమబాలెన్సులో యీదుతున్నట్లు తోస్తున్నది. యదార్థాని కిప్పు డామె యీదుటలేదు. మునగకుండా తేలియాడుటకుమాత్రమే ప్రయత్నిస్తున్నది. ఆమె ఆశలు క్షీణించినవి. కాని ఆ వ్యక్తి ఆమెను తనతోపాటే కతుబూనినవానివలె, ఖైదీని తీసుకెళ్ళు పోలీసువలె గుంజుకెళుతున్నాడు. అపుడపుడు ఆమెను ముందుకు నెడుతున్నాడు. ఆమె అగాధజలరాశిమీద పయనిస్తున్నది. అలసటతో క్షీణిం

చినశక్తితో నున్నది. కానిపత్నంలో కసిదీర ఆ వ్యక్తికి లెంప కాయలు ముట్టజెప్పేది. ఆమెదృష్టి యిపుడు ప్రేక్షకులమీద లేదు; విజయంమీద లేదు; వియూఘరాలివలె అతనిముఖ మండలాన్ని తదేకంగా చూస్తూ, పాదాలను వంటిచేతిని ఆడిస్తున్నది. అతనినేత్రాలు జ్యోతులవలె రక్తాన్ని చిందిస్తున్నవి. తను చిందించిన నీరు పడినా, ఆ ముఖంలో క్రోధంగాని, యీర్ష్యగాని కనిపించుటలేదు. నిర్మలప్రశాంతత వుట్టిపడుతున్నది. ఆమె బాగా పరికించినపుడు ఆ వ్యక్తి నందలాల్ చే బలవంతంగాలాగి నెట్టుకుంటూ లైనులో నిలుపబడినవాడే. ఆ పలుచటివ్యక్తిలో యింతశక్తి యెక్కడ నిండి నిబిడీకృతమైయున్నదా అని ఆలోచిస్తున్నది. ఆ వినీలకాంతుల నీటిలో ఆయనశరీరం సుస్పష్టంగా తామ్రవర్ణంలో నరాలు వుబికి కండరాలు తేలి కనిపిస్తున్నవి. అతను పట్టినచోట తన చేయి వత్తుకొని నొప్పికలుగుతున్నందున కిందకు గుంజి వదిలించుకున్నది. తిరిగి పట్టుకుంటాడనే భయంతో అతని ముఖాన్ని ఒకమాటు పరికించి, ముందుకు చొరుచుకుపోతున్నది. ఆయనఅధరాలపై చిలికిస్తున్న చిరునగవు కనిపించింది. అప్రమత్తుడై అద్దంలోవలె కదులుతున్ననీటిలోని ఆమెశరీరాన్ని చూస్తూ పులకితుడవుతున్నాడు. కనకాంబరకాంతులను వెదజల్లుతున్న ఆమెసుకుమారశరీరం నీటిలో అద్వితీయమైశోభిస్తున్నది. ఆమెశరీరంలో యెక్కడా నరాలు కనిపించుటలేదు. వెన్నముద్దవలెనున్న ఆ సుకోమల సుందరశరీరానికి నీటిలో యింత కష్టపడుతూ, యింతసునాయాసంగా యీదగలశక్తి యెలా అలవడిందా అనే ఆలోచనలు ఆయనమన

స్సులో చిత్రవిచిత్రంగా దొర్లుతున్నవి. గ్రీకుశిల్పకారులు చెక్కిన 'వీనస్' విగ్రహాన్ని తిలకిస్తూ సర్వాన్ని మరచి పోతున్నవానివలె ఆయన నీటిలో కదులుతూ జిలిబిలినృత్యం సలుపుతున్న ఆమెవక్షోజాలను చూస్తూ పోటీవిషయం మర్చిపోయాడు. జన్మలో యెన్నడూ యెరుగని కుతూహలమేదో ఆయనహృదయాంతరాళంలో జనించి, అజ్ఞాతఆనందానుభూతి నిస్తున్నది. ఈ వినూత్న ఆనందానుభూతిలో కలుగుతున్న జలుగుజలుగుమత్తు ఆయన్ను పరవశంచేస్తున్నది.

ఆమె యీతలో నడుపు జోరుజేసింది. తను యెక్కడ తన స్నిగ్ధదృష్టిని కేంద్రీకరించి పరవశంపొందే ఆనందాన్నందుకుంటున్నాడో అది దూరమవుట చూసి సహింపలేక అనాలోచితంగా నీటిలోపల ఆడుతున్న ఆమెపాదంపట్టి వెనక్కు గుంజాడు. బారెడు వెనక్కు వచ్చేసింది. ముందుకు పోతున్న ప్రభ హటాత్తుగా వెనక్కువచ్చుట యెందుకు జరిగిందా యని న్యాయమూర్తులు దుర్భిణిలో వెదుకుతున్నారు. ఆమె వుడికిపోతున్న వుక్రోషంతో ఆయన్ను కొరకొరచూస్తూ, అధరాలుబిగబట్టి ప్రక్కకుతిరిగి లోతునుంచి పాదంతో ఒక్కతన్ను తన్నింది. ఆయనమనస్సులోని అజ్ఞాత ఆలోచనలతోపాటు ఆమెయెడల తనకు తెలియకుండా తనహృదయంలో జనించిన ఆదరం అదృశ్యమైనది. ఆమెకుదూరంగా వెళ్ళి రెండునిమిషాలలో చాలా ముందుకెళ్ళిపోయాడు. తిరిగి ఆయనమనస్సులో ఆ స్మృతులు మెదిలినట్లయి వెనుదిరిగి చూశాడు. ఆమెముఖంలో నిరాశ ప్రక

టితమైంది. ఆయనకు తెలియకుండానే వడి తగ్గిపోయింది. తిరిగి ఆమెకుసమానాంతరమయ్యాడు. ఆమె యెవరిమీదో అలిగినదానివలె మ్లానతచెందినముఖంతో ప్రక్కలకు తన దృష్టినిపడనీయకుండా ముందుకు యేకాగ్రంచేసి అధీరతతో యీదుతున్నది. ఆయనలోని వుద్రేకాలు పొంగి గాబోలు, వివశుడై ఆమెచేతిని మొదటివలెనే పట్టి మహావేగంగా ముందుకు లాక్కుపోతున్నాడు. వీరివైమనస్యంలో వెనుక వారు వీరిదాపుకు చేరినవారు హతాశులై నిస్పృహపొంది వడినితగ్గించుకున్నారు. డింగీనిలాక్కెళ్ళు యాంత్రికనావవలె ఆయన లోతున ఆమెచేతిని అదిమివుంచి, తాను బరబర పోతుంటే ఆమె నీటినికోసుకుంటూ సరసర వెళ్ళిపోతున్నది. అది ఆమెకే ఆశ్చర్యాన్నిగొలుపుతున్నది. ఆ బక్కపలుచటి వ్యక్తిలో యింతశక్తి యెలా నిబిడీకృతమైయున్నదా అనే ఆలోచనలో ఆమె స్వరమూ మర్చిపోయింది. ఆయనకు నీటిలోయీత నేలమీది పరుగులాంటిదని, నివ్వెరపోతూ కోరదృక్కులతో ఆయన్ను తదేకంగా చూస్తున్నది. వీరిరు వురూ వరుసగా యీదుతుండటానికి కారణాలు ప్రేక్షకులకు తెలియుటలేదు. ఇరువురిలోను సమశక్తి, సమనేర్పు వున్నం దున ఒకరికి మరొకరు యెంత పెనుగులాడినా యెవరూ నెగ్గ లేకపోతున్నట్లు ప్రేక్షకులూ అధిష్ఠానన్యాయమూర్తులు అను కుంటున్నారు. ఒడ్డు సమీపిస్తోంది. ప్రేక్షకబృంధాల హడా వుడులు యెక్కువయినవి. మేళతాళాల వాయిద్యగాండ్రు సన్నద్ధులవుతున్నారు. ఆ వ్యక్తి మృదువుగా ఆమెవంక

చూస్తూ, తనవడిని తగ్గించి, ఆమెను ముందుకు గుంజి చేయి విడిచాడు. ఏదో కొండశిఖరంమీద విహరిస్తుండగా కాలు జారితే మృదువైన పూలపాన్పుమీద మెత్తగా పడినట్లయి, ప్రక్కగా ఆయన్ను కరుణాభరితదృక్కులతో పరికించింది. ఆయనలో ఆవేగంగాని, ఆదుర్దాగాని లేక నిర్మలవదనంతో ప్రశాంతంగా నెమ్మదిగా యీదుతున్నాడు. అయాచితంగా లభ్యంగానున్నట్లున్న యీ విజయాన్ని చేపట్టను ఆమెమనస్సు కళవళంతో ఖంగారుచెందుతున్నది. అతనిలో పంతంలేని త్యాగం ఆమెహృదయాన్ని వంచించింది గాబోలు, నెమ్మదిగానే యీదుతున్నది. ఆ శీతలనీటిలో ఆమెమనస్సు ఆలోచనలతో వేడెక్కిపోతున్నది. ఆమె విజయంమాట, సదివద్దుసంగతి మర్చిపోయి, అతనివైపే దృష్టివుంచి పోతున్నది. ఆయన ఆమెదృష్టికి సన్నిహితుడై నిశ్చలంగా నిరుద్వేగంగా, శశిరపుతువులో మంచుబిందువులతో శోభించే కమలమువలె ద్యోతకమవుచున్న ఆమెముఖమండలాన్ని చూస్తూ ఆమె కదములో కదముకలిపినట్లు సమానాంతరంలో పోతూ "ఈ పాడువిజయములో యేమి ఆనందముంటుంది? ఆమెహృదయముపై విజయములో యీ సర్వజగత్తును మత్తులోముంచగలశక్తి వుంటుంది. ఆమెహృదయవిజయము స్వర్గవిజయమవుతుంది. దేవతలలో యీ సౌష్టవ మెందుకుంటుంది? ఇంతఅందమై యీ శృంగార సుకుమార వదనానికి యింత శ్రమనిస్తున్న యీ పాడువిజయములో అంతకుమించిన మాధుర్య మేముంటుంది" అనుకుంటూ ఆమెవైపు రెప్ప

లార్పకుండా చూస్తున్నాడు. అనాలోచితంగా అప్రమత్త తతో యీదుతున్న వారిరువురిహస్తాలు ఒక్కమాటుగా ఒడ్డుకు తగిలినవి.

ముందే వడ్డున నిలిచి, సంభ్రమాశ్చర్యాలతో తిల కిస్తున్న పురప్రముఖులు ఆ యిరువురను పైకిలాగి వెలవెల బోయి చూస్తున్నారు. ప్రభ బిడియంతో శిరస్సువంచి కోణ దృక్కులతో ఆయన్ను చూస్తున్నది. శంఖారావం విజయ నాదాన్ని ప్రతిధ్వనిస్తున్నది. వాయిద్యాలు విజయరాగాలా పనలు సలుపుతున్నవి. "ప్రభాశ్వఘోషులు జిందాబాద్" అనే నినాదాలు ప్రజలనుంచి పిక్కటిల్లుతున్నవి. జనము కోలాహలంతో పడద్రోసుకొంస్తున్నారు. గజరాజము ఘీంకా రముతో స్వాగతపలుకులు చెబుతూ జరీపోగులతో అల్లబడిన అమూల్యసుగంధపుష్పమాలను తొండముతో బట్టి ముందుకు వస్తున్నది. కాని, పురప్రముఖులు విచిత్రసంకటంలోపడి దారి తెన్నులు తోచక తమలోతాము తమదైన్యతకు నొచ్చు కుంటున్నారు. ఈ వేడుకలచరిత్రలో ఒక్కమాటుగా యిరు వురు విజయంపొందుట తాము యింతవరకు కనివినియెరు గనివిషయము. అందు మరింత విస్మయాన్నికలిగిస్తున్నది ఒక స్త్రీ ఒక పురుషుడు! విజయంబొందిన వీరునికి తుడుచుకొను టకు పీతాంబరశాలువాను బహూకరించుట, జరీతో చిత్రింప బడిన రాజదుస్తులను, మయూరపింఛముతో అమర్చబడిన పీతాంబరకిరీటము బహూకరించి ధరింపజేయుట, ఆ వెంటనే ఆ విజేతను గజరాజము పూలమాలాలంకృతునిచేయుట, ఆ

తరువాత విజేత పురప్రముఖులకు పాదాభివందనం జేసి, వారి ఆశీస్సులను పొంది, గజరాజము నెక్కి వుత్సవంలో పాల్గొనుట ఆచారము. యథావిధిగానే వారు అన్నియేర్పాట్లు చేశారుగాని, వూహకు తెలియనివిధంగా ఒకేమాటు యిరువురు విజేతలుగా తమముందుకు వచ్చుట వారిని విభ్రాంతులను జేసింది.

వారిసంకోచాల నర్థంజేసుకున్న అశ్వఘోష్ వెంటనే ముందడుగువేసి వారి వద్దనున్న పీతాంబరశాలువాను అమాంతంగా తాను లాక్కొని ప్రక్కను సిగ్గుబిడియాలతో కుంచించుకుపోతున్న ప్రభమీాద కప్పివేశాడు. మరొకరి చేతిలోనున్న రాజదుస్తులను తీసుకుని, అందు జరీధోవతిని తానుంచుకుని అతివిలువైన కోటును ఆమెకు బహూకరిస్తూ, "ఆ శాలువా కట్టుకుని యీా కోటు తొడుక్కోండి" అని అతిసామాన్యధోరణిలో అన్నాడు. తాను వెంటనే ఆ జరీ ధోవతితోనే తుడుచుకుని, దాన్నే వోప్రక్క ధోవతిగాను, మరోవైపును వుత్తరీయంగాను పైనవేసుకున్నాడు. ప్రభ అనవసరఆలోచనలను కట్టిపెట్టి పీతాంబరశాలువాను చీరెగా ధరించి, ఆపైన కోటును తొడిగింది. మరొకరివద్దనున్న విజయకిరీటాన్ని తీసుకుని అశ్వఘోష్ ఆమెకుధరింపజేశాడు. గజరాజము వీరందరికంటె తెల్వైందిగనుక, శిరస్సున విజయ కిరీటమున్నవారికే విజయమాలను ధరింపజేసింది. సమస్యలు యెంతగడ్డువైనా సమయంవచ్చినపుడు వాటంతటవే విడిలిపోతవి. ఇపుడు ప్రబంధకర్తల హృదయభారం సడలిపోయి, ప్రసన్నముఖులయినారు. వెంటనే అశ్వఘోష్ ఆమెవైపు

ఒకమాటు ప్రేమలోలుకదృక్కులను బరపి, పురప్రముఖుల చెంత కేగి ఒక్కొక్కరికి పాదాభివందనంచేస్తున్నాడు. అనుకరణలో స్త్రీలు గొప్పనిపుణులు. ప్రభ యెవరిఅనుమతి ఆజ్ఞలు సలహాలు లేకుండానే సరసర అశ్వఘోష్‌ను అనుకరించి పెద్దలఆశీర్వాదాలను పొందింది. ఆమె ఒక్కమాటు జనసమూహాన్ని పరికించి,వారు తనపేరుతో చేస్తున్న విజయ నినాదాలు విని, విమూఢురాలివలె మ్లానముఖంబెట్టి "ఇది యెలాంటివిజయము! ఏమివిజయము!" అని కించపడుతుండగా, గజరాజము ఘంటారావాలతో దగ్గరగావచ్చి తన తొండాన్ని చాచి ఆమెపాదాలకు మోటించింది. ఆమె వివశురాలై గజనుచెవి చేతబట్టి పాదాలు తొండంమీద వుంచింది.

# విజయోత్సవము

విజయాన్ని పంచుకున్న విజేతలిరువురు అంబారీమీద ఆసీనులయినారు. "ప్రభ అశ్వఘోష్‌లు జిందాబాద్"నినాదాలు తెరపిలేకుండా వినిపిస్తున్నవి. సగారావాయిద్యాలు అతిశ్రావ్యంగా వినిపిస్తున్నవి. శంఖారావాలు వుండివుండి మ్రోగుతున్నవి.

ఈ విజయపోటీలందు పాల్గొనుటలో పదిసంవత్సరాల అనుభవమున్న నందా పట్టుకుజేసినప్పటికి లాంఛనప్రాయ కార్యక్రమాలన్నీ జరిగినవి. విజేతలు విజయపీఠాన్నలంకరించుటకూడా జరిగిపోయింది. చలికి గడగడ

వణుకుతూ నినాదాలు వినిపించినప్పుడల్లా తానూ చిన్నగా 'జే'అని తనలో తానే తన కేఅయినట్లు ముసుకుంటు న్నాడు. తన అనుభవంద్వారా తనవిజయదుస్తులను తానే జాగ్రత్తపడి తెచ్చుకొనుట నేర్చుకున్నాడు. ముందే తన స్వంత విజేతదుస్తులు తననౌకరుద్వారా యీవడ్డున రెడీలో పెట్టించుకున్నాడు. ఆ నౌకరే తనకు పురప్రముఖబృందమయి నట్లు, తాను విజేతఅయినట్లు, తన కా బృందం లాంఛనా లన్నీ జరుపుతున్నట్లు, ఆ నౌకరునుంచి స్టయిలిష్‌గా ముందు పీతాంబరాన్ని పొంది, శరీరంతుడుచుకుని, తరువాత రాజ దుస్తులను గ్రహించి ధరించి, నకిలీకిరీటాన్ని శిరస్సుపై నుంచి ఒక్కమాటు అనంతాకాశములో ప్రకాశిస్తున్న భాస్కరునివైపు చూసి, వినమ్రతతో నమస్కరించి సమూహం నుంచి వినిపిస్తున్న జేజేలకు తానూ శ్రుతికలిపి వయ్యారంగా శరీరాన్ని వూపుకుంటూ వుత్సాహితుడై తనలో తానే "నంద లాల్‌కీ జే"అని బిగ్గరగా అంటూ, తన చుట్టూ జేరిన అసం ఖ్యాకపిల్లలకు మనోరంజనను గలిపిస్తూ, తనకు జేజేలు కొట్టించుకుంటూ ఆనందసాగరంలో మునకలువేస్తూ పట్టణ రాజవీథులలో వూరేగుతున్నాడు. పాపం! నందాకు విజయం బొందినవారెవరో వారికి యేమేమి ఆదరసత్కారాలు జరుగుతున్నవో తెలుసుకునేంత వ్యవధిలేదు, ఆలోచనా లేదు. తానే విజయంబొందినట్లు తన వెంటవున్న వందలకుంది జనసమూహాన్ని చూసి పొంగిపోయి రాచపోజులు వేస్తు న్నాడు. విజేతలమీంద పూలవర్షంకురిపించుటకని డాబాల మీద పుష్పాలతో ఆయత్తమైయున్న వనితలు కొందరు

మనోరంజనకు, వూడిన పువ్వురేకులను ప్రోగుచేసి నందా మీదకు విసరుతున్నారు. అదిచూసి వెంటనున్న బాల సమూహం మిన్నుముట్టునట్లు దిక్కులుపిక్కటిల్లునట్లు జేజేలు కొడుతున్నారు. మహావిజయంబొందినవానివలె నందా పరమానందభరితుడవుతున్నాడు.

ప్రభ అశ్వఘోష్‌లు గజరాజముమీద అధిష్టించిన వెంటనే ప్రజలకోలాహాలం హద్దులను అధిగమించింది. పుర రక్షకభటులు దారినుంచి ప్రజలను ప్రక్కలకు సర్దుబాటు జేస్తున్నారు. వివిధవాయిద్యగాండ్రు ముందుకొచ్చి నిలిచి తమ విశేషప్రజ్ఞను ప్రదర్శించుకుంటున్నారు. ముందునడచు టకు శంఖారావంతో తెలియజేశారు. ముందు వాయి ద్యాలు, తరువాత స్త్రీపురుషవివక్షతలేని సమూహాము, ఆ తరువాత గజారోహులైయున్న విజేతలు, వారివెనుక పుర ప్రముఖులు రోడ్డుమీద వరుసగా వాచ్ఛనుంచి కదిలారు.

అంబారీమీద ఆసీనులైయున్న విజేతలిరువురిముఖాలు జేవురించివున్నవి. ఎవరిపేరులతో నినాదాలు ప్రతిధ్వనిస్తు న్నవో, ఎవరినిచూడను సౌధాలనుంచికూడా తహతహ లాడుతూ చూస్తున్నారో, ఎవరినిగురించి పట్టణంలోని ప్రతి ఒక్కరు గొప్పగా చిత్రించుకుంటున్నారో, ఎవరిఅదృష్టాన్ని గూర్చి వింతవింతగా చెప్పుకుంటున్నారో వారిముఖాలు వడ బడినపుష్పాలనలె, మసిబూసుకున్న మాణిక్యాలనలె, కావు ర్లతోకప్పబడిన కాంతిపుంజమువలె తేజోవిహీనమై విచార రేఖలతో గనిపిస్తున్నవి.

శిశిరఋతువులోని ప్రభాతభాస్కరుని అరుణబింబము వలె బింబాఫలసమానమై అత్యధికఆకర్షణతో శోభిస్తున్న ఆమెముఖమండలానికి ఆమెశిరస్సున ధరించిన విజయకిరీటము, దర్బారుకోటు, పీతాంబరశాలువా అద్వితీయమైన రాజసాన్ని గల్పిస్తూ ముగ్ధులనుజేస్తున్నది. ఆ ధరించినవన్నీ ఆమెకు అతికినట్లుండి, లోకాలోకాలను పరిపాలించు యువచక్రవర్తినివలె ద్యోతకమవుచున్నది. ఆమెప్రక్కగా కూర్చున్న అశ్వఘోష్ విభ్రాంతితో కలవరంచెందుతూ, అంతంలేని వ్యూహావిహారంలో మునకలు వేస్తూ స్వర్గలోకంలోని ఒక్కొక్క దేవకన్యను తనప్రక్క విరాజమానమై యున్న ప్రభతో పోల్చి సరితూగక, నాగలోకపరిశోధనలో గూడా విఫలుడై వివశతలో లక్ష్మీసరస్వతులనే సాపేక్షికం చేసి, రాపిడిచేసినకొద్దీ రవ్వలోనిమెరుపు అద్వితీయమవుతు న్నట్లు ఆమెకు ఆమెయే సాటిదప్ప మరెవ్వరూ పోలక, నభోమండలంలోని యావత్తునక్షత్రకోటిలో చంద్రబింబమే యేకచ్ఛత్రాధిపత్యంవహించినట్లు ఆమె యీ మానవకోటికే గాను, సర్వలోకాలకు అందాలలో అద్వితీయమై శోభిస్తు న్నట్లు ఆమెను తదేకంగా చూస్తూ నివ్వెరపోతూ, అందాల విజేతగా జన్మించిన ఆమెయిందు తన ఈ తుచ్ఛవిజయానికి చిన్నబుచ్చుకుని తన పేరుతో వస్తున్న నినాదాలకు తనకు తానే సిగ్గిలి వెలవెలబోతూ విమూఢునివలె ఆమెను తేరగా చూస్తున్నాడు.

అశ్వఘోష్‌ప్రక్కన కూర్చుని స్త్రీలనుంచి తనకు వస్తున్న ప్రోత్సాహము, 'ప్రభ – జిందాబాద్' అనే నినా

దాలువింటూ తన్మయురాలవుతున్న ప్రభకు అపుడపుడు "కవి అశ్వఘోష్ - జిందాబాద్, మహాకవి అశ్వఘోష్ - జిందాబాద్" అనే నినాదాలు వినిపించి చకితురాలవుతున్నది. కొద్దిరోజులక్రితమే భరుకచ్ఛ (భరాంచ) పట్టణం నుంచి వచ్చిన తన బంధువు, యవనదేశంలో అశ్వఘోష్ కవిరచనలకు, అత్యధిక ప్రాముఖ్యమున్నదని, యవనదేశ గొప్పరచయితలుకూడా ప్రశంసిస్తున్నారని, తాను యే పట్టణానికివెళ్ళినా గొప్పపండితులు అశ్వఘోష్రచనా ప్రతులు అడుగుతున్నారని, తా నొకటి యెత్తివ్రాసుకున్నానని. దాన్ని యవనభాషలోకి అనువదించి మిశ్రదేశరాజు తురమాయ (తాలమీ)కు బహుకరించదలచానని, యవన దేశ గొప్పరచయితలయిన ఎంపిదోకల్, యురోపిల్ను ముందుముందు అశ్వఘోష్కవి మించగలడని, ఈ సాకేతలో వుంటూకూడా, అతనిపరిచయం పొందకపోవుట దురదృష్టమని, చెప్పినపుడు మామూలుధోరణిలో విన్నది. తనకు యిన్నివివరాలు తెలియజేసిన ఆ బంధువు సామాన్యుడు గాదు, వ్యాపారదక్షుడు, గొప్ప భాషాజ్ఞాని. దేశదేశాలు తిరిగి యెన్నోభాషల అనుభవంపొందినవాడు. ఇపుడా బంధువు చెప్పినవిషయాలు ఆమెకర్ణరంధ్రాలలో ప్రతిధ్వనిస్తున్నవి. ఆ ప్రతిధ్వనులు, సమూహంలోని నాదాలు, వాయిద్యాలు శంఖారావాలు కలిసి కలవరపెట్టి కంపింపజేస్తున్నవి. ఆవలిగట్టున నందలాల్ లాగి లైనుమీద నిలిపినపుడు, యెవరో 'ఆయన అశ్వఘోష్' అంటుండగా విన్నది. సోమరిగా నిరర్థకుడుగా బుద్ధవిహార్లో తిరుగుతుండు అశ్వఘోష్

పేరుకూడా వినివున్నది. ఆ అప్రయోజకుడు అయోగ్యుడు అయిన అతనిని గురించిన నిర్లక్ష్యభావనలు ఆమెలో గూడు కట్టుకుని వున్నవి. ఆయనరూపు రేఖలుకూడా అందుకుతగినట్లే వుండి ఆమెమనస్సులో ఆవిధమైన ఆలోచనలే మెదిలి, మనస్సులో యేవగించుకున్నది. కాని, యీతలో అతని ప్రభావాన్ని, శరీరశక్తిని, సునిశితమైనస్వభావాన్ని, విజయానికి అర్రులుచాచని, వినోదంలో మైమరచుతత్వాన్ని గ్రహించినపుడు తనకు తెలియకుండానే తనమనస్సు ఆయన్ను ఆకర్షించింది. ఆయనయడల వుత్పన్నమయిన నిర్లక్ష్యము, చిన్నచూపు మాయమయి, విచిత్రమైన ఆయన స్వభావంయెడల ఆమెమనస్సు ప్రభావితమవుతున్నది. ఆయన తనవిజయంలో ఆమెకు సమభాగాన్ని సంక్రమింపజేశాడు. విజయముకుటాన్ని, విజయాలను తనకే అందజేశాడు. ఈ నిరర్థకుడు నిష్ప్రయోజకుడు సోమరిఅయిన యీ అర్భకునిలో యింత శక్తిసామర్థ్యము, విశాలబుద్ధి, ఉదారత యెలా దాగి వున్నవా అనే విరుద్ధధ్వనులలో తికమకపడుతున్నసమయంలో నాగరిక తరుణవయస్కులవైపునుంచి "మహాకవి అశ్వఘోష్ - జిందాబాద్" అన్న నినాదాలు విని, ఆమె వెలవెలబోయింది. ఏ అశ్వఘోష్కవినిగురించి తనబంధువు ద్వారా ఒకనాడు విశేషరూపంలో విన్నదో, యెవరిఖ్యాతి, ప్రశస్తి తమ యువనకవులలో సంచలనంకలిగిస్తున్నట్లు విన్నదో, యెవరిరచనను విజ్ఞాననిధియైన తనబంధువు యవనభాషలోకి అనువదించి మిశ్రప్రభువుకు సమర్పించనున్నట్లు విన్నదో ఆ మహావిజ్ఞాననిధే తనప్రక్కన విజయభాగ

స్వామియైవున్నట్లు గాంచి, అది, స్వప్నావస్థేమోనని విభ్రాంతినొందుతూ విహ్వాలురాలవుతున్నది ప్రభ. ఆయన్ను తాను సరయూలో నిర్లక్ష్యంగా చూసినందుకు, ఈర్ష్యతో వుడికిపోయినందుకు, తన పాదంతో తన్నినందుకు పరితాపంతో కుంచించుకుపోతున్నది. ఈతలో ఆయనశక్తి అజేయమైనదయినా, విజయం కేవలం ఆయనపిడికిటిలోదే అయినా, తానాయన్ను అలక్ష్యమూ, అమర్యాదా చేసినా అన్నిటినీ ఆయన చిరునగవుతో యెరుగనట్లే సహించి, ఆర్భాటపడకుండా, తనకుతానే ప్రదర్శించుకోకుండా సహనంతో సాధుభావంతో త్యాగంతో విజయంలోని అర్ధభాగాన్ని అతిసునాయాసంగా అప్పగించాడు. అంతేగాదు, ఆధిక్యతలోని ప్రాధాన్యతను తనకే సంక్రమింపజేసి, తను నిమిత్తమాత్రునివలె ప్రక్కన ఆసీనుడయినాడు. నిర్మలమైన ఆయన ముఖమండలం చూస్తున్నకొద్దీ వత్తైన త్యాగపంక్తులేవో సుస్పష్టరూపంలో ద్యోతకమవుచున్నవి. ఆయన ముఖంలో గుప్తముద్రితములను చదువకలిగినకొద్దీ ఆమె శరీరం కంపిస్తున్నది, ముఖము వెలవెలబోతున్నది. గొప్ప అపరాధినివలె రాతిముక్కయని భ్రమతో రత్నాన్ని కాలదన్నినట్లు, పరితాపంతో ఆమెముఖం క్షణమొకరీతిగా గ్రహణదోషానికి గురియవుతున్న చంద్రబింబంవలె మ్లానత చెందుతున్నది.

ఊరేగింపు రామఘాటుప్రక్కగా రాజవీధిని పోతున్నది. సౌధాగ్రములనుంచి తరుణులు విజేతలమీద చల్లుతున్న పుష్పాలు కుంభవర్షమువలె ముంచెత్తుతున్నవి.

యువతులుకొందరు మాలలను అతినైపుణ్యంతో రింగు బాలును విసరినట్లు పోయి, వారికంఠాలలో పడునట్లు విసరుతున్నారు. గ్రీకునాగరికయువతులలో ప్రభవలె ప్రతిభావంతురాలై ఆధిక్యతగలిగిన ప్రభముఖ్యస్నేహితురాలైన సౌమ్య వుత్సాహితురాలై ముందున్న భవనంమీది స్త్రీల కడకు సరసర వెళ్ళి వారివద్ద రెండుదండలు తీసి, రెంటినీ మధ్యకు త్రెంచి, ఒకే పెద్దదండగా చేసి, అంబారీమీదనున్న విజేతలిరువురిమీదకు అతిచాకచక్యంతో విసిరింది. అది గిరగిర భూచక్రంవలె తిరుగుతూ వెళ్ళి ఘటబంధనివలె వారిరువురిని బంధించింది. సమూహంలోనుంచి కలకలారావం ఒక్కమాటుగా జయసినాదాలతో ఆకాశానికంటింది. కరతాళధ్వనులు మారుమ్రోగినవి. భవనాగ్రాలనుంచి పసితలు పుష్పగుచ్ఛాలను గుప్పిపదిలారు. బౌద్ధమతస్థులైన గ్రీకులు మరింత వుత్సాహాన్ని పొందుతున్నారు. ఈ విజయమంతా తమదేఅయినట్లు పొంగిపోతున్నారు.

ఇపుడు ప్రభ, అశ్వఘోషులు పుష్పగుచ్ఛాలలో మునిగివున్నారు. వారిరువురికంఠాలవరకు అంబారీలో పుష్పాలు కుప్పగాపడినవి. సౌమ్యచే విసరబడి తమను బంధించివున్న మాలను నెమ్మదిగా తొలగించుకోవాలని ప్రభతలంపు. కాని తెలియని సంకోచమేదో అడ్డగిస్తున్నది. ఆతరువాత వర్షించిన పుష్పాలు తమను బంధించివున్న ఆ దండను ముంచివేసినవి. వేలమందిదృష్టికి గురియవుతున్న తాము యేసమయంలో యేమిచేస్తే మరేమిగా భావించి, గల్లంతుగా వేళాకోళంగా వినాదాలుచేస్తారోనని భయంతో

ప్రభ శిరస్సును అధోముఖంచేసి కోరచూపులతో అంతా పరికిస్తూ కదలిక మెదలికలులేకుండా ఊపిరిసలుపుకోనుకూడా బెదురుతున్నది. తమను బంధించివున్న సౌమ్యమాల తన స్వేచ్ఛను మరింత అరికడుతున్నట్లు మానసికవ్యథతో ఆ మాలముడిని యెవరికీ కనిపించకుండా విడదీస్తే బాగుండునని తోచి, పుష్పాలలోమునిగివున్న తనచేతులను నీటిలోవలె బయటకు తెలియనీయకుండా కదల్చి ఆ మాలముడికొరకు రెండువైపులా హస్తద్వయంతో తడవుతున్నది. ఆమెకుడి చేయి అశ్వఘోష్‌అంచేతికి తగిలింది. అది ఆమె యెందు నిమిత్తమో యిస్తున్న సంకేతమయినట్లు ఆయన అనభిజ్ఞుని వలె ఆమెచేతిని వెంటనే గట్టిగా పట్టుకుని అదుముతున్న జ్ఞానతో ప్రేక్షకులవైపు దోపిడిగానినవలె తదేకంగా చూస్తు న్నాడు. దొంగలభయంతో తత్తరపడి పారిపోతూ దొంగ యింట్లోనే రక్షణకు దూరినట్లు ఆయనచేతిలో తనంతటతానే యిరికింపజేసుకున్న హస్తాన్ని విడదీసుకోను అసమర్థురాలై వెలవెలబోతూ దీనవదనంతో ఆయనవైపు ఆత్మార్పణ దృక్కులను బరపింది. ఆమెచూపులతో విమూఢత్వంలో మునిగిపోయి, నీటిలోపలనే అనాలోచితంగా ఆమెచేతిని తనవైపు గుంజాడు. ఆమెశిరస్సు ఆయన భుజ స్కంధానికి ఢీకొన్నది. ఆమె ఖంగారుతో శుష్కించిన కంఠంతో "ఏమిటీ అఘాయిత్యం!" అంటూ ఆయనచేతిని బాగా గిల్లింది. అపార్థంతో పొరపాటుచేసినవానివలె ఆమె చేయి విడచి, బిత్తరపోయి చూస్తున్నాడు. తిరిగి ఆమె ముఖంలోని ప్రసన్న రేఖలనుజూచి సాంత్వనపొంది, అనభి

జ్ఞునివలె చూస్తున్నాడు. ఈ కదలికలలో ఆయన మోకాలు ఆమె మోకాలుమీద పడి భారంగాతోచి వూపిరి బిగబట్టి ఉక్కిరిబిక్కిరి అవుతున్నది. ఆయన స్థిమితపడ్డాడుగాని, ఆమె చీకాకుతో ఆలోచనలుచేస్తూ వివశురాలై ఆ పుష్పాల లోపలగా తనచేతితో ఆయనతొడను పట్టి తొలగించ ప్రయత్నిస్తున్నది. అది మరేదో సంకేతమయినట్లు, ఆమె హస్తముద్వారా తనశరీరం పొందుతున్న వేడితో పరవశమవుతూ, నేత్రాలు అర్ధనిమీలితం జేసి ఆనందాన్ననుభవిస్తున్నాడు. ఆమె సుకుమార హస్తంయొక్క శక్తి ఆ మోకాలిని తొలగించలేక ఆయన మోకాలిమీద అటూయిటూ చేతి పట్టుకొరకు తడవుతున్నది. అంతట ఆయనకు మరింత మహాదానందంగలిగి నేత్రాలు పూర్తిగా మూసి స్వర్గసుఖం గ్రోలుతూ, ఆమెను స్మరిస్తూ మనోఫలకంలో ఆమెమూర్తిని ప్రతిష్ఠింపజేసుకుంటున్నాడు. ఆమె విసిగి తిరిగి మోకాలిమీద తననఖముద్రలను కసిదీర వేసింది. ఆయన నేత్రాలు పూర్ణంగా తెరిచాడు. పూర్ణచంద్రబింబానికి సువర్ణ కిరీటాన్ని ధరింపజేసినట్లు దేదీప్యమానంగావున్న ఆమెముఖంలో మురళీధరుని సత్య తన అకుంఠితమైన ప్రేమను తన దగపుతనంలో ప్రతిబింబింపజేస్తున్నట్లు గోచరించింది. గిలిగింతలు కలిగి తనతొడమీదనున్న ఆమె సుకోమలకరంమీద చేయి వేసి అదిమివుంచి అటూయిటూ యేమీ యెరుగనివానివలె చూస్తున్నాడు. తుదకు ఆమె ఆగజాలక ముఖాన్ని క్రోధకవళికలలోముంచి ప్రహసితకంఠంతో "ఇస్... నా కాలు నొక్కుకుపోతున్నది కవీ!" అని బిగబట్టిన అధరాలతో

అన్నది. ఆయన జేవురించినముఖంతో దీనస్వరంలో "పొర పాటును క్షమించండి, నాకు తెలియలేదు." అంటూ తన మోకాలును తొలగించి, ఆమెమోకాలుక్రిందకు చేర్చు కున్నాడు.

ఉత్సాహంలో వూగిపోతూ నినాదాలకు ప్రేరణ నిస్తూ అటూయిటూ అంగలుపంగలువేసి హడావుడిసలు పుతూ స్త్రీలలో మేటిగా ద్యోతకమవుతూవున్న సౌమ్య యీ అంబారీలో ఆసీనులైయున్న విజేతలిరువురిలోని దాగుడుమూతలాటను గమనిస్తూనేవున్నది. తన వుత్సా హాన్ని ద్విగుణీకరించి "కాలరామ (బౌద్ధభిక్షువు) సంఘం జిందాబాద్" అనే నూతననినాదాన్ని సృష్టిస్తున్నది. సాకేత పట్టణంలోని బౌద్ధసంఘాలన్నింటిలోను 'కాలరామసంఘం' అగ్రస్థానంవహిస్తుంది. అందు యవనులస్థానం ప్రముఖమైంది. అందుకే వారు తమవిజయం బౌద్ధవిజయంగాను బౌద్ధ విజయం తమవిజయంగాను పాటిస్తారు. యవనయువతులలో ప్రభ, సౌమ్యలు భిక్షువు సంఘాలతో ఘనిష్టసంబంధంకలిగి వున్నారు. సౌమ్యకు ఉల్లాసాలు పరిహాసాలు యెక్కువ యిష్టం. ఆమె రెండు పెద్ద పూలహారాలను సంపాదించి మొదటివలెనే రెంటిని ఒకటే పెద్దదిగా చేసి సరసర ముందుకు వెళ్ళి గజరాజమున కందించింది. మానవులకంటె జంతువు లకు సంకేతపరిజ్ఞానం యెక్కువ. వెంటనే మత్తేభ మాదండంతో విజేతలిరువురి కంఠాలను యేకంచేసి వేసింది. సౌమ్య వెంటనే పెద్దపెట్టున కరతాళధ్వనులు చేసింది. తిరిగి జయకారాలు మిన్నుముట్టినవి. అందరూ అద్భుతమైనదృశ్యాన్నివలె తిల

కిస్తున్నారు. పుట్టలోమునిగిన వాల్మీకివలె పూలలోమునిగి వున్న యిరువురి కంఠాలపైన మాల యేకంచేస్తూ నిలిచి పోయింది.

మొదటిఘట్టంలో పురుషునికున్న ధైర్యసాహసాలు, సంఘము యెడల నిర్భీతి స్త్రీ కుండజాలవు. ఆతరువాతి ఘట్టంలో పురుషునికి అడుగడుగున అనుమానాలు, కర్తవ్యాలు, భయభీతులు వెంటాడుతవి. స్త్రీ దెబ్బతిన్న నాగము పడగవిప్పి పరవళ్ళు త్రొక్కునట్లు నిర్భీతితో నిర్లక్ష్యంగా ఉద్రేకములో అన్నిటికీ సంసిద్ధురాలవుతుంది.

సరసరూపంలో సౌమ్య యిరువురికంఠాలకు చుట్టించిన మాలతో, వినూత్నరూపంలోవచ్చిన నినాదాలతో, నినాదప్రేరణలో ప్రత్యేకంగా వినిపిస్తున్న సౌమ్యకంఠస్వరంలో ప్రభ మనస్సులోని ఆవేదన అణగిపోయి స్థిమితపడి కూర్చున్నది. ఆమెలో నూత్నంగా పుట్టుచున్న నవ్వుచున్న సిగ్గుదొంతరలను పూలమాల నాడు జేసి దాచుకుంటున్నది. విప్పారిన ఆమెముఖమండలంలో సిగ్గుదొంతరలు అద్వితీయ శోభను ఆపాదిస్తున్నవి. పుష్పరేణుల సందులగుండా ప్రేక్షకులను, ఆతరువాత సౌమ్యను, తిరిగి తన సాటి విజేతను చూస్తున్నది. నలుగురు నవ్వి పరిహాసాలుపట్టించినపుడు వెలవెలబోవు పసిబాలకునివలె ఆయనముఖం జేవురించి చెంత నుట్టి పడుతున్నది. నీటిమడుగులో అడుగు కనిపించినట్లు మ్లానమైన ఆయనముఖమండలంలో అమాయకత్వము, సాధుత్వము, సజ్జనత్వము సుస్పష్టంగా ప్రస్ఫుటమవుతున్నవి. ఖంగారుపడుతున్న ఆయనముఖంచూస్తున్నకొద్దీ ఆమెహృదయంలో

ఆనందం వెల్లుబుకుతున్నది. ఆమె పట్టరాని పరవశంలో కొంచెగా తనకంఠాన్ని కొంచెం రెండోప్రక్కకు వంచింది. లంకె వేసియున్న పూలమాల ఆయనకంఠాన్నికూడా ప్రత్యాశితంగా ప్రక్కకు సమాజుచేయించునట్లు లాగింది. తన మనోరంజనకు అలభ్యమైంది లభ్యమైనట్లు చిందులతో కేరింతలుగొడుతూ అందరనూ వుత్సాహపరుస్తున్నది సౌమ్య. ఆమెపరిహాసాన్ని పరికించిన కవి తనస్థితికి అధీరుడై ఆకరణీయమైనదేదో తనకు జరుగుతున్నట్లు తేలదృక్కులతో పరాజితసేనాధిపతివలె నిక్కించి చూస్తున్నాడు. ఇపుడు ప్రథ ధైర్యం ద్విగుణీకృతమైంది. పూలలోపల తన కాలు క్రిందనున్న ఆయనకాలును అదిమి వూపుతున్నది. అది అందరూ గమనించి యింకా తనను చిన్నబుచ్చే నినాదాలు చేస్తారేమోననే భీతితో విహ్వాలుడైపోతున్నాడు. ఓటమిని అంగీకరించి తనను అర్థించినపుడు రక్షణగోరినపుడు మానవ స్వభావము కరుగుతుంది. ఆయన అధీరతకు ఆమె మనస్సు నొచ్చుకున్నది. అధికంగా నవ్వినపుడు అశ్రువులు వలికినట్లు ఆయన అమాయకబాధకు ఆమె జాలిపడి ఆయనకు వూరటను, సాంత్వనను ధైర్యాన్ని కల్పించ ఆలోచనలు చేస్తున్నది.

పట్టణంలోని బాలబాలికలంతా నందా వెంటే వున్నారు. నందావూరేగింపు ముందువరుసలో సాగిపోతున్నది. పాపం నందావెంట బాజాభజంత్రీలు మొదలగు వాయిద్యాలుగాని, పెద్దలుగాని పటాటోపాలుగాని లేవు. పిల్లలు చేయగల నినాదప్రతిధ్వనులు పెద్దలు చేయజాలరు.

పసివారి లేతకంఠాల నినాదాలతో అసలు విజేతల వూరే గింపువారి నినాదాలకంటె ప్రతిధ్వనిస్తున్నవి. ఆ తెరపిలేని నినాదాలు అన్నిటినీ కప్పిపుచ్చుతున్నవి. ఎవరో తనుయింటి పూజాగదిలో దేవునిసాన్నిధ్యంలో వుంచిన శంఖాన్ని తస్క రించుకొచ్చి నందాప్రక్కన తెరపిలేని శంఖారావాన్ని కల్పి స్తున్నాడు. విజేతలకని ఆడవారు పదిలపరచుకుని యెదురు చూస్తున్న తల్లుల కనుగప్పించి వుటాయించుకొచ్చిన బాలురు, బాలికలు వేసిన దండలతో నందాశరీరం పూల కుప్పవలె వుండి, ఆయనరాజసాన్ని ప్రదర్శిస్తూ అడుగులు వేస్తూపోతుంటే, పూలరాశి దొర్లుతున్నట్లున్నది. పసివారు తమ కందినపూలను నందామీద విసిరి కేరింతలుకొడుతూ నినాదాలు మిన్నుముట్టిస్తున్నారు. వెనుకవస్తున్న వూరేగిం పునుగురించిగాని, అసలువిజేతలగురించిగాని వారి కాలో చనేలేదు. సరయూగట్టులకు చేరినప్పటినుంచి వారిదృష్టిని ఆకర్షించేది నందాయే. వారి శాశ్వతవిజేత నందాయే. వారి మనస్సులను ఆనందంతో ఆకర్షించి వుర్రూతలూపునది నందాయే. వారి వేడుకంతా నందాతోనే ముడిబడి పోయింది. "విజేత నందలాల్‌కీ జై" అని పసివారు పుగ్గబట్టి నినాదాలుచేస్తుంటే నందలాల్ పరవశుడై తానూ "జే" అని చుట్టూ కలియజూసి నభోమండలాన్ని తిలకించి వోరగా సౌధాలమీదనున్న పురస్త్రీలవైపు తన విజయవీరత్వాన్ని ప్రసరింపజేస్తూ, అధినాయకుని పోజులో ముందు కడుగు వేస్తున్నాడు. ఈ మానసిక విజేతను యదార్థవిజేతకాదని యెవరనగలరు?

ఊరేగింపు రాజవీధిని తిరిగి, మధ్యనున్న మార్గ గమ్యంతో బుద్ధవిహార్ లోని తిన్నెకడకు చేరింది. ఒకప్పుడు బుద్ధభగవానుడు అధిష్టించిన ఆ తిన్నె అంతా తివాచీలతో కప్పబడి, పుష్పాచ్ఛాదితమై యున్నది. పుష్పలతలతో ఆర్చీలు, కైవారాలు విశేషనైపుణ్యంతో అమర్చబడినవి. ఒక యవనయువతి విజయంపొందిన ఉత్సాహంతో పట్టణం లోని యవన యువతీయువకు లంతా హడావుడులు చేస్తు న్నారు. వేదికాలంకారాలన్నీ వారే యెన్నడూ యెక్కడ జరుగనంత శోభాయమానంగా చేశారు. బౌద్ధమతశరణ్యం లోనే వుంటూ, భిక్షువుసంఘాల నియమాలను పాటిస్తూ, బుద్ధభగవానుని సూక్తులను వల్లించుటేగాక, నిత్యజీవితంలో అనుకరిస్తూ బౌద్ధమతాన్ని వుజ్వలంచేస్తున్న యవనుల విన తిని నిరాదరం చేయజాలక, సాకేత భిక్షువుసంఘా లన్నిటికీ అధిపతి అయిన మహాస్తవీరధర్మసేన్, యవనబౌద్ధులగురువు ధర్మరక్షిత్ లు కూడా యీ వుత్సవంలో పాల్గొన్నారు. పుర ప్రముఖులు వారికి ప్రత్యేక ఆదరమిస్తూ వారి ఆధ్వర్యం లోనే వేడుకను జరుపుతున్నారు. తిన్నెమీద పరచిన పాన్పుమీద విజేతలిరువురు ఆసీనులైనారు. వారి కిరు ప్రక్కల మహాస్త వీరధర్మసేన్, ధర్మరక్షిత్ లు కూర్చు న్నారు. వారివెనుక తిన్నెనంతా పురప్రముఖులు పూర్తి చేశారు.

అప్పటికి భారతభూమిలో నాట్యప్రదర్శనలుగాని, నాటకప్రదర్శనలుగాని లేవు. యవనదేశం అందు గొప్ప ప్రావీణ్యం కలిగివున్నది. ఆ అభ్యాసంతోనే సాకేతలోని

యవనులు బుద్ధవిహార్‌లో నాట్యప్రదర్శనశాలను నిర్మించుకున్నారు. ఆ నాట్యశాలలో యవన యువతీయువకులు నిత్యమూ యేదో సందడి చేస్తూనేవుంటారు. అందు సభ్యులయినవారంతా నటకులే, నాట్యవిశారదులే. నటన, నృత్యాల ప్రదర్శన వారినుంచే భారతీయులు నేర్చారు.

రాజసభనలె తీర్చి సద్దుగుణిగివుంది. వేనకువేలు ప్రేక్షకులయిన సాకేతప్రజ పసికిరి పృథ్వీమీద ఆసీనులై వుత్సుకతతో నేచియున్నారు. సౌస్య తన యవనచెలికత్తెతో నృత్యం ప్రారంభించింది.

నీవేలే విజయముబొందిన బౌద్ధ వీరవనితవు
లోకలోకముల చాటి చెప్పుటకు గర్వింతుములే
యవన బౌద్ధుల మేకమై;
నీవేలే చాటిన ధీరవి పురుషులసరసన వనితలు
సరిసమానముగ వుంటే మానవశ్రేయంబని
నీవేలే నిజమని చాటిన నీటు వనితవు; బౌద్ధవిజ
యమే శాంతివిజయము, శాంతివిజయమే మానవ
విజయం!

నృత్యము ముగిసింది. ధర్మసేన్ విజేతల నాశీర్వదించి "విజేతలారా, ప్రకృతిధర్మాన్ని పాటించినట్లు మీ యిరువురు విజయాన్ని సరసత్వంతో పంచుకున్నందుకు నా మనస్సుకు మహదానందం కలుగుతున్నది. సుఖసౌఖ్యాలకు వలెనే, ఆటపాటలలోనైనా వినోదాలలోనైనా పోటీలుపడినపుడు, ఫలితంగా ఈర్ష్య, ఈర్ష్యలో ద్వేషము, ద్వేష

ములో రాక్షసత్వము సంభవిస్తవనే భీతి నా కుండేది. కాని నేడు యిక్కడ బుద్ధభగవానుడు చూపిన శాంతియుత త్యాగమే కనిపిస్తున్నది. అందరూ వుల్లాసభరితులై సంతోషాన్ని సమంగా పంచుకున్నట్లున్న యీ దృశ్యం నాకు చిర స్మరణీయమైయింది. సౌమ్య యింత అద్భుతంగా నటిస్తుందని నాకు తెలియదు. యవనులకు భారతదేశం బుద్ధభగవానుని శాంతిసందేశాన్ని సమర్పించుకున్నది. వారు స్వీకరించి లక్షలాదిగా బౌద్ధమతస్థులై హృదయోన్నతిని పొందుతున్నారు. వారు అందుకు ప్రతిగా భారతప్రజలకు నేడు సౌమ్యద్వారా ప్రదర్శింపబడిన నృత్యము, నాటకరంగము సమర్పిస్తున్నారు. ఇవి మనోరంజనకేగాదు, బుద్ధివికాసానికి తోడ్పడుతవి. విజేతలైన మీ యిరువురిలో ఒకరు పురుషులు, మరొకరు స్త్రీ- ఒకరు భారతీయులు, మరొకరు గ్రీకులు- ఒకరు హిందువులు, మరొకరు బౌద్ధులు - ఒకరు రంగస్థలములో అద్భుత నటకులు, మరొకరు మహాకవులు. ఈ ద్వంద్వకలయిక మానవజాతికి మహోన్నతి నివ్వగలదు. వీరికలయికే యవన నాటకరంగ ప్రభాతంగా భారతావనిలో ప్రకృతిరూపాంతరం యొక్క నాటికారంగం రూపొందగలదని ఆశిస్తున్నాను..." అంటూ ముగించాడు.

# అలసందా యాత్ర

అలసందాలో (అలెగ్జాండ్రియాలో) దత్తమిత్రుని సోదరి ప్రమాదభరిత రోగగ్రస్తురాలై యున్నట్లు, ఆమె ఆఖరుసారిగా తనను జూడగోరి, వాపోతున్నట్లు, గ్రీకువ్యాపారులు మోసుకొచ్చిన వార్తతో దత్తమిత్రుడు ఆకస్మికంగా ప్రయాణంకట్టవలసివచ్చింది. ఆమె తన 20 సంవత్సరాల జీవితాన్ని సాకేతలోనే గడిపి, వివాహానంతరం భర్తయొక్క అనివార్యపరిస్థితులవలన అలసందాలో స్థిరపడిపోయింది. బౌద్ధసంస్కారంలో పుట్టి పెరిగిన ఆమె మనస్సుకు సాకేతయే తన మాతృస్థానమైనట్లు సాకేతయెడల, తన సోదర కుటుంబముయెడల ఆమెకున్న అత్యధికానురాగాన్ని పదేపదే మధురస్మృతులలో నెమరువేసుకుంటూ భర్త క్రోధానికి గురైయెకూడా రెండుమూడులు సాకేతకువచ్చి, విధికృతంగా తిరిగిపోవలసివచ్చినప్పుడు హృదయవిదారకంగా వాపోయింది. బౌద్ధభిక్షువులలో ఆమెకు అత్యధిక ఆదరముండేది. వారు ఆమెను "బుద్ధప్రియ" అంటుండేవారు. ఆమెయెడలగల విశిష్ట శ్రద్ధ దత్తమిత్రుని వివశునిజేసి ఆమె అంతిమదర్శనంకొరకు అలసందాకు ప్రయాణసన్నాహం చేయించింది.

ప్రభ దత్తమిత్రుని యేకయిక సంతానమయినందున, అల్లారుముద్దుగా పెరిగింది. సాకేతసరిహద్దులు దాటియెరుగదు. దూరప్రాంతాల వింతలు, విశేషాలు వింటున్నప్పుడు ఆమె ఉత్సాహంతో ఊగిపోతుం

టుంది. వ్యాపారంలో దేశదేశాలు తిరిగి అమిత అనుభవం పొంది, సాకేతజేరిన తన బంధువులమాటలు విని, వేలసంవత్సరాలనాడు నిర్మింపబడిన ఆ అసామాన్య పిరమిడ్లను, ఆ పిరమిడ్లలో భద్రపరచబడిన రాజుల రాణుల మృతకళేబరాలను, ఆకాశాన్ని భూమాతను యేకంచేసే జలపాతాలను, రజితశిఖకాంతులతో ప్రజ్వరిల్లు హిమపర్వతాలను, మానవులను మార్కెట్టులో విక్రయించు కేంద్రాలను సందర్శించాలని వాంఛించింది. వూహావిహారాలలో తేలియాడింది. కాని అప్పటికే దత్తమిత్రుడు వున్న సంపత్తితో సంతృప్తిపడి, ప్రయాణాలు ముగించి ప్రశాంత జీవితానికి అలవడినందున ప్రభ కా అవకాశంకలుగలేదు.

ఆకస్మికంగా దత్తమిత్రునికి సంభవించిన యీ ప్రయాణంలో వెంబడించుటకు పట్టుబట్టి ప్రభ తల్లిని సమ్మతింపజేసింది.

విధి యెప్పుడూ మానవవ్యూహాలకు విఘాతాలను గల్పిస్తుంటుంది. సంకల్పాలమీద పైతాను పాదాలతో 'తొక్కివేస్తుంది. ఎవరి అంతిమసందర్శనంకొరకు దత్తమిత్రుడు, ప్రభ అంత ప్రయాసతో భయంకరారణ్యాలను పర్వతాలను యెడారులను దాటి, అలెగ్జాండ్రియా చేరారో, ఆ బుద్ధప్రియ తన అంతిమకోర్కె తనలోనే పెట్టుకుని, చాలా రోజులక్రితమే పరలోకానికి పయనమైపోయింది. ఈ విషాద ఘట్టంతో విమూఢుడైన తండ్రిని ప్రభే ఓదార్చవలసి వచ్చింది. బుద్ధప్రియనిర్యాణవ్యధకంటె, తండ్రిని నైరాశ్యము

ప్రభను క్రుంగదీస్తున్నది. ఆమెకీ దేశమే దుఃఖమయంగా తోస్తున్నది.

గ్రీకుభాష ఆమెకు క్రొత్తదయింది. తాను గ్రీకు బాలికే కాని, తనకీ భాష అర్థంగాదు. గ్రీకుసంభాషణ తనకు పరాయిదిగా తోస్తున్నది. ఇక్కడి బౌద్ధులు, వారి ప్రాకృతసంభాషణలు తన హృదయాన్ని చూరగొంటున్నవి. బౌద్ధులే తనవారుగా తనకు తోస్తున్నది.

అలెగ్జాండ్రియా కేంద్రభిక్షుసంఘ అనునయప్రార్థనలకు వివశుడై దత్తమిత్రుడు వారి ఆతిథ్యాన్ని స్వీకరించాడు. ప్రభ సారనాథ్ గాని, భారతదేశంలోని ప్రభవంతమైన సంఘాలనుగాని చూచియెరుగదు. అయినా, వారి వుత్సాహానికి ప్రోత్సాహాన్ని గల్పిస్తూ సవివరంగా చిత్రిస్తున్నది. భిక్షువులు, భిక్షుసంఘాధిపతులు వారికిస్తున్న ఆదరంతో ప్రభ పులకితురాలై తననుతాను మరచి, వారిలో లీనమైపోయినది.

సులోగస్ ప్రభబంధుకోటిలోనివాడు సరళ హృదయుడు. అల్పసంతోషి. నిరాడంబరి. దృఢకాయుడు. ముఖమండలంలో సదా ఆనందం విలసిల్లుతుంటుంది. భిక్షువు సంఘానికి తనజీవితాన్ని, సంపత్తిని సమర్పించుకున్నవాడు. దత్తమిత్రుని సేవాచికిత్సలభారాన్ని తనపై మోపుకున్నాడు. సంఘాచారానుసారం తను నిత్యము భిక్షకు పోతున్నాడు, కాని ప్రశాంతమైన ఆయనహృదయంలో అంతంలేని ఆలోచనలు ఆవరించినవి. దత్తమిత్రునికి చేయవలసిన చికిత్సల చింతలో మునిగివుంటున్నాడు. అతియపాత్ర అంజలిమం

దుంచి, అడుగులు వేసుకుంటూ వీధుల్లో తిరుగాడుతు న్నాడు. కాని ఆయన అంతరాళం అరణ్యాలలోని వనమూలి కలను వెదుకుతున్నది. బుద్ధభగవానుని ప్రకృతిచికిత్సా విధానాన్ని ఒక్కొక్కటిగా ప్రయోగంచేసి విఫలుడవు చున్నాడు. ఆయన వైద్యుడుగాను, ప్రభ కాంపౌండరు గాను చేస్తున్న ప్రయోగాలతో విసిగిపోయిన దత్తమిత్రుడు, తా నిక సహించలేనని నిరోధించాడు. అంతర్గతంగా అయి ష్టంతో నిండిపోయిన ప్రభ ఈ అవకాశాన్ని కోల్పోజాలక, ఇక యీ ప్రయోగాలవలనగాని, సులోగన్ వనమూలికల వలనగాని ప్రయోజనంలేదని మంచి అనుభవంగల యూనానీవైద్యునిచికిత్స అవసరమని తన అభిప్రాయం వెల్లడించింది.

శుష్కించిన హీనస్వరంతో "అదేమిటమ్మా, అలా అంటావు! సులోగన్ తక్కువవాడుగాదు; మీరు చేస్తున్న చికిత్స లోపమూగాదు. నా రోగ మలాంటిది. ఆయుర్దా యాన్నివ్వగల శక్తి మానవుడిలో లేదు. యూనానీవైద్యులు నాకు లేని ఆయుర్దాయాన్నివ్వగలరా చెప్పు?" అన్నాడు దత్తమిత్రుడు.

ప్రభ వులికిపాటుచెందుతూ, ఆదుర్దాతో ఆయన చెంతకెళ్ళి కూర్చుని, తండ్రి అధరాలమీద తన మృదువైన అంగుళీయములతో పుణుకుతూ బరువైనకంఠంతో "అదే మిటి నాన్నా, అలాఅంటావు! ఎవరిని చూడాలని యిన్ని దేశాలు దాటి, యింతప్రయాసతో యిక్కడికి చేరామో, వారిని చూడలేకపోయాము. నీ స్థితి చూస్తుంటే నాకు నిజం

గానే భయమేస్తున్నది నాన్నా! నీ కేక్కడ యేమయినా జరిగితే, నేనూ నీతోనే..." అంటూండగా గాద్గదికంతో గూడిన ఆమెకంఠం పెగలలేదు. ముత్యాలదొంతరులవలె ఆమె కన్నీటిబిందువులు టపటప ఆయన వక్షస్థలంమీద పడినవి.

దత్తమిత్రుడు వణుకుతున్న తన హస్తాలతో ఆమెను పసిబాలికనువలె తనవైపుకు లాక్కుంటూ ఆర్ద్రకంఠంతో "ఎవరి ఆయుర్దాయం ముగిసినపుడు వారు వెళ్ళక తప్పుతుందా పిచ్చితల్లీ! బుద్ధప్రియుని చూడలేకపోయినా, నీవు చెంతనున్నావు గనుక నే, ఇంత అనారోగ్యంలోకూడా నిశ్చింతగా వున్నాను. సులోగస్ సాధారణ భిక్షువుగాదు. గొప్ప తపస్సంపన్నుడు. యోగిపుంగవుడు. గ్రీకు బౌద్ధులలో అతనిస్థాన మత్యున్నతమైనది. అమాయకునివలె గనిపిస్తున్నందున నీవు నిర్లక్ష్యంచేస్తున్నావు ప్రభా!" అన్నాడు.

ప్రభ తన అంగుళీయములతో తండ్రి ఫాలభాగం మీంది వెంద్రుకలను వెనక్కునెడుతూ "సత్ప్రవర్తన, సేవాతత్పరత, త్యాగస్వభావాలతో ఆయన భిక్షువులలో గణుతి కెక్కవచ్చు; అందుకని ఆయన చికిత్సపై ఆశతో నీ ఆరోగ్యాన్ని క్షీణింపజేసుకొనుట న్యాయమా నాన్నా? మంచి వైద్యశ్రేష్ఠునివద్ద మందుదీసుకొని ఆరోగ్యాన్ని కాపాడుకొనుటలో ఆయన్ను అగౌరవించినట్లుకాదుగదా!" అన్నది.

ఆమెచుబుకాన్ని బట్టి మృదువుగా ఫూపుతూ, మందహాసాన్ని ప్రదర్శిస్తూ "ఆకాశవీధిలో విహరించే నక్షత్రాలు మనకు కనిపించునంత చిన్నవిగాదు; చిన్నవిగా కనిపించేవ

మరింత పెద్దవి. నక్షత్రకోటికంతటికి మాతృకయైన 'నెబ్యులా' మరింత చిన్నదిగా కనిపిస్తుంది. కాని అవి అనంత పరిమాణంకలది. పై మెరమెరలలోనే అన్నివిలువలూ వుండవమ్మా! సులోగస్‌ను నీవు యేమీ అర్థం చేసుకోలేదు. అతని గొప్పఆస్తిని,జీవితాన్ని సంఘానికర్పించినదే నీకు తెలుసు.అతని చికిత్సానిధానం పట్టణంలో ప్రశస్తమైనది. నిరాశతో అంతిమఘడియలు లెక్కించుకుంటున్న అనేకమంది దీర్ఘరోగులకు ప్రకృతిచికిత్సద్వారా సులోగస్ నూతనజీవితాన్ని కల్పించినట్లు పట్టణంలో ప్రతీతి. బుద్ధభగవానుని ప్రవచనాలను కలలోకూడా అతిక్రమించడు. అందుకే ఆయన్ను అపర బుద్ధదేవు డంటారు. ఇంతకంటె మంచివైద్యునికొరకు వెదుకుతున్నట్లు యెవరికయినా తెలిస్తే విస్తుపోతారు ప్రభా'' అన్నాడు.

ప్రహసితవదనంతో "యదార్థసత్యాలకు జనశ్రుతులు గీటురాళ్ళు కాదు నాన్నా! సులోగస్ చికిత్సా ప్రయోగాలతో విసిగిపోయాను. నానాటికి నీ ఆరోగ్యము క్షీణిస్తుండగా, నేనెలా సహించను? వారు చికిత్సాప్రవీణులు కావచ్చు కాని ఫలితము అన్నివేళలా అనుకూలం కాకపోవచ్చును. వారిద్వారా కాగల యోగం కనిపించనపుడు మరో మార్గాన్ననుసరించుట వారికి న్యూనత కలిగించుటకాజాలదు.''అని ప్రభ అంటుండగా కాషాయవస్త్రధారి సులోగస్ ప్రవేశించి, దత్తమిత్రుని రెండవప్రక్కగా నిలిచి ప్రసన్న దృక్కులతో ప్రభ నవలోకిస్తున్నాడు.

సాధుప్రవృత్తులుగల సజ్జనులయెడ యెంత క్రోధం జనించినా, వారిసమక్షంలో సడలిపోవుట మానవస్వభావము. తండ్రియెడల తనకున్న అనురాగము, ఆయన అనారోగ్యముతో తనకు కలుగుతున్న ఆదుర్దా, విసగడలతో అప్రత్యక్షంలో సులోగస్‌నుగురించి తిరస్కారంగా అనగలిగింది ప్రభ. ఏవ్యక్తిని నిర్లక్ష్యంచేస్తూ పలుకుతున్నదో ఆ వ్యక్తి శాంతిస్వరూపమూర్తిగా తనయెదుట నిలిచి, మందహాసంచేస్తున్నపుడు, ఆమె వెలవెలబోతున్నది. చేయరాని అపరాధంచేసికూర్చున్నదానివలె కుంచించుకుపోతున్నది.

తన పక్కమీంద రెండవపక్క చూపుతూ "రా నాయనా, కూర్చో మిత్రానంద్! (సులోగస్ సంఘస్వీకార సందర్భంలో "మిత్రానంద్" అను నూతననామధేయం పొందాడు.) అమ్మాయిపిచ్చిమాటలు విన్నావా? నా ఆరోగ్యం నానాటికి చెడిపోతున్నదట ..." అంటూండగా దత్తమిత్రునికంఠం బొంగురుపోయింది. ప్రభముఖమండలం మరెంత చిన్నబోతున్నది.

మిత్రానంద్ ఆసీనుడై దత్తమిత్రునిహస్తాన్ని తన చేతులలోకి తీసుకుని మృదువుగా స్పృశిస్తూ అనురాగంతో ఆర్ద్రమైన కంఠంతో "ప్రభమాటలు పిచ్చివిగాదు, యదార్థమైనవి. మీ అనారోగ్యాన్నిగురించిన విషయాలే నా మనస్సులో అనుక్షణమూ ఆదుర్దాను కలిగిస్తున్నవి. మీకు నేనుచేయగల చికిత్సావిధానాలన్నీ నిష్ప్రయోజనాలయినవి. చాలారోజులనుంచి నా నిష్ప్రయోజకత్వం మీకుమందు చెప్పాలనుకుంటూకూడా ఆఖరిఅవకాశాలనుకూడా పిస

యోగించుకుంటున్నాను. ప్రభ పిచ్చిదిగాదు, యోగ్యురాలు, సమర్ధురాలు. ఆమెలోనిసమర్ధతే నన్నీనాడు యీ విషయాలను మీకు చెప్పగలసాహసా న్నిస్తున్నది." అంటూ ప్రభ వైపు చూస్తున్నాడు. గ్రహణదోషానికి గురియవుతున్న పూర్ణచంద్రబింబమువలె ఆమెముఖమండలము జేవురింతలతో ముకుళించుకుంటున్నది. తిరిగి ధైర్యాన్నిచ్చుకంఠంతో "ఇది మానసిక కృశింపు. మనోరంజనతో గూడిన వుత్సాహము, వుల్లాసము, ఆనందము ఇందుకు మూలికలు. ఇవి నాద్వారా సాధ్యంగానందుకు చింతిస్తున్నాను." అన్నాడు మిత్రానంద్.

దత్తమిత్రునికంఠం రుద్ధమైపోయి మాటపెగలక అధరాలు అదురుతున్నవి. కనుకొలుకులగుండా అశ్రుబిందువులు జారుతున్నవి. ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడుగాని, కంఠము అడ్డగిస్తున్నది.

సహనము నోర్పు యెదుటిహృదయాలను కరిగించి బయటకొస్తవి. అధోముఖియైన ప్రభ పెద్దప్రయత్నంతో శిరస్సు పైకెత్తి నోరగా మిత్రానందముఖమండలాన్ని పరికించింది. నిర్మలమై శాంతితో మూర్తిభవించిన ఆయన దృక్కులు ఆమెహృదయాన్ని పూరించి తరంగాలతో తపతపలాడించినవి. ఆయనలోని సామాన్యతం తేజోవంతమై ఇపుడామెముందు ప్రభవిస్తున్నది. అనాలోచితంగా ఆమెహృదయంలో కృతజ్ఞత బీటలుపారుతున్నది.

మిత్రానందుని అప్రత్యక్షకృషితో దత్తమిత్రునికి గొప్పగొప్ప యునానీవైద్యులద్వారా చికిత్సజరిగింది.

సంవత్సరము జరిగిపోయింది. వైద్యుల విశ్వప్రయత్నాలు విఫలమయినవి. ఆయనలోని నీరసత, గుండెదడకుతోడు రక్తపోటుకూడా సంభవించింది. దత్తమిత్రునికిపుడు తన ఆరోగ్యాన్నిగురించిన చింతలేదు. తన ముద్దులబిడ్డను సాకేతలో తల్లి చెంతకు జేర్చుటనుగురించే విచారిస్తున్నాడు.

"ఇక నాకీ మందు లనవసరమమ్మా, ఈ మందులతోనే జరుపుతుంటే, నిన్ను నీ తల్లివద్దకు జేర్చకుండా నేను నిర్యాణంపొందవచ్చు"అని దత్తమిత్రు డంటుండగా ప్రభ చేతిలోనివీవనను విడచి, ఆయనఅధరాలమీద మృదువుగా అదుముతూ "అదేమిటి నాన్నా, అలాంటిమాటలంటారు! మీకు నయంగాకుండా మనం ప్రయాణంచేసేదిమాత్ర మెలా? మీకు యేచింతాలేకుండా ప్రశాంతంగావుంటే జబ్బు వెనుదిరుగుతుందని సులోగస్‌మామ అంటున్నాడు. కాని, మీరు యెప్పుడూ అనవసరమైన ఆలోచనలతో అలసట చెందుతుంటారు."అన్నది ప్రభ.

ఆయన ఆమెశిరస్సుమీద చేయివేసి నిమురుతూ అధరాలమీద ఆనందరేఖను ప్రస్ఫుటపరుస్తూ "పిచ్చితల్లీ, ప్రయత్నంతో ఫుల్లాసాన్ని సృష్టించుకుంటే, మానసికానందము కలుగదు. ప్రశాంతవాతావరణాన్ని పరిస్థితులు కల్పించాలి."అన్నాడు.

"అవసరమైనపరిస్థితులకొరకు మనము ప్రయత్నించాలిగదా, నాన్నా!" అన్నది.

"ప్రయత్నాలవలన ప్రయోజనం శూన్యమైనపుడు

పర్యవసానపరిష్కృతిని పొందజూచుటే అంతిమవిధాన మమ్మా" అన్నాడు.

"నన్ను యింటికిచేర్చుటే మీకు ముఖ్యమైనా మీ అనారోగ్యంతో ప్రయాణంచేస్తే ప్రయోజనముండదుగదా! ఇంత దీర్ఘప్రయాణము భయానకమార్గాలగుండా యెలా చేయగలము నాన్నా!" అన్నది.

"అలాఅని రోజులు గుణిస్తూ కూర్చుంటే, ఇక్కడే నా అంతిమశ్వాస ఆగిపోవచ్చు. చెడు వెంటాడుతున్నప్పుడు పారిపోయి తప్పించుకోజాలము. అంతకుమించిన చెడును వెతికి కౌగిలించుకుంటే, సమస్య అంతముగాక తప్పదు. ఏదియేమయినా యిక ప్రయాణంసాగించవలసిందేనమ్మా. ఇద్దరునౌకర్లను తోడుయివ్వవలసిందిగా సుల్తాన్‌ను కోరతాను." అన్నాడు.

ప్రభ తండ్రివైపు తదేకంగాచూస్తూ, దీర్ఘశ్వాసను విడచింది.

భిక్షాటననుంచి వచ్చిన మిత్రానంద్ వారిసపురిమధ్య ఆవరించిన గంభీరముద్రను గమనించి, చిరునగవును అధరాల మీద ఆడిస్తూ "మీరియిరువురూ ఆలోచనలతో అలిసిపోయి న్నట్లున్నారు. ఆలోచనలద్వారా నిజమైన ఆనందము లభించదు. ఆత్మసంతృప్తిలోనే ఆనందముంటుంది." అంటుండగా దత్తమిత్రుడు అందుకుని, "మిత్రానంద్, ఇంకా యిక్కడుండి నీకు బాధకలిగించదలచలేను. ప్రయాణానికే నా

మనస్సు పరువులెడుతున్నది. ఎంతయివ్వవలసివచ్చినా భరిస్తానుగాని, విశ్వాసపాత్రులైన యిరువురునౌకర్లను నాకు తోడుయివ్వు నాయనా" అన్నాడు. మందహాసాలొలికిస్తూ "తప్పక అలానే జరుగుతుంది"అంటూ పెరటివైపు వెళ్లాడు మిత్రానంద్.

ప్రభ వెలవెలబోతూ శిలాప్రతిమవలె నిలిచిపోయింది. మిత్రానందునిద్వారా యే మందలింపులు వస్తవనుకున్నదో అవి రాలేదు. ఆయనద్వారాగూడా తండ్రికి ప్రోత్సాహమే కలిగింది. ఆమెమనస్సు క్రోధావేశాలతో కొరకొరలాడుతున్నది. ఈ భిక్షువుస్వభావము అన్నిటికీ ఆనంనపడేదేమో, అన్నిటిని ప్రోత్సహించేదేమోనని అనుకుంటూ ఆయన వెళ్ళినవైపే నడిచింది.

మిత్రానంద్ తనభిక్షాపాత్రనుంచి యేరిన ఖర్జూరపళ్ళను తనసహచరులకు వరుసగా పంచుతున్నాడు. ఫలాలనుపొందినవారు ఆవలకు వెళ్ళిపోతున్నారు. ఆఖరుకు ఆయన ఆసనంమీద కూర్చుని, భిక్షాపాత్రలో మిగిలినపళ్ళను భుజిస్తున్నాడు. ఆ పుచ్చిపోయిన ఖర్జూరపళ్ళను ఆనందంతో భుజిస్తున్న ఆ దృశ్యం జూచి, ప్రభ చకితురాలయింది. ఆయన యీమెరాకను గమనించలేదు. ఆమె భరింపరాని మనోవేదనతో నిశ్శబ్దాన్ని భగ్నపరుస్తూ "అదేమిటి మిత్రానంద్! ఆ పుచ్చిపోయినపళ్ళు తింటావేమిటి?"అంటూ అక్షయపాత్రను పట్టుకోబోయింది.

మిత్రానంద్ ప్రఫుల్లితవదనంతో కిలకిలారావంచేస్తూ చేతిసైగతో ప్రభను వారిస్తూ, "పుచ్చినంతమాత్రాన పేటి

లోనికుచి పోలేదు." అన్నాడు. "అంతపుచ్చిపోయినవాటిని తింటూ సమర్థించుకుంటారెందుకు? ఒకవేళ కుచివున్నా జబ్బుచేస్తుందిగదా!" అన్నది. "దానంపొందినదాన్ని నిరాదరముచేయరాదు. అది బుద్ధదేవుని ఆజ్ఞ," అన్నాడు. "అనారోగ్యమనైనా భయపడాలిగదా!" అన్నది.

"పూర్తిసంతృప్తితోను విశ్వాసంతోను భుజించు పదార్థం అనారోగ్యాన్ని సృష్టింపజాలదు." అంటూ ఆ ఫలలాలోని పుచ్చును రాలగొట్టుకుంటూ వూడుకుని భుజిస్తున్నాడు మిశ్రానంద్. ఆత్మతృప్తితోనిండిన ఆనందరేఖలు నిర్మలమైన ఆయనముఖమండలంమీద ప్రసరిస్తూ స్నిగ్ధ రూపంలోని శాంతిసందేశాన్ని విసుకుతున్నవి. ఆమె హృదయం ముగ్ధతతో వూగిపోయి కరిగింది గాబోలు, కనుకొలకులప్రక్క బాష్పబిందువులు కనిపిస్తున్నవి. ఏదో మాట్లాడాలని ప్రయత్నించిందిగాని, గొంతు పెగలలేదు. ఆయన ఆ పుచ్చుఖర్జూరాలను తింటుంటే తనశరీరం గగుర్పాటు చెందుచున్నది. వాటిని దానంజేసిన దాతనుగురించి చిత్రవిచిత్రంగా మదిలో ఆలోచించుకుంటున్నది. బుద్ధభగవానుడు కల్పించిన త్యాగములోను, సహనములోను, సేవాతత్పరతలోను యింత శాంతితోగూడిన దీక్షను తాను ప్రత్యక్షంగా చూస్తున్నట్లు, ఈ దీక్షలోని స్నిగ్ధత్వానికి కారణం భగవానునిప్రవచనాలందున్న పరిపూర్ణప్రభావమయినట్లు, బౌద్ధభిక్షువులలో కలిసిపోయిన యశ్‌పాల్ కొన్నిసంవత్సరాల తదనంతరం భిక్షువుగా భిక్షాటనకు తనపట్టణానికే, తన యింటికే, వెళ్ళి నిలిచినపుడు, తనతల్లియే, భిక్షువులయెడ

నున్న క్రోధంతో దోసెడు పుచ్చినకందులు పోయగా, ఆ భిక్షువు అక్కడే బయట కూలబడి, మహదానందంతో, ఆ పుచ్చుకందులను భుజిస్తుండగా, తల్లి బిడ్డగా గుర్తించి, వాపోయిన దృశ్యం, తనముందే జరుగుతున్నట్లు ఆమె మనోఫలకంలో దొంతరులవలె ఆలోచనలు దొర్లుతున్నవి.

మిశ్రానంద్ తనభోజనం ముగించి, "అలా చూస్తున్నావేమిటి ప్రభా! కూర్చో!" అన్నాడు. ఆ మాటలతో ఆమె ఆలోచనాలోకంనుంచి ఒక్కమాటుగా దూకినట్లయి, మతిబోయినదానివలె తడుముకుంటూ నతనతలాడుతూ "ఏమీ లేదు. నాన్నగారు తలపెడుతున్న ప్రయాణాన్ని మీరు కూడా సమర్థిస్తున్నారా?" అన్నది.

"అవును, అదే వుత్తమమని నాకూ తోచింది"

"వారి ఆరోగ్యాన్ని బాగా గుర్తించండి. ఇన్నివేల మైళ్ళప్రయాణం యెలా చేయగలరు?"

"ఆవిషయాలన్నిటిని ఆలోచించే నేనూ ఆ నిర్ణయానికొచ్చాను."

"మీతో వారు ప్రయాణంవిషయ మిదివరకే ప్రస్తావించారా?"

"లేదు, నేనే అలా ఆలోచించాను. వారిఆరోగ్యం యిక యిక్కడ మందులవలన కుదురదు. మానసికతృప్తి ఆనందము కలిగినపుడు కుదుటపడవచ్చు. అది ఒక్క ప్రయాణంతోనే సాధ్యము."

మిశ్రానంద్ మాటలతో ఆమెమనస్సు రసాతలానికి

బోయి దీర్ఘ వేడినిట్టూర్పును విడిచింది. శీతలబాధతో వణుకు తున్నవాని బాధను జూచి, జాలితో అతనిని అగ్నిగుండం లోకి నెట్టిన ఆపద్బాంధవునిబోలినట్లు తోచింది. తన సంఘా రామంనుంచి యెలాగయినా తనను బయటకుపంపనున్నట్లు ఫూహించినంత నే, ఆయనయెడల తనహృదయం ఘృణీ కృతమైకూర్చున్నది. ఆత్మాభిమానం వుబికి శిరస్సున సవారీచేయసాగింది. ఆ మనఃకంపనలో యమబిలానికి పోవుటకయినా సంసిద్ధురాలయి స్థిరీకరించుకుని తుస్కార రూపంలో చివ్వున లేచి తిరిగి తండ్రిచెంతకు చేరి కూర్చు న్నది. తనముఖమండలంలోని మ్లానతను, క్రోధావేశాలను తండ్రి యెక్కడ పసిగడతాడోననేభయంతో ప్రక్కలకు చూస్తూ దీర్ఘ వేడినిట్టూర్పులద్వారా హృదయాన్ని శాంతింప జేసుకుంటున్నది. బుద్ధభగవానుని అడుగుజాడలలో నడిచే త్యాగనిధులు సేవాకంకణబద్ధులు శాంతిదూతలుఅయిన యీ భిక్షువులలోకూడా యింత స్వార్థము మర్మము నిండి వుండగా, మానవసమాజాని కెలా ముక్తికలుగుతుందా అని ఆలోచిస్తున్నది.

ప్రభ యెంత భయకంపితురాలైనా, సందిగ్ధురాలైనా, దత్తమిత్రుడు ప్రయాణసంసిద్ధుడయినాడు. తనకు కావలసిన వాహనాలను, సామగ్రినికూడా మిత్రానందద్వారా పొందాడు. విశ్వాసపాత్రులైననౌకర్లనుకుదుర్చుభారంకూడా మిత్రానందదే. కాని, ఆవిషయంలో ఆయన ప్రయత్నించి నట్లుకూడా కనిపించలేదు. ఇంకొకరోజుమాత్రమే ప్రయాణ

వ్యవధి. నౌకర్ల కొరకు దత్తమిత్రుడు ఆమర్దా చెందు తున్నాడు. మిత్రానంద్ నిర్లక్ష్యాన్ని కనపరుస్తున్నాడు. ప్రభహృదయం క్రోధావేశాలతో పొంగి పొగలుగ్రక్కు-తున్నది. ఈ శాంతిస్వరూపవేషధారియైన భిక్షువుయొక్క-నిరాదరాన్ని నిర్లక్ష్యాన్ని సహింపజాలక, తనతండ్రినిర్ణయం లోనే విజ్ఞతున్నదని, భిక్షువునిజస్వరూపాన్ని అర్థంచేసు కున్నందున ఇక్కడ క్షణంకూడా వుండనొల్లక, వీరిని చూచుటకూడా హేయమని భావించి, బౌగోగులను ప్రారబ్ధా నికి వదలి, యింత ఆత్రతతో ప్రయాణమవుతున్నాడని వూహించి, తను యింతవరకు ప్రయాణాన్ని నిరోధించి నందుకు సిగ్గిలుతున్నది. ఇపుడు యదార్థస్థితిగతులను అర్థంచేసుకున్నదానివలె తండ్రికంటె తానూ ప్రయాణానికి క్షణాలను లెక్కిస్తున్నది. మిత్రానంద్ సహాయాన్ని పొందుట కంటె, తన స్వయంకృషే మంచిదని నౌకర్లకొరకిపుడు తానే తండ్రికి తెలియకుండా ప్రయత్నిస్తున్నది. ఆరోజంతా విరామంలేనికృషిలో క్షణంగా గడిచిపోయింది. కాని, ప్రయత్నం సఫలంకాలేదు. ఇంత దూరప్రయాణానికి తోడు గావచ్చుటకు నౌకర్లు దొరకుట కష్టమని, దొరికినా విశ్వసిం చుట తగదనే విషయాలనుకూడా ప్రభ తెలుసుకున్నది. మిత్రానందమీద కలిగిన హేయతతో యెంత తొందరగా పయపులెత్తాలని వూగిందో, నౌకర్ల మోసాలు, దారిభయాన కత విన్నపుడు అంత విమూఢురాలయి విహ్వలతలో మునిగి పోయింది.

ఆత్మాభిమానాలకు పౌరుషాలకు అన్నివేళలా అనుకూలవాతావరణం సంభవించదు. నౌకర్లయేర్పాటుకయి మిశ్రానంద్ ప్రయత్నమే చేయకుండుట, తాను చేసి, నిష్ఫలమందుటతో ఆమె ప్రయాణాన్నిగురించి హతాశురాలైంది. ఆమెమనస్సు ఆద్యంతాలు ఆలోచనలతో వేడెక్కి, చీకాకుతో శివమెక్కుతున్నది. ఈ భీతావారాసము నుంచి మిశ్రానంద్ శ్రద్ధాశ్రయాలనుంచి దూరంగావాలనుకుంటున్నది.

దీర్ఘవ్యాధితో చిక్కి శల్యమై అర్భకావస్థలోనున్న దత్తమిత్రునికి స్వయంగా ఒకకావ్యాన్ని సాధించుకోగలశక్తిగాని, ప్రయాణంచేయగలశక్తిగాని లేదు. తిరిగి యింటికిచేరాలని మనస్సు వాపోతున్నది. తన అవస్థను గమనించి ప్రభ నిరోధించినా, తాను పోవాలని పట్టుబట్టి మిశ్రానంద్‌సహాయాన్ని కోరాడు. విశ్వాసపాత్రులైన నౌకర్లు దొరికితే చేరగలిగినంతవరకు తననూ సురక్షితంగా చేరుస్తారు. మార్గమధ్యంలో తన అంతిమశ్వాస ముగిసినా, తనబిడ్డనూ యింటికి చేరుస్తారని ఆయన ఆత్మవిశ్వాసం. పయనసమయం సమీపిస్తున్నకొద్ది ప్రభ తండ్రియెడల వుదాసీనతను ప్రకటిస్తున్నది. ఆయన ఆమె మౌనముద్రను భగ్నంచేయ సాహసించలేకపోయాడు. తాను నిర్ణయించుకున్నరోజున బయలుదేరితే, యేయే ప్రాంతాలలో యెన్నినెలలు గడచునది, యెక్కడెక్కడ చోరభయముండునది, యెంతకాలానికి తాము యింటికిచేరగలుగునది, ఇంటికిచేరునపుడు పట్టణవాసులంతా చేరి, వేసే ప్రశ్నలగురించి, వారుపొందే ఆనందాన్ని

గురించి తెరపిలేని ఆలోచనలలో మునిగి, ఆలోచించిన వాటినే తిరిగి చర్విత చర్వణంగా ఆలోచిస్తూ నిన్నటివరకు గడిపాడు.

నేడు తాను ప్రయాణానికి నిర్ణయించుకున్న రోజు. ప్రభ అటూయిటూ వస్తూ పోతున్నది. జిజ్ఞాసాభరితదృక్కులతోనున్న ఆమెముఖంలో వేదనచ్ఛాయలు గనిపిస్తున్నవి. అందుకే ఆమెను పలుకరించలేకపోతున్నాడు. నిన్నటిఉదయం నుంచీ మిత్రానంద్ తనకు కనిపించలేదు. పరీక్షాఫలితాల కొరకు యెదురుజూచిన విద్యార్థి తననెంబరు పేపరులో లేనపుడు నిశ్చేష్టుడై వికలంచెందినట్లు దత్తమిత్రునిహృదయం అస్తవ్యస్తమైపోయింది.

# తిరుగు ప్రయాణం

అది పగలు రెండుగంటలసమయము. బరువెక్కిన హృదయంతో వరుసక్రమములేని దుఃఖపూరిత ఆలోచనలతో వూపిరిసలుపక దత్తమిత్రుడు వుదాసీనవదనంతో పెద్ద ప్రయత్నంతో తప్పటడుగులు వేసుకుంటూ ఆరుబయటకు చేరి అరుగుమీద కూర్చుని, యెడారిలో దప్పికగొన్నవాడు యెండమావులను జూచి చప్పరించునట్లు భారతదేశమువైపు కాంక్షాభరితదృక్కులతో చూస్తున్నాడు. వృక్షాలులేని అరణ్యమువలె, జలశూన్యమైన సాగరమువలె అనంతఆకాశము శూన్యముతో బిక్ బిక్ మంటున్నది. ఈశాన్యదిశన ఆకాశము పృథ్వితో కలియునట్లుండుచోట చిన్నారిమబ్బులు

యెండినతటాకంలోని మట్టి నెర్రెలుబారి ముక్కలుముక్కలుగా గనిపించునట్లు గోచరిస్తున్నవి. ఆకాశంమధ్యలోనున్న ప్రచండరూపధారి భాస్కరుడు ఆగిపోయినట్లున్నాడు అలసట చెందిన గాబోలు. ప్రక్కనున్న వటవృక్షంమీది పక్షిజాలం మౌనవ్రతాన్ని పాటిస్తున్నవి. నిర్మలతను భగ్నముచేయగూడదనో లేక జీవితంలో యింతకుమించి పొందేది లేనపుడు యీ బండిచక్రములాంటి జీవితాల సార్థకమేమిటనే అంతర్గతఆలోచనలలోనున్నవో, బాటప్రక్కన దుమ్ములో కట్టు గొయ్యలకు బంధించబడిన గాడిదలు మేకులచుట్టూ తిరుగుతూ, మధ్యమధ్య ఆగి లొంక్కుంటూ మిరిమిరి దిక్కులు జూస్తున్నవి. తమచేత అంత చాకిరీచేయించుకునే యీ మానవులకు న్యాయము, ధర్మము, జాలి అనేవి యెందుకు లేవా అనే ఆలోచనలతో గాబోలు, రోడ్డుప్రక్కన ఒక కోడిపుంజు పెట్టచుట్టూ కుక్కుక్కుమంటూ నృత్యంసలుపుతూ, ముక్కుతో పృథ్విని పొడిచి గింజనుచూపుతూ లాలిస్తున్నది. కాని, పెట్ట పారిపోవటానికి ప్రయత్నిస్తున్నది. ఈ లాలింపులన్నీ అనవసరానికి చేసే మోసాలని గాబోలు, ఎదురుగా దూరంగావున్న శిథిలాలయంతాలూకు దేవవిగ్రహం గాబోలు నొక్కులుబోయి ముక్కూ చెవులూ వూడిపోయి యెండతీవ్రతకు మెరుస్తున్నది. కుక్క వెతుక్కుంటూ వెళ్ళి ఆ దేవవిగ్రహంమీదనే మూత్రవిసర్జనచేసి వెళ్ళిపోతున్నది. ఈ మానవులూ మోసగాళ్ళు, వీరికల్పిత దేవుళ్ళూ శుద్ధఅబద్ధాలు అనే పంతముతో గాబోలు, పట్టణం మధ్యనుంచి తెల్లటిపొగ స్తంభమువలె పైకిలేచి, వక్రాలు

వక్రాలుగా తిరిగి పక్కలకుపోయి గాలిలోకలిసి అదృశ్య మవుచున్నది. ఆ పొగనే పరికిస్తున్నాడు మన దత్తమిత్రుడు. అటువైపునుంచే ఒక పశువులమంద వస్తున్నట్లు గనిపించింది. ఆ మంద తానున్నవైపుకే వస్తున్నది. మూడుగుర్రాలు, రెండుకంచరగాడిదలు వస్తున్నవి. వాటివెనుక రెండుకుక్కలు అడుగులోఅడుగు వేసుకుంటూ వస్తున్నవి. వాటివెనుక ఒక వ్యక్తి గనిపిస్తున్నాడు. దగ్గరకువచ్చినకొద్ది వాటిమీద సంచులుకూడా గనిపిస్తున్నవి. వాటినడకచే దుమ్ము రేగుతున్నం దున వెనుకనున్నవ్యక్తి స్పష్టంగా కనిపించుటలేదు. భిక్షా రామంముందు కొచ్చి అన్నీ ఆగిపోయినవి. ఆ వెనుక నున్నది మిత్రానందుడే! జేబులోని నందరూపాయలపర్సును పోగొట్టుకుని, వెతికి వెతికి విసిగి నిస్పృహతో యింటిముఖం పట్టుతున్న పథికునకు దారిలో వెయ్యిరూపాయలపర్సు దొరికినపుడు అపారఆనందంతో బిత్తరపోయినట్లు దత్త మిత్రుడు అవధులకుమించిన ఆనందంలో పరవశమై నెర్రి వానివలె మిత్రానందునివైపు చూస్తున్నాడు.

"మీ రెంకా సర్దుకోలేదా మామా?" అని స్పృహ స్వగంతో ప్రశ్నించాడు మిత్రానంద్.

జిజ్ఞాసాభరితదృక్కులతో "నౌకస్థ దొరికారా నాయనా?" అని ప్రశ్నించాడు దత్తమిత్రుడు.

మందహాసాలోలిక్తూ "అన్నియే న్ఫాట్లతో నే వచ్చాను." అన్నాడు మిత్రానంద్.

అనుమానాస్పదమైన ముఖకవళికలతో "సమ్మాదగిన వాళ్ళేనా?" అన్నాడు దత్తమిత్రుడు.

"మీరు నిశ్చింతగా పయనించవచ్చు" అన్నాడు.

వ్యథాభరితహృదయంతో పాలుబోక అటూయిటూ పచార్లుజేసి, విసిగి పక్కమీద పడి దొర్లుతూ ఆలోచనా దొంతరులలో మునిగివున్న ప్రభ యీమాటలు విని, నూతిలో పడినవానికి మెట్లుదొరికినట్లు వుత్సాహాన్నిపొంది చివ్వున లేచి బయటకొచ్చింది.

"నీవుకూడా అలావున్నావేమిటి ప్రభా! తొందరగా సర్దుకోండి." అన్నాడు మిత్రానంద్.

"మీరు తీసుకొచ్చిన నౌకర్లేరి?" అని ప్రశ్నించింది ప్రభ.

"ఆవిషయాలు నావి. మీకు ఆదుర్దా యెందుకు చెప్పు? మీరు పయనంగండి" అన్నాడు మిత్రానంద్.

దత్తమిత్రుడు, ప్రభ ప్రయాణసన్నాహులయినారు. వారిసామాను తినుబండారాలసంచులు నీటినినింపు చర్మపు సంచులు వగైరా కంచరగాడిదలమీద బిగించారు. దత్త మిత్రునికి గుఱ్ఱంమీద కూర్చోను విశేషరీతులలో మెత్త అమర్చారు. భిక్షారామభిక్షువులందరూ యీవత్తు సర్దుబాటు జేస్తున్నారు. మిత్రానంద్ దత్తమిత్రుని గుఱ్ఱంమీదకు యెక్కించను ప్రాంజ్ఞచేశాడు.

"నేను నెమ్మదిగా యెక్కికూర్చుంటాను, పరవా లేదు. ముందు ఆ నౌకర్లెక్కడో చూపు బాబూ" అని దీనంగా అడిగాడు. ప్రభకూడా తండ్రిచెంతకు జేరి, మిత్రా నంద్‌జవాబుకొరకు క్రీగంట చూస్తున్నది. నౌకర్లు వారక్క

పోయినా, తమను నెట్టివేయజూస్తున్నాడని ఆమెమనస్సు లోని వో ప్రవృత్తి కొరకొరలాడుతున్నది.

మిశ్రానంద్ దగ్గరగా వచ్చి, మృదుమధురాలొలుకు మందహాసంతో స్నిగ్ధకంఠంతో "మీరు దీర్ఘరోగులు; శారీరకంగా అతి దుర్బలులు. ప్రభ యుక్తవయస్సులోవున్న అబల; మార్గము అతి భయానకమైనది; వేలమైళ్ళు నెలల తరబడి పోవాలి. యీస్థితిలో మిమ్ము నౌకర్ల వెంట యెలా పంపగలను చెప్పండి! మీతో నేనే వస్తున్నాను. మిమ్ము పంపివచ్చుటకు యెన్నిసంవత్సరాలుపట్టినా, గురుదేవులవద్ద నేను సెలవుదీసుకున్నాను." అంటూ మిశ్రానంద్ శిరస్సును అధోముఖంచేశాడు.

దత్తమిత్రునిహృదయం వాత్సల్యంతో కరుణతో కరిగిపోయి, కంటిగుండా కారుతున్నది. అదురుతున్న అధరాలతో అస్పష్టమైనమాటలతో "మిశ్రానంద్!" అంటూ బాహువులమధ్యకు దీసుకుని బంధించాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్న ప్రభ కనుకొలకులలోకూడా బాష్పబిందువులు వుబుకుతున్నవి. వాటిని యెక్కడ యెవరు చూసిపోతారోనని శిరస్సు అధోముఖంచేసింది. ప్రకృతి యెంత విచిత్రమైందో మానవస్వభావముకూడా అంత విచిత్రమైంది. ఏక్షణము యెటు మొగ్గుతుందో, యే ఆలోచనలలో మునుగుతుందో, యెటు క్రోధజ్వాలలను బరపుతుందో యెటు ప్రేమలొలికిస్తుందో, యేక్షణము ఆనందోత్సాహాల హాయిలో వూగిపోతుందో యేక్షణము దుఃఖావేశాలలో కుమిలి కృశించిపోతుందో యెవరూ చెప్పజాలరు. ఘృణీకరించుకున్నదాన్ని

మరోక్షణంలో హృదయానికిహత్తుకుని ముద్దులతో ముంచి వేయుట, ఆ మరుక్షణంలోనే నెట్టివేసి హేయంగా చుత్కారించుట, పొంది పోగొట్టుకునో, పొందలేనిదాన్ని పొందుట కొరకో విలపించుట మానవునికి సనాతనంగా అలవాటయి పోయింది.

ప్రభ యింతకుముందు యెవరినిగురించి వికృతాలోచనలతో ఘృణీకరించుకుంటున్నదో, యెవరికి దూరంగావాలని చిందులుద్రొక్కిందో యిపుడు ఆయనయెడల ఆమెశరీరం యావత్తు కృతజ్ఞతతో పులకితమవుతున్నది. దత్తమిత్రునికి మిత్రానందునియెడల ప్రారంభమునుంచి యున్న సద్భావాలు వున్నతాలై శిఖరాగ్రాన్నందుకొన్నవి. ఇపుడాయనకు మిత్రానందుని చూచుటలోను మాటలు వినుటలోను హృదయతంత్రువులలో యెక్కడో మృదువుగా మీటినట్లయి, బావిలోనివూటవలె ఆనందోత్సాహపు పురకలు పరువులెడుతూ ప్రఫుల్లితకాంతులతో ప్రకాశింపజేస్తున్నవి.

మిత్రానంద్ నిర్ణయించుకున్నదానికంటె నిత్యము ప్రయాణదూరం యెక్కువచేస్తున్నాడు. ప్రయాణంప్రారంభించి ఒకఋతువు గడిచిపోయింది. మిత్రానంద్ వూహించినట్లే దత్తమిత్రునిఆరోగ్యము వృద్ధిబొందుతున్నది. ఇపుడు ప్రయాణం కోలాహలంగా సాగిపోతున్నది. మిత్రానంద్ సంధ్యవేళ ప్రయాణాలపుడు ప్రాకృతికగీతాలు పాడుతుంటాడు. ప్రభ తనగుర్రాన్ని ఆయనగుర్రానికి ప్రక్కగా పోనిచ్చి, మధుభరితకంఠంతో "ఆనంద్, పాపం! చాలా

పాటలు పాడావు. నీ గొంతు యెండిపోతుందేమో, ఈ ఖర్జూరపండును నోట్లో వేసుకో" అని యిస్తుంది. ఆయన ఆనందముతో ఆ పండును అందుకుంటూ "మరి పాడగలిగిన వాళ్ళు పాడనపుడు చేతగానివారు ఆత్మోత్సాహంకొరకు పాడుకోవాలిగదా ?" అంటాడు.

"పాడగలిగినవారెవరున్నారు! నీపాటకు చూడు, ఆ పారిపోతున్న లేడిపిల్లలు వెనుదిరిగి నిలిచి నీ పాటను ఆలకిస్తున్నవి."

"వాటికి ఆపదకలిగించేవాళ్ళమో కాదో, అవి స్థిమితపడి వెనుదిరిగి ఆలోచిస్తున్నవి, అంతే!"

"లేదు లేదు. నీ పాట వాటిహృదయాలను కరిగించి, ఆపివేసింది."

"అబ్బ! ప్రభా, యిలా నేళాకోళంజేస్తే, నోరుమెదపకుండా పోతుంటే ప్రయాణంలో సర్దాకలిగే దెలా చెప్పు?"

వీరి సరసాలతోగూడిన సంభాషణ వింటున్న దత్తమిత్రుడు ముగ్ధుడవుతూ "ఖుశ్రానంద్‌ను చిన్నబుచ్చకపోతే నీవు పాడరాదా అమ్మా!" అన్నాడు.

"అదేమిటి నాన్నా, మీరుకూడా అలాఅంటారు! నేను పరిహాసంగా అనలేదు. నిజంగానే పాట బాగుందన్నాను!" అన్నది ప్రభ తెచ్చిపెట్టుకున్న క్రోధాన్నభినయిస్తూ.

"ఎలా అన్నా నాకు బాధవుండదని నీకు తెలుసు. నిన్ను పాడమని కోరుతున్నాము" అన్నాడు ఖుశ్రానంద్.

"కోరితేనూ ప్రయత్నిస్తేనూ పాట వచ్చేదిగాదు మహాశయా! దానంతటదే వుల్లాసంకొద్దీ హృదయాంత

రాళంనుంచి పోగొట్టుకురావాలి." అన్నది వస్తున్న నగవును బిగబట్టి.

"ఆ సుముహూర్తము యెన్నటికయినా వస్తుందంటావా ?" అన్నాడు పరిహాసరూపంలో.

"అది అదృష్టాన్నిబట్టి వుంటుంది" అన్నది కొంటె చూపులు విసరుతూ.

"అంతగా కోరినపుడు పాడగూడదా అమ్మా!" అన్నాడు దత్తమిత్రుడు. ప్రభ మౌనంవహించింది. ఆమె గుర్రం ముందు నడుస్తున్నది. మిత్రానంద్ గుర్రం ప్రక్కగా వెనుకవరుసలో వున్నది. మిత్రానంద్ తనగుర్రాన్ని కాలుతో మోది, ఆమెప్రక్కకు జేరి "పాటపాడమన్నానని కష్టంగా వుంది కాబోలు. ఇక నిన్ను యెన్నడూ పాడమని బాధించను" అన్నాడు. ఇద్దరిగుర్రాలూ అడుగులోఅడుగు వేసుకుంటూ ఒకేవరుసలో నడుస్తున్నవి.

ఆమెస్మృతిపథంలో మృదుమధురమైన స్మృతులేవో మెదిలినవి గాబోలు; గంభీరఆలోచనలలో మునిగిపోయింది. తాను సరయూనదిలో యీదుతున్నట్లే వున్నది. తన ప్రక్కన వస్తున్న మిత్రానంద్ అశ్వఘోష్ అయినట్లు, ఆయన తనకంటె మిగులకుండా నెమ్మదిగా యీదుతున్నట్లు అనిపిస్తున్నది. వడ్డునవున్న జనము కేకలు పెడుతున్నట్లు విని, ఆలాపనలోని రోషంతో అశ్వఘోష్‌ను వెనక్కునెట్టాలని మిత్రానంద్‌ను పట్టుకోబోయి గుర్రమునుంచి జారి పడిపోయింది. ఆమెహస్తాలు మిత్రానంద్‌కు చిక్కినవి. పడ

కుండా తనగుర్రంమీదికి లాక్కుని, గుర్రాన్ని ఆపుజేసి నిర్ఘాంతపోతూ "ఏమిటి ప్రభా, ఏమిజరిగింది?" అన్నాడు. దత్తమిత్రుడు భయకంపితుడై తను దిగి ముందుకు వచ్చాడు. ఆమె నవ్వటానికి ప్రయత్నిస్తూ "ఏమీలేదు, యేమీలేదు." అన్నది. కాని ఆమెనవ్వులో శుష్కత ప్రకటితమవుతున్నది.

ఇపుడు మెసపటోమియాలో పయనిస్తున్నారు. కాని వర్షరుతువు ప్రారంభమైనందున ఆగిపోవలసివచ్చింది. ఒక వ్యాపారకేంద్రములో ఆగిపోయారు. దత్తమిత్రు డిపుడు బాగా పచార్లుచేయగలుగుతున్నాడు. మిత్రానంద్ గుర్రాలను మేపుకురావటానికి వెళ్ళినపుడు, ఆయనరాకకొరకు యెదురుచూస్తుంటాడు. మిత్రానంద్ తనయెదుట లేనపుడు క్షణంకూడా తోచదు దత్తమిత్రునికి. ప్రభ యెప్పుడూ ఆయన్ను అంటిపెట్టుకునివుండి వితండవాదనలుచేస్తూ వుంటుంది.

ఆ కేంద్రములోవున్న బౌద్ధభిక్షువులతో మిత్రానంద్‌కు పరిచయమయింది. వారిపు డాయనకు గొప్ప ఆధిక్యతనిస్తున్నారు. వారికి తరచుగా జాతకకథలను వినుపించుట నియమమయిపోయింది. ఇది ప్రభకు కొంత బాధను కలిగిస్తున్నది. ఎప్పుడూ భిక్షువులు మిత్రానందనుచుట్టి వుండుట ఆమెకు చీకాకును కలిగిస్తున్నది. దత్తమిత్రుని కది ఆనందాన్నిస్తున్నది. ఆయన కిపుడు మిత్రానంద్ మరింత గొప్పగా కనిపిస్తున్నాడు.

# కఠోరదీక్ష

అశ్వాలను తోలుకెళుతున్న మిశ్రానంద్ వెంట ప్రభ కూడా వచ్చింది. హరితవర్ణశోభిత ప్రకృతిసౌందర్యంతో శోభిస్తున్న గిరిప్రక్కగా రజితకాంతులనాగినివలె సెలయేరు సరసర ప్రవహిస్తున్నది. అం దుత్పన్నమవుతున్న మర్మర ధ్వని సనాతన శాస్త్రీయసంగీతమువలె కర్ణానందభరితము చేస్తున్నది. చిత్రపటములోని బొమ్మలవలె గగనానికంటు తున్న వృక్షతతులు హోరుగాలికి కోలాహలంచేస్తున్నవి. తోడేళ్లు సరససల్లాపాలాడుకుంటున్నవి. దిగంతములో శ్యామలమేఘగుచ్ఛాలు తూర్పుదిశకు వేగంగా పయనిస్తు న్నవి దప్పికగొని గాబోలు. సెలయేటిప్రక్కల వివిధ మొక్కలు పుష్పగుచ్ఛాలతో విరాజిల్లుతూ పవనహోరుకు తాండవనృత్యము సలుపుతున్నవి. మధూకములకు పుష్పా లకు మధ్య యీర్ష్యతో వీచు పవనాలవలన గాబోలు ఆలింగ నాల సందుకోజాలక గాలిలో తేలియాడుతూ, సెలయేటి సంగీతానికి శ్రుతిగలుపుతున్నవి.

ప్రభ నీటిఅంచును చేరి, చిన్ని రాతితిన్నెపై ఆసీను రాలై తన కోమలమైన కుడిహస్తముతో ఆ శీతలజలాన్ని అటూయిటూ తోస్తూ క్రీడలుసలుపుతున్నది. నీటిఅంచు లందు మెరుస్తున్న స్ఫటికపుపలుకులు ఆమెను ఆకర్షించినవి. వాటిని యేరి జలములో పరిశుభ్రపరచి పరిశీలనజేస్తుతూ "ఆనంద్," అని కేక వేసింది. కోమలంగా పెరిగి పవనాలకు అటూయిటూ వూగుతున్న ఆ పచ్చికను గుర్రాలు

మేస్తుంటే, వాటిహృదయములోని వుత్సాహాలను వూహిస్తూ చూస్తున్న ఆనంద్ ఆమెపిలుపుతో అంగలుపంగలు వేసుకుంటూ ఆమెచెంతకు చేరి "ఏమిటి ప్రభా?" అని ప్రశ్నించాడు.

"ఈ రాతిపలుకులు యెంత అందముగా మెరుస్తున్నవో చూడు!" అంటూ తనచేతిలోనివాటిని చూపింది. సంభ్రమాశ్చర్యాలతో వాటిని తనచేతిలోకి తీసుకుని చూచి "ఇవి వైఢూర్యజాతికి చెందినవి. మూగవైఢూర్యాలు" అన్నాడు.

"అయితే, వీటికి విలువలేదా?" అని ప్రశ్నించింది. ఆయన మందహాసాలొలికిస్తూ "విలువ తప్పకుండా వుంటుంది కాని స్వల్పము." అన్నాడు. ఆమె తిరిగి మాటాడకుండా ఆ పలుకులను యేరుకుంటున్నది. ఆనంద్ అకారణంగా కిలకిలా నవ్వాడు. ఆమె చిన్నబుచ్చుకున్నముఖముతో అలకను ప్రదర్శిస్తూ తన చేతిలోనివాటిని బలంకొద్దీ నీటిలో పారవైచింది.

ఆదుర్దాతో "అదేమిటి ప్రభా! అలా పారబోస్తావెందుకు?" అన్నాడు. "వాటికి విలువుంటుందని చెప్పి నేను యేరుతుంటే, నీవు పరిహాసంచేయుటెందుకు?" అన్నది. "నేనునవ్వింది వాటికి విలువలేదని కాదు, నీవు వెర్రిదానివని గాదు. స్త్రీలో యింత కాంక్ష యెందుకున్నదా అని, అంతే," అంటూ తిరిగి ఆయనకూడా ఆ పలుకులను ఆమెకు యేరిపెట్టాడు.

యేరిన వైఢూర్యాలను ఆమె కొంగునకట్టుకుని పూలమొక్కలమీదపడి పాన్పుమీద దొర్లినట్లు దొర్లుతూ,

సప్తరంగులలో వికసించి ప్రకాశిస్తూ సుగంధాన్ని వెదజల్లు తున్నపుష్పగుచ్ఛాలను త్రుంచి, తనముఖమండలానికి అదుముకుంటూ వాటిని అస్తవ్యస్తంగా నలిపి పారవేస్తూ తిరిగి కోస్తున్నది. ప్రక్కగా తిన్నెపై కూర్చుని, సాక్షీభూతుని వలె తిలకిస్తున్న ఆనంద్ "అబ్బ! అదేమిటి ప్రభా, ప్రకృతి ప్రఫుల్లితమై ఆత్మానందముతో చిత్రవిచిత్రరూపంలో తన పరిపూర్ణత్వాన్ని చాటుకొనుటలోని మర్మమే యీ కనులకు కనిపించు సౌందర్యము. ఆ పుష్పాల నలా త్రుంచి ప్రకృతి కన్యాయముసలుపరాదు. నేత్రానందముతోనే ఆత్మ తృప్తిని ఆనందాన్ని పొందాలి" అన్నాడు.

ఆమె కొంటెనవ్వును ప్రదర్శిస్తూ "ఇలాంటి ప్రకృతి సౌందర్యవిలసితమైన పూలవనములో చూస్తుంటే నేత్రానందము కలుగుతుంది. కాని, స్వభావములోని కాంక్ష యింకా ప్రేరితమై వివశతను కల్పించి కోయిస్తుంది, ఆఘ్రాణింప జేస్తుంది, ఆతరువాత తన్మి తానంచేసే నరాలతో నలిపి వేయిస్తుంది. అప్పటికీ ఆత్మలోని ఆరాటము చల్లారదు. మానవునిలోని ఆ ప్రవృత్తికూడా ప్రకృతిలోని ఒక అంశమే గదా! అందువలన అందులో ఏమయినా నేరమో దోషమో వుంటే, అదికూడా ప్రకృతిలోని ఒక అంశమే ఆనంద్!" అన్నది. ఆయన చిన్ని మందస్మితరేఖను ప్రదర్శిస్తూ "మానవులు తమదోషాలను దేవునికో ప్రకృతికో అంటగట్టే నైపుణ్యంలో అలవడ్డారు. బుద్ధికుశలతద్వారా యదార్థ సత్యం మొగిరిపోజాలదు." అన్నాడు.

"ఇందులో నైపుణ్యమూ లేదు, బుద్ధికుశలతా లేదు

ఆనంద్. ముగ్ధతను కలిపించే పుష్పాన్ని గాంచినపుడు దాన్ని తుంచి ఆఘ్రాణించి నలిపివేస్తేగాని, వుపశమనం గలుగదు. ఆ తత్వంకూడా ప్రకృతిలోనిఅంశమే గనుక, అక్కడ దోషము నేరము అనే సమస్యేలేదు.” అన్నది.

ఆయన కొంచెము విసగడతో “ఒకరిఆనందము కొరకు మరొకరిని అంతముచేయుట దోషమూ కాదా చెప్పు!” అని సగర్వంగా అన్నాడు. “అది యీ సమస్యకు సూటియైన వుపమానం కాజాలదు. ముద్దులొలికినపుడు పసిపాప బుగ్గ గిల్లుట దోష మెలాఅవుతుంది చెప్పు? పుష్పాన్ని తుంచుట నలుపుట దోషమని, నేత్రానందాన్ని పొందుట వరకే సమంజసమనుట కాషాయవస్త్రధారణచేసి ప్రకృతి సిద్ధస్వభావాలను నిరసిస్తూ ఆజన్మాంతం బ్రహ్మచర్యంతో వుండాలనుటలాంటిది ఆనంద్.” అంటూ ఆయనదృష్టిలో దృష్టిబరపి మరింత తీక్షణంచేస్తూ, లాలింపుగా “కోపమొస్తున్నదా! నిన్ను కించపరచాలనిగాదు ఆనంద్! నీ హృదయము మహా కోమలమైనది, విశిష్టమైనది. అయినా, నీయెడలగల భక్తిప్రపత్తులలోని సన్నిహితత్వమువలన నిస్సంకోచంగా చెప్పగలుగుతున్నాను. గృహస్థజీవితంలో వుంటూకూడా బుద్ధభగవానుని ప్రవచనాలను ప్రచారముచేయవచ్చుగదా, నీవు యీ కాషాయవస్త్రాలు తీసివేసి, మామూలువస్త్రాలలో వుంటే యెలావుంటుందో చూడాలనివుంది ఆనంద్!” అన్నది.

మిత్రానంద్ ముఖము వెలవెలబోతున్నది. జీవితములో యెన్నడూ పొందని అవమానముపొందినవానివలె,

గొప్ప అపరాధముచేసినవానివలె కుంచించుకుపోతున్నాడు. ఆయనశరీరములోని రక్తము యిరిగిపోతున్నట్లున్నది.

ప్రభ ఖిన్నురాలై తన తప్పిదానికి భీతిలుతూ అనునయంగా ప్రక్కకు జేరి, ఆయనహస్తాలను తనచేతులలోకి దీసుకుని సవరిస్తూ, బరువైనకంఠంతో "కోపమువచ్చిందా? క్షమించు మిత్రానంద్! నీవు యింత బాధచెందుతావనుకోలేదు. పోనీ నా అపరాధానికి నన్ను శిక్షించు; నీ యిచ్ఛవచ్చినట్లు నన్ను కొట్టు; నీకోపముపోయేంతగా కొట్టు" అంటూ ఆయనచేతితో తన సుకుమారకపోలాలమీద కొట్టుకుంటున్నది. అప్పటికి ఆయనముఖములోని కవళికలు సూర్యకిరణముసోకిన మంచువలె మాయుతున్నది. ప్రభమనస్సు రవంత స్థిమితపడింది. ఆమె తనశిరస్సును ఆయనపాదపద్మాలమీద మోపి, రుద్ధకంఠముతో "నన్ను క్షమించు ఆనంద్" అన్నది. ఆయనమౌనము భగ్నముకాలేదు. తనహస్తాలతో ఆమె శిరస్సును బట్టి నెమ్మదిగా పైకియెత్తి ముఖాన్ని పరీక్షగా చూశాడు. అశ్రుముద్రితమైన ఆ ముఖమండలములో అనిర్వచనీయమైన ఆవేదన ప్రస్ఫుటమవుచున్నది. ఆకస్మికముగా ఆమెనేత్రాలనుంచి బాష్పబిందువులు ముత్యాలదొంతరులవలె కపోలాలమీదుగా దొర్లుతున్నవి. ఆయన మనస్సు ద్రవించింది గాబోలు, తనవేళ్ళతో తుడుస్తూ సానుభూతితో విస్ఫారితమైన కంఠముతో "జలమువలె స్త్రీహృదయము చంచలత్వముతో తొణికిసలాడుతుంటుంది. కఠినత్వము, మృదుత్వము పెనవేసి బాణసంచావలె తిరుగు

తుంటవి. చేయరానిది చేసి, పాదాలుపట్టి కన్నీరుకార్చుట స్త్రీకి సహజము, అవునా?" అంటూ దరహాసరూపంలో వాత్సల్యప్రేరితుడై తనఅంగుళీయములతో ఆమెచుబుకాన్ని పుణికాడు.

ఆమెహృదయానికి పూరటకలిగింది గాబోలు, నెమ్మదిగా లేచి అశ్రుముద్రితముఖాన్ని తుడుచుకుని క్రీడాకౌతుకచాంచల్యముతో మందస్మితరేఖలమెరుపులతో హస్తద్వయాన్ని జోడించి "మీరు యేమన్నా నేను వప్పుకుంటాను. మీ గంభీరత నన్ను క్షణములో విమూఢురాలను చేసింది. మీరు అకుంఠితమైన కఠోరదీక్షాపరులు; గడ్డకట్టిన మంచులోని నిశ్చలతవలె మీ హృదయము అభేద్యమయినది. మీరు ఒకప్రక్క నిర్మలప్రకాశముతోను మరోప్రక్క చిరఅంధకారముతోను ద్యోతకమవుచున్నారు. మీయెడల నాకున్న అసామాన్యభక్తి చెరగనిది. కనుక, యిక యెన్నటికీ మీ మనస్సు కింత బాధను కలిగించనని అభయమిస్తున్నాను—" అంటూ దీర్ఘోపన్యాసముచేస్తున్నది.

ఆనంద్ మధ్యలోనే కల్పించుకుని "చాలుచాలు! తిరిగి యీ అనవసర అభయాలెందుకు చెప్పు? మనస్సును అనవసరమైన ఆలోచనలవైపుకు అకరణీయమైన కార్యాలవైపుకు తిప్పి, అలసటచెందించుట, తరువాత పరితాపాలలో మునిగిపోవుట వివేకముగాదు. అప్రస్తుతఆలోచనలు నీటిమీదగీసే గీతలలాంటివి. పశ్చాత్తాపముతో హద్దులను అధిగమించినపుడు ప్రక్కవారికికూడా దౌర్బల్యము ఆవేశిస్తుంది" అంటూ లేచి ఆమెవీపుమీద చేయివేసి సిము

రుతూ, రెండుహస్తాలతోను ఆమె రెండుభుజస్కంధాలను బట్టి, బలంకొద్దీ వూపుతూ "ఒక్కమాటు నవ్వు ప్రభా!" అన్నాడు. ఆమె యింకా గంభీరముద్రను ఆశ్రయించింది. మిశ్రానంద్ ఆమెచుబుకాన్ని పుణుకుతూ అనునయంగా "నేను వినమ్రతతో కోరుతున్నాను, ఒక్కమాటు నవ్వి ఆనందాన్ని కలిగించు ప్రభా!" అన్నాడు. ఆమె సిగ్గుదొంతరులమధ్యగా చిరునగవును చిలికించింది. మధుభరితమైన చంద్రప్రకాశసమానమైన, వుజ్వలము స్నిగ్ధము అయిన ప్రకాశము ఆమెముఖమండలములో నృత్యముసలిపింది. చిందులాడుతున్న ఆ చిరునగవు ఆయనహృదయాంతరాళంలో తరంగితమై సర్తించి పరవశునిచేసింది.

అప్పటికి యిరువురిహృదయాలూ తేలికపడినవి. ఆమె పొందిన ఆనందంతో ఆ పూలమొక్కలమీద పడి, తన్మయత్వంతో దొర్లిగింతలుపెట్టింది. తిరిగి ఆమెచేయి ఆ పూలగుచ్ఛాలను కోయబోయింది. మనస్సులో నో ప్రవృత్తి వెంటనే నివారించింది. హృదయములో పొంగుతున్న ఆనందాన్ని ఆపజాలక యింకా యింకా దొర్లుకుంటూ నీటివైపుకు పోయింది. పరివ్యాప్తమైన ఆ హరిత, వివిధపుష్పకాంతుల మధ్య ఆమె దొర్లుతుంటే, పౌర్ణమినాటి శశిధరుడు నిర్మలమయిన గగనమండలములో పయనిస్తున్నట్లున్నది. ఆ పుష్పాలునక్షత్రాలవలెను,ఆమె శశిధరునివలెను సుస్పష్టంగా ద్యోతకమవుచున్నది. ఆయన అక్కడే నిలిచి ప్రేక్షకునివలె ఆనందోజ్వలదృష్టితో చూస్తూ పులకితుడవుతున్నాడు.

ఆమె ఆ పుష్పాలను కోసి, ఆఘ్రాణించాలని, నలిపి

వేస్తే బావుండునని, శిరస్సుక్రింద తలగడగా పేరిస్తే బావుండునని, శయ్యగా పేర్చితే బావుండునని కాంక్షిస్తున్నది. కాని ఆనందనిభయము అడ్డగిస్తున్నది. అందుకని పుష్పగుచ్ఛాన్ని త్రుంచకుండానే పట్టి అటూయిటూ వూపుతూ, చిన్ని కూనరాగముతో పాట ప్రారంభించింది.

ఆనందాలంకో హాయిని కూర్చునదే ప్రకృతీ
అనభిజ్ఞుని జేయుచు ఆడించుచు
తరతరాలుగా యుగయుగాలుగా
జగమును డగమగలాడించుచు ॥ఆనందాల॥

మానవవికృతాలకు ప్రహసితమై
తామమాయలతో తలక్రిందులు జేసి
నిస్పృహాలో స్పృహనుపోసి ॥ఆనందాల॥

తపోనెపంతో నీమనిష్టలనీడలో
లోకాతీతులమన్న వారిని
మోహజాలంలో ముంచివైచి ॥ఆనందాల॥

రాగము తానము లయతో మేళవించి, ప్రత్యక్ష సరస్వతీదేవి వీణామృతమువలె ప్రకృతిని మత్తులోముంచి వూపుతున్నది ఆమెపాట. ఆ పాటలోని శబ్దభావాన్ని గ్రహించగలస్థితిలో లేడు మిశ్రానంద్. రాగములో రాళ్ళను కరిగించి ప్రవహింపజేయగల యింత విశిష్టశక్తి గలదని ఆయన కిదివరకు తెలియదు. క్షణపాటు ఆయనఆలోచనలన్నీ అంతరించి, ఆశయాలు లక్ష్యాలు ఆదర్శాలు మరుగున పడి తనను తాను మరిచి, ఆనందపరవశుడై రాగలయలోలి

కలో వూగిపోతున్నాడు. ఈ జగత్తులోని రాగద్వేషాలను కృత్రిమాలను కాంక్షలను శాశ్వతమైన ఆ రాగము కడిగి వేస్తున్నట్లున్నది. అమృతకలశము వలికి ఆ రాగరూపములో ప్రవహిస్తున్నట్లున్నది.

ఆమె పాట ఆపివేసింది. మిశ్రానంద్ నిద్రనుంచి మేలో్కన్నవానివలె, ఒక సుఖప్రదస్వప్నావస్థనుంచి బయట పడినవానివలె నేత్రాలునులుముకుంటూ తనలో తానే వెలవెల బోతున్నాడు. ఆయన మామూలుస్థితికి వచ్చుటకు కొంత వ్యవధిపట్టింది. దీర్ఘశీతలశ్వాస విడుస్తూ "అబ్బ! సంగీత ములో యింత మత్తును కల్పించి పరవశునిచేసే మాంత్రిక శక్తి వుంటుందనుకోలేదు." అన్నాడు.

ఆమె లేచి గడ్డిపరకను కొరుకుతూ దగ్గరగా వచ్చి "సన్యాసులకు హృదయాలుంటేగా కరగటానికి?" అని చలోక్తిగా అన్నది. సిగ్గురేఖలమధ్యగా "ఇలాంటిపాటలు పాషాణాలనే కరిగించగలవు. నీ కంఠములోని అనిర్వచనీయ మైన కమనీయత రాగము తానములోని లయ అత్యద్భు తంగా మేళవించి అద్వితీయమై పరిపూర్ణత్వాన్ని పొందు తున్నవి. నీ కంఠములోని మాధుర్యము అమోఘమైంది ప్రభా!" అంటూ ఆమెసమీపంగా వెళ్ళి, ఆమెహస్తాన్ని తనచేతిలోకి తీసుకుని, మృదువుగా వత్తుతూ తన రెండవ హస్తాన్ని ఆమెశిరస్సుమీద వుంచి "ప్రభా, సంగీతము గొప్ప శక్తివంతమైన అస్త్రము. ఆ అస్త్రాన్ని సౌందర్య సుఖోపాసనలకుగాకుండా, సమాజములోని యీర్ష్యాద్వేషా లను పునీతంచేయుటకు, మానవులను శాంతిసందేశాలవైపు

మరల్చుటకు వినియోగిస్తే గొప్ప ప్రభావాన్నిస్తుంది. కనుక, నీవు యీ విద్యలో పూర్ణత్వాన్ని పొంది చిరంజీవివై మార్గగామినివై సఫలతబొందాలని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.” అన్నాడు.

కళవళంతో ఖంగారుపడుతూ తరళము ఆరిపోయిన కంఠముతో “సులోగస్, నన్ను క్షమించు, అలా ఆశీర్వదించకు. నన్నుకూడా నీ మాదిరి బ్రహ్మచారిణిగా వుండేట్లు దీవించకండి. బుద్ధభగవానునియెడల నాకు అపారమైన భక్తి విశ్వాసాలున్నవి. ఆయనప్రవచనాలను శిరోధార్యములుగా భావిస్తాను. శాంతి, త్యాగము సేవ అనే అస్త్రావలంబనము ద్వారానే మానవకళ్యాణము ప్రాప్తిస్తుందన్న వారి సూత్రాలు మానవసమాజమున్నంతవరకు సంశయములేని రక్షకకవచాలు. కాని, నేను సుఖసౌఖ్యాలను విసర్జించకుండానే, భిక్షువురూపము దాల్చకుండానే, గృహస్తజీవితములో వుంటూ, బుద్ధునిసేవ (మానవసేవ) జేయాలనుకుంటున్నాను. ప్రజలనుంచి వేరైపోయి చేసే ప్రబోధాలకంటె ప్రజలతో కలిసివుండి చేసే ప్రబోధాలకు వాస్తవికబలము దొరుకుతుంది.” అంటూ వుదాసీనదృక్కులతో ఆయన వైపు తదేకంగా చూస్తున్నది.

“మంచిది, నీ వాంఛితమార్గంలోనే సుఖివై సఫలం బొందాలని ఆశీర్వదిస్తున్నాను. ఇపుడు సంతోషమేనా ప్రభా!” అని మృదువుగా ప్రశ్నిస్తూ చుబుకాన్నిబట్టి వూపాడు. ఆమెనేత్రాలు రెండుకో జలభరితమై తొణికిసలాడుచున్నవి. జేవురించిన ఆ ముఖమండలము అనురాగముతో

ఆర్ద్రమై, సానుభూతితో విస్ఫారితమై, వాత్సల్యముతో వుద్వేలమై అద్వితీయ రూపములో అనిర్వచనీయమైన శోభతో, వుజ్వలము స్నిగ్ధము అయిన ప్రకాశముతో ముగ్ధత నుత్పన్నముచేయుచున్నది. ఆ ముఖప్రకాశముద్వారా ఆయనకు ఆత్మగ్లాని వుత్పన్నమవుచున్నట్లున్నది. ఆమె నేత్రాలగుండా జారుతున్న అశ్రుబిందువును తన అంగుళీయముతో అద్దుతూ "నీవు పలికింది పరమసత్యము ప్రభూ! అపురూపమైన నీలో ముల్లోకాలను చలింపజేయగల మాంత్రికశక్తిగలదు. నీ శరీరములోని ప్రతిఅణువు సుఖము కొరకే సృష్టింపబడినట్లు కాంక్షలతో వాంఛిస్తున్నది. ఆ మార్గమే నీకు యోగ్యమైంది. అందే నీవు పూర్ణరూపములో ప్రభవిస్తూ సంఘసేవచేయాలని మరోమాటు దీవిస్తున్నాను." అన్నాడు. ఆమె వెంటనే ఆయన పాదపద్మాలమీద వాలిపోయింది.

వర్షాలు తగ్గినవి. తిరిగి దత్తమిత్రునిపయనము సాగుతున్నది. చోరభయంతో వ్యాపారస్తులు భీతిలుతున్నారు. దానకల్లుముతాఒకటె విరివిగా దోపిడీలుసాగిస్తున్నందున యెక్కడిప్రయాణా లక్కడ అంతటితోనే ఆగిపోయినవి. కాని, మిత్రానంద్ ముందుకుపోవుటకే నిశ్చయంచేశాడు. గజదొంగలెవరూ బౌద్ధభిక్షువులజోలికిరారని, భక్తితో పూజిస్తారని కట్టుకథల నెన్నిటినో వినివున్న ధైర్యము ఆయన్ను ముందునడిపింది. దత్తమిత్రుడుగాని, ప్రభగాని ఆయనవిశ్వాసాన్ని శంకించగలస్థితిలోలేదు.

# దొంగల పశ్చాత్తాపం

కృష్ణపక్షపురోజులవి. 5 గంటలకే పయనాన్ని ముగించుకుని ఒక చిన్నగ్రామములో భోజనసదుపాయాలు చూస్తున్నాడు మిశ్రానంద్. ప్రయాణబడలికతో దత్త మిత్రుడు కంబళిమీద వోరగిలాడు. ప్రభ మిశ్రానందకు సహాయపడుతున్నది. అది చిన్ని కొండగ్రామము. పదిమట్టి మిద్దెలుమాత్రమె వున్నవి. అంధకారము ఆవరించింది. ఆకస్మికంగా ఒక్కమాటుగా పదిమంది ఆజానుబాహులు ముట్టడించి, నోరుమెదవనివ్వకుండా ఖైదీలనువలె ప్రక్క అరణ్యమువైపు తీసుకెళ్ళి, ఒకకొండమలుపులోని గుహలో నిర్బంధించి, హుటాహుటి మరెక్కడికో వెళ్ళిపోయారు. దత్తమిత్రుడు మాటాడగలస్థితిలో లేడు. భయవిహ్వాలతలో రక్తపోటు ప్రారంభమై, మనఃకంపనలతో బాధపడుతూ దీర్ఘ వేడినిట్టూర్పులు విడుస్తున్నాడు. ప్రభ తన చిన్నారిజీవితములో యిలాంటి భయానకదృశ్యాన్నిగాని, సంఘటననుగాని చూచియెరుగదు. ఆ గజదొంగలు హుంకరించినపుడే ఆమెహృదయము ఆగిపోవలసింది. కాని మతిబోయి నిర్జీవివలె వారివెంట వచ్చింది. భరింపరాని భయానకమైన దుస్సంఘటన జరిగినపుడు మొదటిక్షణములోనే మతిచలించుట గద్దు. ఆతరువాత జరిగేవి ఆ చలించినమనస్సుమీాద యేమిా చేయజాలవు. ప్రభవిషయంలోకూడా అంతే జరిగింది. ఆమె అచేతనావస్థలో వుండిపోయింది. వారు లాక్కొస్తున్నపుడు ఒకచోట కూలబడిపోయింది. ఆమె

అవస్థను ఆలకించువారు లేరు. వారు దూకుడుతోనే లాక్కుపోతున్నారు. కాళ్ళమీద అనేకచోట్ల తోక్కుపోయి రక్తస్రావముతో చీరె తడిసిపోయింది. శరీరమంతా గాయాల మూటవలె తయారయింది. నిషాలోనివానివలె వున్నది ఆమెస్థితి. మిత్రానంద్ హద్దులనధిగమించిన హృదయ భారంతో సిగ్గుబిడియాలతో వణికిపోతున్నాడు. అనభిజ్ఞతతో తను చేసినసాహసానికి నొచ్చుకుంటున్నాడు. పారిపోవటానికి ఆలోచనలు కలుగుతున్నవి. కాని, ప్రభ, దత్తమిత్రులు కదలలేనిస్థితిలో నున్నారు. అలాంటి నిస్సహాయస్థితిలో పారిపోవుట అసంభవము. వారు స్మృతిహీనులుగ్గాను, తాను భయభీతులతోను ఆ రాత్రి అలానే గడిపివేశారు.

గజదొంగలముఠా ద్వితీయకార్యక్రమములో విఫలముబొంది, తప్పించుకున్న పటాలములోని సిపాయిలవలె యావన్మంది దత్తమిత్ర, మిత్రానందులయెదుట కొచ్చారు. మిత్రానందుని జూచినపుడు వారిమొఖాలు వెలవెలబోయినవి. అంధకారములో అనభిజ్ఞతతో అపరాధముచేసినందుకు చిన్నబోతూ, ఒక్కమాటుగా దోపిడిదొరలంతా మిత్రానందయెదుట పృధ్విమీద శిరస్సులనుమోపి, "మమ్ము క్షమించండి భిక్షుకమహాశయా! మిమ్ము గుర్తించక మేము పొరపాటుచేశాము. బౌద్ధమతస్థులు త్యాగనిధులని, ఆత్మోన్నతిపొందినవారని, యితరులసేవాభారంతో ఆత్మానందాన్ని పొందుతారని, నిస్వార్థనిధులని, లోకమంతా సమానభాయాలో ఆనందాన్ననుభవించాలంటారని ఆ సిపాస్తుల లోను కాంతులలోను యితరులకు దుఃఖాన్నిగలిగించరని

మా పెద్దలు అంటుంటారు. అంతేగాదు, బుద్ధభగవానుని శిష్యులనెవరినీ హింసించరాదని మా పెద్దలఆజ్ఞ" అని బరువైనకంఠములతో పశ్చాత్తప్తహృదయాలతో అన్నారు.

అకస్మాత్తుగా అగాధసాగరములో మునిగినవానికి పాతాళలోకప్రభువు ఆతిథ్యము లభ్యమయినట్లు మిత్రానంద్ ముఖం విప్పారింది. రక్తనాళాలలో యిగిరిపోయినబలము తిరిగి పూరుకొంటున్నట్లున్నది. దొంగలముఠా తమనుంచి అపహరించిన సామాను గుర్రాలు వగైరాలను తిరిగి సమర్పించుటేగాక, తమకానుకలుగా అమూల్యవస్తువులనేక మొసంగారు. తినుబండారాలనుకూడా సమర్పించారు. కాని ప్రభ, దత్తమిత్రులు దీర్ఘరోగులవలె శక్తిహీనులుగా వుండిపోయారు. దొంగలముఠా ఆతిధ్యములోనే వుండి, మిత్రానంద్ వారికి చికిత్సాసేవలు జేస్తున్నాడు.

నాలుగురోజులలో దత్తమిత్రుడు కొంత తేరుకుని; మామూలుస్థితిలో మాట్లాడగలుగుతున్నాడు గాని, నడువగలస్థితిలో లేడు. ప్రభ యింకా కోలుకోలేదు. దిమ్మరపోయిన మనస్సు స్థిమితపడలేదు. ఆమెకాళ్ళగాయాలు మానుపట్టలేదు. అర్థరహితమైన చూపులతో మెరమెర చూస్తుంది. అనాలోచితమైన ధోరణిలో ప్రలాపిస్తుంటుంది. పసిబాలికనువలె ఆమెను పండబెట్టి, మృదువైన అనునయాలతో ఆమెప్రలాపాలను ఆపించి, కాళ్ళగాయాలకు ఆకుపసరులతో బ్యాండేజీలుకట్టి, కుడిపాదంగిలకవద్దనున్న వాపుమీాద తైలముతో మృదువుగా మర్దనచేస్తుంటాడు. ఆయన మర్దనచేస్తుంటే, ఆమె బాధనుభరించలేక "అబ్బ! ఆనంద్,

నీ పాదాలుపట్టుకుంటాను, యిక విడిచిపెట్టు!" అంటూ పిచ్చి కేకలుపెడుతుంటుంది. ఆయన బుజ్జగిస్తూ, యింకాయింకా అదిమి తోముతూనే వుంటాడు. ఆమెకు మరింత బాధకలిగి, భరించలేక యెన్నోమారులు తనకాలు గుంజుట, జాడించుట జరుగుచుండేది. ఆరూపములో ఆమెతన్నులను అనేక మారులు పొందాడు. ఆయనహృదయముమీద భుజస్కంధాలమీద, చేతులమీద ఆమెపాదపద్మాలముద్రలు పడుతూనేవుండేవి. బలమైన తన్ను ఆయనముఖమండలము మీద పడినపుడు, దూరంగా పోయి చట్టుమీదపడి ఆయన శిరస్సు 'టప్'మని చిట్లినపుడు ప్రవహించిన రక్తస్రవంతితో దుస్తులన్నీ రక్తరంజితమైపోయినవి. ఆ దృశ్యము ప్రభ హృదయములో గుచ్చుకున్నది. విచలితురాలై విహ్వాలతతో ఖంగారుచెందింది. ఆ ఖంగారులో అజ్ఞాతశక్తి ఆమెను ఆవేశించింది. చివ్వున లేచి తప్పటడుగులతో ఆయనచెంత చేరి, తచ్చట్లాడుతూ ఆయనశిరస్సుమీద చేతులువేసి స్పృశిస్తూ సానుభూతితో విషాదమిళితమైన వెర్రిచూపులతో పరికిస్తున్నది. ఆమెహస్తాలు రక్తపుజిడ్డుతో పులుముకుని పులిసిన యేదువాసనలను విరజిమ్ముతున్నవి. జలజలలాడుతున్న నేత్రాలతో, అదురుతున్న అధరాలతో రుద్ధకంఠంతో "ఆనంద్, నే నెంత హీనురాలను!" అంటూ కుడిహస్తముతో అశ్రుపులను అద్దుకోబోయింది. కాని చేతినున్న రక్తం ఆమెముఖానికి గాఢంగా ముద్రితమైంది. ఆ రక్తము నేత్రఫలకాలద్వారా కనులకంటింది గాబోలు, మంటలకు బిత్తరిలి హస్తద్వయముతో ముఖాన్ని మద్దుకున్నది. కిశోరావస్థ

లోని శిశువువలె ఆమె అజ్ఞాతరూపములో వరుసగా అనభిజ్ఞ కార్యాలు సలిపి, దుష్ఫలితాలతో దుఃఖిస్తూ ఆనంద్ శిరస్సును బాహువులమధ్యకు దీసి హృదయానికి హత్తుకుంటూ వాపోతున్నది. అప్పటికి తేరుకుని ఆనంద్ దీర్ఘశ్వాసను విడుస్తూ నేత్రాలు తెరచి చూశాడు. తను ప్రభవడిలో వున్నట్లు తెలిసి యెందుకో అధరాలు ఆడిస్తున్నాడు. రక్తరంజితమైన ప్రభాతభాస్కరునివలె ప్రభముఖమండలము రక్తముతో పులుముకుని విషాదచ్ఛాయ లలముకొని యున్నది. ఆమెలోని విషాదచ్ఛాయలుకూడా సుకోమల కుసుమములాంటి ముఖానికి అద్వితీయలావణ్యాన్ని గల్పిస్తున్నవి. నేత్రాలునులుముకుని విస్తృతరూపములో పరికించినపుడు శరీరంయావత్తూ యౌవనజ్వాలలతో పొంగి అర్థంగాని తృష్ణయేదో ఆమెముఖముద్వారా ప్రకటితమవుతున్నట్లు అనుభూతమయింది మిశ్రానంద్ కు.

కరుణాభరితకంఠముతో "ముఖమంతటా రక్తము పులుముకున్నావెందుకు ప్రభా?" అన్నాడు. ఆమె ప్రతిగా, ఆదరాన్ని ప్రకటించురూపంలో ఆయనముఖాన్ని తన చీరె చెంగుతో తుడుస్తున్నది. ఆయన వెంటనే ఆమెచేతిలోని చెంగును అందుకుని ఆమెముఖాన్ని తుడుస్తున్నాడు. మాతృసేవలనందుకుంటున్న శిశువువలె, ఆమె తనముఖాన్ని ఆయన కప్పగించి వూరుకున్నది.

చిన్నారిచిరునగవుతో "నీవు యిక్కడి కెలా వచ్చావు ప్రభా?" అన్నాడు. ఆమె ముకుళించుకుపోతున్నవదనముతో "నేను మహాదుష్టురాలను ఆనంద్! సిగ్గుదొంతరులమధ్య

కుమిలిపోతున్నాను. నిన్ను పాదముతో తన్నినదోషము యెన్నిసత్కార్యాలుసలిపినా పోదు. ఇక నన్ను ప్రశ్నించి బాధించకు" అన్నది.

ఆనంద్:- తెలియకచేసిన అపరాధానికి దోషముండదు.

ప్రభ:- తెలిసిచేసినా తెలియకచేసినా అపరాధఫలిత మొకటేఅయినపుడు దోష మెందుకుండదు?

ఆనంద్:- ఫలితము దోషము ప్రధానాలుగాదు ప్రభా, తద్‌హేతువులు విచారించదగినవిగదా!

ప్రభ:- అపరాధిని అనుతాపము వెంటాడి బాధించునపుడు క్షమలేనిదే నిష్కృతి లభించదు ఆనంద్!

ఆనంద్:-అనుతాపమే పరమోత్కృష్టమైన నిష్కృతి ప్రభా; కొన్నివేళలందు నికృష్టకార్యాలద్వారాగూడా వుత్కృష్టఫలితా లుద్భవించుట గద్దు. ఇంతకుముందు నీవు మతిభ్రమణములో వున్నావు, నేను యెంత వేదనపొందానో చెప్పలేను. ఇంతత్వరలో నీవు సుధిపొందుతావనుకోలేదు. మనము అదృష్టవంతులము ప్రభా, యిక నాకు చింతలేదు.

ప్రభ:- ఒక నికృష్టకార్యముద్వారా పొందే ఫలితము యెంతవుత్కృష్టమయినదయినా, కడు హేయమయింది. నీ రక్తబలిద్వారా నాకుకలిగే మేలుకంటె, నా నిర్యాణమే వాంఛనీయమైనది ఆనంద్. (అంటూ కనుఫలకాలలో క్రమ్ముతున్న కన్నీటిబిందువులను చెంగుతో అద్దుకుని, ఆ చెంగుతోనే తనవడిలోవున్న ఆయనశిరస్సును తుడుస్తూ,

సుద్ధతతో) నిన్ను తన్నిన నా పాపిష్టిపాదాన్ని నరికివేయి మిత్రశానంద్.

ఆనంద్:- (ఆమెచుబుకాన్ని పుణుకుతూ, అనురాగముతో ఆర్ద్రమైనకంఠంతో) నీ హృదయము వికసిస్తున్న సుకోమలకుసుమములాంటిది. అజ్ఞాతములో జరిగిన అపరాధానికి న్యూనత చెందవలసిన అవసరము లేదు. ఈ లోకములో నీద్వారా ఏదో ఒక ఉత్కృష్టమైనకార్యము జరుగగలదని నా అంతర్వాణి ప్రబోధిస్తున్నది. నీవు మహోన్నతమైన ఖ్యాతి శిఖరాగ్రానికి చేరినపుడు, నీద్వారా యీనాడు నేనుపొందిన నీ పాదముతో నాకు శాశ్వతకీర్తి లభిస్తుందేమో!

ప్రభ:- నన్ను సంతృప్తిపరచను మిమ్మిమీరు న్యూనతపర్చుకొని నన్ను అవహేళనపాలుచేయకు ఆనంద్. నన్ను మయిమపుచ్చను పొగడుతూ, మిమ్ము కించపరుచు కొనుట నేను సహించరానిది.

ఆనంద్:- నీవు అమాయకురాలవు, ఎవరిమనస్సు బాధ వారికే తెలుస్తుంది. కేవలము సానుభూతి ప్రేమతోనే రెండోవారిహృదయాన్ని అర్థముచేసుకోగలుగుతాము. ఎవరిని యెంత సన్నిహితంగా చూస్తుంటామో వారిమనస్సంతగా వ్యక్తమవుతుంటుంది. ఇంతకుముందు నిన్ను గురించి నేను చెందిన ఆదుర్దా వివరింపజాలనిది. ఇంతత్వరలో సరియైన స్పృహకొస్తావనుకోలేదు. వెర్రిచూపులుచూస్తూ చైతన్యహీనవై నన్ను ఖంగారుపెట్టావు. పసిబాలికను కాపాడినట్లు నిన్ను అనుక్షణమూ చూస్తూండవలసివచ్చింది.

పోనీ, జరిగినదేదో జరిగిపోయింది. ఇపుడు నీ కాళ్ళనొప్పి ఎలావున్నదో చూడు.

"ఈ పాపిష్టిపాదాలనుగురించి చింతించవలసిన అవసరములేదు" అని శుష్కకంఠముతో అంటూ, ఆయన శిరస్సునున్న రక్తపుజిడ్డును తుడుస్తున్నది. మిశ్రానంద్ లేచి వూతముతో ఆమెనుకూడా లేపి, దరహాసముతో "అడుగులు వేయగలవా ?" అంటూ, ఆమె భుజస్కంధాలుపట్టి, మధుభరితదృక్కులతో ఆమెను పునీతముచేస్తూ నడిపిస్తున్నాడు. రణరంగమునుంచి వచ్చు విజేతవలె దత్తమిత్రునిశయ్యవద్ద కొచ్చి నిలిచారు. ఆయన నిద్రలో కలలుగాంచుతున్నాడు గాబోలు, ముఖమంతా భీతావహరూపములో సుడులవలె మారిపోతున్నది.

దూరంగా తమసామానులకడ కేగి, ఆనంద్ తిను బండారాలకొరకు వెదుకుతున్నాడు. ఆదుర్దాలోను భయభీతులలోను మానవుని ఆకలి నశిస్తుంది. మనస్సు కుదుట పడినపుడు ఆ ఆకలి ద్విగుణీకృతమవుతుంది.

కాల్చిన శనగలు గిన్నెనిండాపోసి, ఆనంద్ కిచ్చి, ఆయన తింటూవుంటే, ప్రభ ఆయనశిరస్సును తడిగుడ్డతో తుడిచి, గాయానికి దూదిపెట్టి పట్టీకట్టి మెడమీద, వీపుమీద వున్న రక్తపుమరకలను తన కోమలహస్తముతో గీకి, చెంగుతో తుడుస్తున్నది.మృదుస్పర్శలద్వారా తన సర్వాంగములు పులకితమై అర్ధంగాని అనుభూతిలో మైమరచి నేత్రాలు అర్ధనిమీలితముజేసి, శనగలు భుజిస్తూనేవున్నాడు. ఆ దృశ్యమామెకు అనిర్వచనీయమైనఆనందాన్ని కలిగించి, శిలా

ప్రతిమవలె చూస్తూ వుండిపోయింది. ఆమె స్మృతిపథంలో యేమి దొర్లిననో యేమో, ఆయనకు ప్రక్కగా కూర్చుని ఆయనశిరస్సును మృదువుగా తనవొడిలోకి వాల్చ ప్రయత్నిస్తుండగా ఆనంద్ నేత్రాలు తెరచి "ఏమిటి ప్రభా ?" అని ప్రశ్నించాడు. ఆమె ప్రేమలోలుకు చిరునగవుతో "ఏమీ లేదు, మీరు అలసట చెందివున్నారు. కొంచెము సేపు విశ్రాంతితీసుకోండి." అంటూ బలంగా లాగి ఆయనశిరస్సును తనవడిలోకి చేర్చుకుని, ఆయనవీపుమీద భుజస్కంధముమీద చేయి వేసి నిమురుతున్నది. ఆయన గాఢనిద్రలో మునిగిపోయి స్వప్నలోకములోని యే భిక్షారామములోనో సేవలో మునిగిపోయాడు గాబోలు, అధరాలమీద ఆనంద రేఖలు జిలిబిలిగా ప్రదర్శితమవుతున్నవి.

నిష్టనియమాలతోను ఆదర్శ ఆశయ లక్ష్యాలతోను కట్టుబడిన సమాజసేవాకంకణబద్ధుడు, నిస్వార్ధనిధి, త్యాగమూర్తి, శాంతిస్వరూపి అయిన బౌద్ధభిక్షువు తనవడిలో నిర్వికారమంగా నిద్రిస్తున్న దృశ్యం ఆమెప్రవృత్తులలోని వివిధ కోణాలమీద గోటితో మీటినట్లయి విరుద్ధధ్వానులతో ఆ చిన్నారిహృదయములో అంతర్యుద్ధము జరుపుచున్నది.

సుకుమార లావణ్యాలోలుకుతున్న యీ యువకుడు తన సుఖసౌఖ్యాలను త్యజించి, సమాజోద్ధారణదీక్షలో యిరుక్కొనుట యెంత పొరపాటు! అని నో ప్రవృత్తిద్వారా వినిపించింది. సృష్టించుకునే సుఖాలకంటె త్యాగాలలో లభించే ఆనందము చెరగనిదని, మరో ప్రవృత్తి వినిపించింది. ఏది ప్రకృతిసిద్ధధర్మమో, యే సుఖసౌఖ్యాలను అందరూ

సమంగాపంచుకోవాలంటున్నారో వాటిని స్వయంగా కూలదోసుకుని ప్రకృతివిరుద్ధమైన బ్రహ్మచర్యవేషాన్ని స్వీకరించి, కఠినము, దుర్గమము, భయానకము అయిన మార్గావలంబియై ఆత్మనిరసనతో జీవితాన్ని వ్యర్థముచేసుకొనుటయెంత వెర్రితనము! అని వేరొకప్రవృత్తి ప్రలాపించింది. ఆత్మోన్నతిలోని వివేకమనే పేరుతోనో, పేరుప్రతిష్ఠల వ్యామోహముతో, ఆదర్శాలు ఆశయాలు లక్ష్యాలు అనే వెర్రిలోనో కొందరైనా యీరూపములో కార్యరంగములో లేనిదే, సమాజవికాసము కలుగజాలదని యింకొకప్రవృత్తి ప్రతిధ్వనించింది. ఏది కావాలని ప్రచారముచేస్తున్నామో, ఏ సుఖసౌఖ్యాలు అందరూ అనుభవించాలనుకుంటున్నామో వాటిని స్వయంగా అనుభవిస్తూ చేసే ప్రచారాలే రమ్యమైనవిగావుంటవని మరొకప్రవృత్తి వినిపించింది. కనకాంబరకాంతులతో ప్రకాశిస్తున్న ఆయనశరీరశోభ,ముఖములోనిలావణ్యము అర్థంగానిఅనుభూతితో విచిత్రరూపములో ప్రేరేపిస్తున్నవి. ఆమెఉత్కంఠితదృక్కులు సూదులవలె ఆయనశరీరముమీద చొరుచుకుపోతున్నవి. కలలోనికలవరముతో వులికిపాటుచెంది మిశ్రానంద్ చివ్వునలేచి ఖంగారుపడుతున్నాడు.

"ఖంగారుపడుతూ లేచావేమిటి మిశ్రానంద్!" అని ప్రశ్నించింది. ఆయన గుండెలమీద చేయివేసి, నిమురుకుంటూ "ఏమీలేదు, దప్పికగొని కలలో దేశమంతా తిరిగినా పానీయము లభించలేదు." అని నవ్వప్రయత్నించాడు, కాని శుష్కంగా తేలిపోయింది. ఆమె ఆత్రతతో లేచివెళ్ళి

మంచి తీర్థపు చర్మసంచిని తెచ్చియిచ్చింది. ఆయన్ను తదేకం గా చూడను తెలియనిబిడియమేదో అడ్డగిస్తున్నది. కోరగా చూస్తున్నపుడు ఆయనరూపు రేఖలలోను వేషధారణలోను ఉన్నతశిఖరాగ్రముమీద రెపరెపలాడుతూ తన ఆధిక్యతను చాటు పతాకమువలె అందరినీ ఆకర్షించునట్లు, ఆదేశాల నిచ్చునట్లు ధర్మాన్ని స్థిరముచేయునట్లు ఆభాసగా ద్యోతక మవుచున్నది. క్షణంముందు తనహృదయములో బయల్వెడలిన విరుద్ధధ్వనులు అదృశ్యమయినవి.

# స్మృతి విహారం

సాకేతపట్టణమంతా ప్రతిధ్వనించే వుత్సాహాలు, వేడుకలమధ్య విజేతగా ప్రభప్రక్కన గజారోహుడై వూరేగిన అశ్వఘోష్‌కు సవర్ణులలో ఆ విజయమువలన ఆధిక్యతలభించ లేదు. ఒక అబలతో సమానంగా యీాదుట పురుషదర్పానికే తీరని అవమానమని, ఆ అబల సరసను గూర్చుని సహ విజేతగా వూరేగుట ఆత్మాభిమానహీనమని, ఇంత అసమర్ధుడైన విజేత సాకేతచరిత్రలో యిదివరకెన్నడూ లేడని, సాకేత బ్రాహ్మణులు అశ్వఘోష్‌ను అవమానరూపములో చిత్రించుకుంటున్నారు. తనను హీనంగాతలంచుచున్నవిషయాలు తెలిసి అశ్వఘోష్ నిర్జనదాములు వెతకి వెళుతున్నాడు. పండితపేటలో పగలు కనిపించనే భీతిలుతున్నాడు. పదిమంది బ్రాహ్మణయువకులు పోగయివున్నచోట పొరపాటుగా అశ్వఘోష్ తటస్థపడుట జరిగినపుడు ఆ పేట

వారందరికి రెండురోజుల మనోరంజనగ్రాసం సంప్రాప్త మయినట్లు భావిస్తున్నారు. ఆయన దారిలో కనిపించినపుడు యువకులు సరసర ముందుకువెళ్ళి బారలుచాచి మిలిటరీ శాల్యూటుతో ,తలలువంచి వచ్చేనగవును బిగబట్టి యేక కంఠముతో అవహేళనధ్వనితో "స్వాగతము! సుస్వాగతము! అర్థవిజేతా! అభినవనారీసమవిజేతా!" అని పెద్దపెట్టున గల గల హాస్యధ్వనులనుచేయుట అలవాటయిపోయింది. ఈకారణాలతోనే అశ్వఘోష్ బజార్లలో కనిపించుట మానుకున్నాడు.

మిత్రులతోను మిత్రబృందాలతోను కాలయాపన చేసే అలవాటు అసలాయనకు లేదు. ఏకాంతముగా నదివద్దనో, బౌద్ధవిహార్‌లోనో కూర్చుని అంతర్గతఆలోచనలలోను, ప్రకృతిసౌందర్యాన్ని తిలకించుటలోను, దొరికిన గ్రంథాలను పరిశీలించుటలోను లీనమయి, యీ వాస్తవిక జగత్తునే మర్చిపోతుంటాడు. ఇపుడాయన్ను తన సవర్ణులపేటలో అవహేళనచేసేవారుదప్ప పలుకరించువారే లేనందున, గ్రంథపరిశీలనకు, ప్రకృతిపరిశీలనకు యేకాంతవ్యవధి గొప్పగా కుదిరింది. బంధువర్గంలోనివారి నిందలద్వారా తండ్రికూడా క్రుద్ధుడైనందున ఇంటిప్రీతికిబదులు భీతి వుత్పన్నమయింది. భర్త లేనిసమయాలందు సువర్ణాక్షి పుత్రునికొరకు బయటపడి నదివద్దులు, బుద్ధవిహార్‌లోను వెతకుతూ తిరుగుట కద్దు. అశ్వఘోష్‌కు తల్లి సువర్ణాక్షియెడలగల అవ్యాజమైన అనురాగమే ఆయన్ను సాకేతవిడచిపోనివ్వకుండా లాగివుంచగలుగుతున్నది.

సరయూవిజయోత్సవాల అనంతరము అశ్వఘోష్‌కు సవర్ణులద్వారా హేళనరూపములోని పురస్కారము లభించి నట్లే, యితరులద్వారా నిజమైన ఆదరము, అధిక్యతలభించింది. కాని ఆయనమనస్సు యీ అవహేళనలవలన బాధగాని, ఆదరాభిమానములవలన ఉత్సాహముగాని చెందలేదు. ఆయన ఆలోచనలు అజ్ఞాతరూపములో అలవాటుగా ఆ విజయము నాటి దృశ్యములవైపు కే వెళుతుంటవి. తలవనితలంపుగా తనను నంద్‌లాల్ పోటీలోకి లాగుట, అందరికీముందు యీదు తున్న ప్రభకు ప్రక్క-ప్రక్కలగా వెళ్ళి, ఆమెకంటె ముందు వెళ్ళి, తిరిగి సమానాంతరమై, వెనుకబడి, తిరిగి ముందుకు వూగుతూ ఆమెకు చిరాకునుగలిగిస్తూ, ఆమెవిషణ్ణదృక్కు లను చూసి మనోరంజనచేసుతూ, తిరిగి ముందుకుపోగల అవకాశాన్ని కల్పించి, సరసర వెనక్కునెట్టి పరిహాసదృక్కు లతో ఆమెను కవ్వించినపుడు, రవంత ముందుకెళ్ళి తనను నీటిలోభాగమునుంచి ఒక్కతన్నుతన్ని పంతావేశముతో ముందుకుబో నుద్యుక్తురాలయినపుడు ఆమెకాలును నీటి అడుగుభాగాన పట్టి వెనక్కుగుంజి, చిరచిరలాడుతున్న ఆమె ముఖములోని అనిర్వచనీయమైన లావణ్యాన్ని జూచి, ముగుడై అనునయముతో ఆమెహస్తాన్నిబట్టి క్రిందికి అదిమి, ముందుకు గుంజుకుంటూ వెళుతుంటే ఆమె విడుస్తున్న వేడి నిట్టూర్పులు తనశరీరానికి తగిలి జాలిగలిగి, వెంటనే ఆమెను ఒక్కవూపుతో ముందుకునెట్టి, తాను వెనుకవెనుకగా వెళు తున్నపుడు, ఆమె ఆదుర్దాతో అలుపుసలుపులను లెక్క చేయకుండా ముందుకుపోతుంటే, ఆమెసర్వాంగకదలికలలోని

సొంపులో ముగ్ధతనుపొందుతూ, ఆమెపాదాలను తాకుతూ నెట్టుతూ ఆ స్పర్శానుభూతిలోని మత్తుతో పరవశమవుతూ తిరిగి జోరుజేసి, ఆమెకుసమానాంతరమై కొంటెచూపులతో కవ్వించి ముందుకుపోయి నైరాశ్యతలోముంచి, మరోమాటు వెనక్కుతగ్గి, ఆమె చిరాకుతో నీటినిచిందిస్తూ కొరకొర లాడు క్రోధదృక్కులను బరపుతుంటే లాలింపుచూపులతో కటిక్కిన ఆమెకయ్యిబట్టి క్రిందికివంచి బరబర స్టీముబోటు వలె నీటినికోసుకుంటూ ముందుకులాక్కెళ్ళి,ముంచు కొక్కతోపుత్రోసి తాను వెనుక చిన్నగా యీదుతుంటే ఆమె బారయీతతో ముందుకు బరబరపోతుంటే, తాను మునిగి ఆకస్మికంగా ఆమెముందు తేలితే, ఆమెజోరు తగ్గిపోయి విసగటతోను ద్వేషముతోను వుడికిపోతున్న రక్తముతో, మండిపోతున్నహృదయముతో చిరచిరలాడుతూ మందగమనురాలైతే, తాను మరోమాటు సమానాంతరమై ఆమెదృష్టిలో దృష్టిబరపను ప్రయత్నించి విఫలుడై, గాజుబీరువాలో భద్రపరచిన పారిస్ నగ్నస్ఫటికప్రతిమలను మరపించురీతిలో ఆమెసుకోమలకుసుమములాంటి సర్వాంగసుందరశరీరము నీటిలో కదలికలను కల్పిస్తూ, మెరుపులను ప్రతిబింబిస్తూ, మిసమిసలాడే ఆ నునుపులమీద తాకితే యెలావుంటుందో, వత్తితే యింకెలావుంటుందో అనే తృష్ణలో దొర్లుతూ పరవశంలో తననుతాను మైమరచి మదభరితమత్తుతో అధరాలు బిగపడుతూ "ఈ సరయూ విజయములో వడ్డులనున్నవారి కాకిగోలదప్ప మరేమివుంటుంది? నిజమైన అసలువిజయము యీ పుత్తడిప్రతిమలోని మధుసంచిత సునిశిత సురుచిరమైన

హృదయవిజయమే. ఈ విజయముముందు స్వర్గధామవిజయము వెలవెలబోతుంది. దేవేంద్రుని జయించినా, అమృత కలశాన్ని పొందినా నిష్ప్రయోజనా" లనుకుంటూ నీటిలోగుండా సుస్పష్టరీతిలో కనిపిస్తున్న ఆమెఅంగఅంగాన్ని తనివి తీరక వెర్రిగాచూస్తూ, పులకితమైనరక్తనాళాలు తన్ని తానముచేస్తుంటే శివమెక్కినవాడై ఆమెపాదాన్నిపట్టి ముందుకు ఒక్కత్రోపుత్రోసి, ఆమె జలచరమువలె రివ్వున పోతుంటే, వెంటాడుతున్నవానివలె తాను ఆమెవెంటవెంట పోతూ, ఇరువురూ ఒకేమాటుగా వడ్డుకుచేరుట, ఇరువురను విజేతలుగా భావించుట మొదలగు గతించినవిషయాలనే చర్వితచర్వణంగా మనస్సులో దొర్లించుకుంటూ ఆత్మానందాన్ని పొందుతుంటాడు అశ్వఘోష్.

ఆయనకు ఆనాడు యీదుతున్నపుడుగాని, ఉత్సవములో వూరేగుతున్నపుడుగాని ఆ యువతినిగురించి యింత నిర్దిష్టమైన ఆదరము, అభిమానము ఆలోచనలు లేవు. ఆనాడు కేవలము మనోరంజనలతోగూడిన ఆలోచనలే మనస్సులో రేగినవి. నేడు అర్థంగాని అనుభూతులతో స్మృతిపథం కావుర్లుకమ్మి కమనీయమైనకలలను కల్పించుకుంటున్నది. మనస్సులో దొర్లిన విషయాలనే దొర్లించుకొనుటలో అలసట కలుగుటలేదు, అత్యధికమైన ఆనంద ముత్పన్నమవుతున్నది. ఆనాటి వూరేగింపులో ప్రక్కన కూర్చుని తాను కొంటెగా ఆమెను యెన్నో మారులు విసిగించినందుకు నేడు పరితాపాన్ని పొందుతున్నాడు. ఆనాడు తనప్రక్కన మహారాజ్ఞివలె విరాజిల్లిన

ఆమె ప్రఫుల్లితముఖమండలము కనులముందు మెదులు తున్నది. నిర్విచారములోనున్న తనను యీ ఘట్టము అంత ములేని వ్యథాభరితుని జేసివేసింది.

ఈ విజయోత్సవాలఅనంతరము నందా ప్రాముఖ్యము పట్టణమంతటా ప్రబలమయింది. ఆయన యెటువెళ్ళినా పరామర్శించేవారు, ప్రశ్నించేవారు అధికమయ్యారు. తెచ్చిపెట్టుకున్న రాజదర్పాన్ని ప్రదర్శిస్తుండుట నందాకు అలవాటు. తాను శాశ్వతవిజేతనని, మామూలువిజేతలు తడవకొకరు వచ్చి పోతుంటారని, తనముందు యెంతమందో పాల్గొని విరమించుకున్నారని తానొక్కడే శాశ్వతవిజేతగా నిలిచిపోయినట్లు, యీ తభా తనస్నేహితురాలైన ప్రభ, స్నేహితుడైన అశ్వఘోష్‌కూడా తనతోపాటు విజయాన్నిపొందారని అడిగినవారందరికి ఆదినుంచి అంతమువరకు వివరిస్తున్నాడు. అశ్వఘోష్, ప్రభలు తనకు ముఖ్యస్నేహితులని, వారిని తానే బలవంతంగా లాగి పోటీలోకి నెట్టి, వారిరువురిని గెలిపించానని, యిరువురూ స్నేహితులుగనుక యిరువురిని గెలిపించుట భావ్యమని యిరువురికి పంచివేశానని డంబంగా శేవినిప్రదర్శిస్తూ ప్రచారంచేస్తున్నాడు.

పట్టణములోని పసివారందరికి నందాయెడల అపారమైనశ్రద్ధ, ఆనందమూ, వుల్లాసము. వారు ఆయనద్వారా అమూల్యమైన ఆనందాన్ని మనోరంజనను పొందుతుంటారు. వారిదృష్టిలో యదార్థవిజేత నందాయే. వాస్తవానికి పసివారంతా నందావూరేగింపులోనే పాల్గొంటుంటారు. నందా బజారున బయలుదేరితే తటస్థపడిన పసివారంతా పరమా

సందభరితులై పరువులెడుతూ వచ్చి, హస్తద్వయాన్ని జోడించి "నమస్తే విజేతాజీ" అని కొందరు, మరో ప్రక్క వారు "నమస్తే విజేతా మహారాజ్" అని కిలకిలారావం చేస్తూ అంటుంటారు. వారందరూ తన పరిపాలిత ప్రజలైనట్లు పరమోల్లాసితుడై ఒక్కరొక్కరినిగా పరామర్శించుట ఆయన కభ్యాసమైపోయింది.

నందాకు గ్రీకుల నృత్యశాలలోకూడా ప్రముఖస్థాన ముంది. వారంవారము వారు ప్రదర్శించే నాటకప్రచార భారము తనంతటతానే తీసుకుని పట్టణమంతా చాటివస్తుం టాడు. నాట్యశాలలో రిహార్సల్సేగాదు, చీమచిటుక్కు మన్నా నందాద్వారా పట్టణమంతా ప్రచారమయి పూరు కుంటుంది. ప్రతిడ్రామాలోనూ యేదో ఒక పోర్షన్ను నందా నడున్తూకూడా కంఠస్థముచేసుకుంటూనేవుంటాడు. ఆయన వానరదండు - పిల్లలదండు - ఆయనకార్యక్రమా లకు అత్యధిక సహకారముచేస్తుంటుంది.

విజయోత్సవాల అనంతరము అశ్వఘోష్ నందాల మైత్రి ఘనిష్టమైనది. నందా ప్రోత్సాహముతోనే తాను పోటీలో పాల్గొనుట, ప్రభయొక్క ప్రభావసాంపర్క్యాన్ని పొందుట జరిగింది. ఏ ఆకర్షణాదేవత తనహృదయాన్ని చలింపజేసిందో, ఎవరి మధుసంచిత సురుచిరమైన శశిప్రభా సమానమైన, పుజ్వలము స్నిగ్ధముఅయిన ప్రకాశముతో పొందిన రసానుభూతిలో తనహృదయపీఠాన్ని శాశ్వతంగా అర్పించుకున్నాడో, ఎవరిస్మృతులలో వున్మత్తుడై వేదన, నిరాశాదౌర్బల్యంలో వివశుడై తనను తాను కోల్పో

నున్నాడో, ఆ రాజ్ఞీపరిచయము నందాద్వారానే జరిగింది. ఆ కారణంతోనే నందా యెడల శ్రద్ధాభిమానాలుంటున్నవి.

అశ్వఘోష్ హృదయములోనివిషయాలు తెలుసుకున్నవానివలె ప్రశ్నలులేకయే నందా యెప్పటికప్పుడు కీయివ్వబడినఫోనువలె పట్టణములోని విషయాలన్నీ యేకరువు పెడుతుంటాడు. ప్రభ దేశాంతరము వెళ్ళినసంగతి ప్రప్రథమంగా తెలిసినపుడు అశ్వఘోష్ అగాధసాగరంమధ్యమునిగినవానివలె వూపిరిసలుపక వుక్కిరిబిక్కిరియై వ్యథ చెందాడు. భగవంతుడు యీ అమూల్యసంపదతో పరిచయముకల్పించి అందరానిదిగా యెందుకుచేస్తున్నాడా అని వాపోయాడు. నందాతో యెప్పుడూ ఆమెనుగురించే సంభాషించుట అలవాటయిపోయింది. ఇపుడు అశ్వఘోష్ కవనరచన మూలబడిపోయింది. చరిత్రపరిశోధన, శాస్త్రపరిశోధన కుంటుపడింది. పరధ్యాస, నిర్లక్ష్యము ఆవేశించినవి. ఇపు డాయన మనస్సు హృదయము పరాధీనాలయినవి. ఆయనహృదయాధిదేవత అనుక్షణము ఆయన ముందు ప్రత్యక్షమై సరససల్లాపాలాడుతుంటుంది. పట్టుకోబోతే పారిపోతుంది. పరువెత్తితే అదృశ్యమవుతుంటుంది. తిరిగి నిస్పృహలో కూలబడితే, యెట్టయెదుట నిలిచి పరిహసిస్తుంటుంది. ఆయన కృద్ధుడై కూలబడి చేతిమీద శిరస్సునువాల్చుకుని వేడినిట్టూర్పులను విడుస్తూంటే, ఆమె దగ్గరగావచ్చి సానుభూతితో వాత్సల్యోద్వేలమై "నీవు మహాకవివి, కావ్యాలు రచిస్తావు కాని, స్త్రీమూల్యాన్ని అర్థంచేసుకోలేకపోతున్నావు. స్త్రీహృదయాన్ని చూరగొనందే స్త్రీ

ప్రేమలో మునిగి అందున్న విచిత్రప్రవృత్తులను సంయమము చేసుకోందే నీ రచనలలో నవరసములు ఉద్భవించవు. స్త్రీని తుస్కారముచేయవచ్చా చెప్పు ? ఆ వుత్సవము రోజు నన్ను యెంత బాధించావు?" అని కొంటెగా మందహాసము చేస్తుంటుంది. ఉత్సవంలో తానేదో అపరాధముచేసినట్లు, ఆమెను చిలిపిగా బాధించి విసగటకలిగించి కృద్ధురాలను చేసినట్లు, శుష్కించినకంఠముతో ఆమెకు వినతిపూర్వకమైన క్షమాపణ చెప్పుకోవాలని ప్రయత్నిస్తాడు కాని, గొంతుక పెగలదు. వెంటనే ఆమె కిలకిలనవ్వుతూ అనురాగముతో ఆర్ద్రమైన కంఠముతో "బేలపోకు మహాకవీ, నీవుచేసినవన్నీ స్త్రీస్వభావాన్ని ఆకర్షించునవే! లక్ష్యము చేస్తూ నిర్లక్ష్యాన్ని ప్రకటించుట, అంతర్గతతహతహలు, తపనలలో వుడికిపోతూ కూడా నిర్మలత్వాన్ని ప్రదర్శింప ప్రయత్నించుట, కవ్వించి నవ్వించి వుడికించుట; తిరిగి ప్రేమలో మునకలు వేయించి, వూపిరిసలుపని వుక్కిరిబిక్కిరిస్థితిలో విడచుట స్త్రీకి అత్యధికయిష్టమైనవి. స్త్రీహృదయతంత్రులమీద గోటితో మీటి రాగతానమేళనంతో నృత్యముసలిపించగల యోధుడవు." అంటూ ఆమె నెమ్మదిగా, నరాలనుచిక్కబట్టి పింఛాన్నివిప్పి ఝళిపించి వీణాతంత్రులను అంగుళీయములతో అంటుతూ వెళ్ళునట్లు మృదువైన అడుగులతో చేయు మయూరనృత్యమువలె చిన్నగా తన సుకోమలకరాలను చాచి, ఆయనసమీపానికి వచ్చి అత్యంతశాన్యమైన ఆలాపనతో నటిస్తున్నది. మలయమారుతసన్నడి లయను కలుపుతున్నది. పవనకెరటాలు ఆమెశిరోజాలను, చీరచెంగును రెపరెపలాడిస్తూ

దృశ్యానికి పూర్ణత్వాన్నిస్తున్నవి. ఆయనహృది పులకితమై మత్తురంగులో రంగితమై పూగిపోతున్నాడు.

తన్మయత్వతరంగాలలో తేలియాడుతున్న అశ్వ ఘోష్ ప్రక్కగా వచ్చి ఆదుర్దానుప్రకటించు స్వరములో "చూశావా అశ్వఘోష్, పాపము! ప్రభతల్లి నాలుగురోజుల నుంచి అస్వస్థతగావున్నదట. చూదామని నేను వెళ్ళాను. భోరున విలపించింది. తండ్రి కూతు శ్శైనయిపోయారనే చింతతో ఆమె చిక్కి శల్యమైపోయింది. ప్రభ విజయోత్స వాలఅనంతరము తరచుగా మనలను ప్రశంసిస్తుండేదట. "నందా అల్పసంతోషి, మహోపుదారి; మహాకవి అశ్వ ఘోష్ అద్వితీయ శక్తిసంపన్నుడు, స్నేహశీలుడు అమ్మా!' అని తల్లియెదుట పొగడుతుండేదట. ఆమాటలనే నాముందు వల్లిస్తూ భోరున విలపించింది అశ్వమ్" అంటూ ఆయన భుజస్కంధాలమీద చేతులు వేసి కుతూహలంకొద్దీ చెబు తున్నాడు.

తనముందున్న సుఖస్వప్నము చెదరిపోయి విభ్రాంతి మిగిలింది. కళవళపాటుతో ఖంగారు చెందుతూ "ప్రభ తన తల్లిముందు నన్ను ప్రశంసించిందా? ఇది నిజమేనా నందా!" అని ప్రశ్నించాడు. నందా వుత్సాహితుడై "ముమ్మాటికీ నిజము. నేనంటే ప్రభకు ప్రత్యేకాభిమానముంది. నేను కంఠస్థముచేసిన డ్రామాపార్టన్ను ఆమెకే అప్పగిస్తుండే వాడిని." అని అప్రస్తుతసమాధానాన్ని సగర్వంగా యేక రువుపెట్టాడు నందా. ప్రహసితవదనంతో "ప్రభతల్లికి జబ్బుగానున్నదన్నావు, ఆవిషయమై బాగా విచారించిరాక

పోయావా నందా?" అన్నాడు అశ్వం. నందా సర్వము తెలిసినవానివలె నిర్లక్ష్యంగా "వేరే జబ్బేముంటుంది! గ్రీకు దేశము వెళ్ళిన పుత్రిక, భర్త యేమయిపోయారోననేచింతతో కృశిస్తున్నది" అన్నాడు. కొన్ని కొన్నిసమయాలందు నందాయెడల విసగటకలుగుతుంటుంది అశ్వానికి. తన హృదయవేదనకు సాంత్వన కనిపించినచోట, విషాదములో ఓదార్పు లభించినచోట నిజమైనప్రేమ వుత్పన్నమవుతుంది. అదే మానవస్వభావము. కొన్నిసమయాలందు నందా ప్రభ గుణగణాలను పొగడుతూ ఆమెనుగురించిన విశేషాలనే గంటలతరబడి వివరిస్తుంటాడు. ఆసమయాలందు నందాను తనకవుగిటిలో కూర్చోబెట్టుకోవాలనిపిస్తుంటుంది. ప్రభే యీరూపములో తనముందు హాజరయినట్లు భావనకలుగు తుంటుంది. నందాప్రతిమాట ప్రియంగా తోస్తుంటుంది. మంత్రముగ్ధునివలె అతిశ్రద్ధగా వింటుంటాడు. మరికొన్ని సమయాలందు నందా ప్రతివిషయంలోను స్వప్రగల్భాలను మిళితంచేసి తనప్రభావాన్నే పెంచుకోజూస్తాడు. ఎదుటివారు యేభావముతో అడిగినా, యేఆశలతో ప్రశ్నించినా త్రిప్పి త్రిపి తనప్రభావప్రగల్భాలనే ప్రలాపిస్తుంటాడు. అలాంటి సమయాలందు అశ్వఘోష్ విసిగి ధూత్కారముతో సరసర నదిఅంచున దూరంగావెళ్ళి యేకాంతములో ఆలోచనా లోకములో చేసిన విహారయాత్రలనే చేస్తూ చూసినదృశ్యా లనే చూస్తూ మనస్సుకు శాంతిని కల్పించుకుంటుంటాడు. కొన్నిసమయాలందు మనస్సులోని ఆవేదనాతపనలో రెప రెపలాడుచూ శిసమెక్కినవానివలె అమాంతము సర

యూలో దూకి తలక్రిందులుగా తేలియాడుతూ నేత్రాలు మూసి, తనహృదయాధిదేవతను ధ్యానిస్తూ, ఆమెస్తోత్రంలోని రసానుభూతిలో పరమతృప్తిని పొందుతూ, ఆమె తనలో ఐక్యమయిపోయినట్లు, తన శరీరఅణువుఅణువులోను ఆమె తత్వము మిళితమయినట్లు, తనరక్తములో ఆమె రంగరింపబడినట్లు, ఆమెలేకుండా తాను లేనట్లు, తమయిరువురను యేకముచేసిన యీ పరమ పవిత్ర సరయూలో యిలానే తాను కొట్టుకెళ్ళి అనంతసాగరగర్భములో గలిస్తే, ఆమె యింతకంటె యింకా సన్నిహితమవుతుందేమోనని అంతము లేని ఆలోచనలుచేస్తూ యెంతోదూరము కొట్టుకెళ్ళి రెండో రోజున తిరిగివచ్చిన సమయాలున్నవి.

# పునరావేశం

దత్తమిత్రుడు, ప్రభ మిత్రానంద్‌తో సాకేతలో తమ యింటికి చేరినవిషయం క్షణములో పట్టణమంతటా ప్రచారమయిపోయింది. రసాతలానికిబోయినవారు అదృష్టంకొద్దీ తిరిగి యీలోకానికి వచ్చినట్లు ప్రభ తిరిగిరాగలిగినందుకు సంభ్రమాశ్చర్యాలతో పట్టణప్రజ వరుసగా గుంపులుగావచ్చి తిలకించిపోతున్నారు. రాజహీనప్రజలవలె శశిధరుడులేని నక్షత్రకోటివలె దీనత్వంలోమ్రగ్గిన యవననాట్యసమితివారు ప్రభరాకతో అంతములేనిఆనందములో కోలాహలముచేస్తున్నారు. తిరిగి తమతమ డ్రామాప్రోగ్రామ్సును నూతనంచేసుకుంటున్నారు.

నిరాశలలో నిస్పృహలో మునకలు వేసుకుంటూ భయ భీతావహమైన పయనమునుంచి వనవాసవిపత్తునుంచి బయట పడి ఆదరాభిమానాలతో ప్రేమలతో ముంచివేసే ఆత్మీయుల మధ్య చేరిన ప్రభ హృదయము పున్నమినాటి శశినిగాంచిన సాగరమువలె ప్రఫుల్లితమై పులకిస్తున్నది. ఆమె కిపుడు పూర్ణరూపములో అభిమానాలను చూరగొన్న అత్యధిక ఆకర్షణీయమైన ఆటవస్తువువలె గనిపిస్తున్నాడు మిత్రానంద్. ఆయనయెడల కృతజ్ఞతతో సర్వాంగీణము నర్తిస్తున్నది. ఆయనకు అందరను పరిచయముచేయుటలోను, వివరించుట లోను, ఆయన ప్రసన్నతను పరికించుటలోను స్నిగ్ధమైన ముగ్ధతను పొందుతున్నది.

ప్రభ మిత్రానందను వెంటనిడుకొని యువనయువతీ బృందముతో బౌద్ధభిక్షారామమునకు బయలుదేరింది. కాల కారామసంఘములోని మహాస్థవీరధర్మసేన్ భిక్షువుకు, ధర్మ రక్షిత్ భిక్షువుకు ప్రభ మోకరిల్లి హస్తద్వయాన్ని జోడించి లలాటాన్ని పృథ్విమీదమోపి ప్రణమిల్లింది. మిత్రానంద్ ఆమెననుకరించాడు. పరస్పరపరిచయానంతరము మిత్రానంద్ హృదయములో బుద్ధదేవుని శాంతిస్వరూప ముద్రలేవో అంకితమైనవి.

ఇపుడు మిత్రానందను కాలకారామభిక్షునాయకులు వోప్రక్క ప్రభ మరోప్రక్క ఆకర్షిస్తున్నందున అర్థంగాని అనుభూతిలో లీనమైనసంపుప తిరిగి తనదేశానికిపోవువిషయము మరుగునపడిపోయింది. కాలకారామములో నున్నపుడు యెవరివో కమనీయమైనమాటలు కర్ణరంధ్రాలలో న్మృదు

వుగా మీటుతుంటవి. గగనములోని మెరుపులవలె కనుల ముందు జిలిబిలి చిలిపినగవులు కనిపిస్తుంటవి. ఎవరిసేవాదరాలో తనహృదయాన్ని శీతలస్పర్శలతో నిమురుతుంటవి. అర్థంగాని అయోమయంలో వేడెక్కిన శిరస్సును తనహస్తాలతో రుద్దుకుని మనస్సును కుదుటపర్చుకోను ప్రయత్నించి విఫలుడై విసగటతో పరాధీనములో అడుగులు వేసుకుంటూ ప్రభయింటిముందుకు చేరి, అనంత అపరాధముచేసినవాని వలె అధీరతావిహ్వలుడై తిరుగుముఖమవుతుంటాడు. వెంటనే ప్రభ పరువులెడుతూవచ్చి యెదుటనిలిచి చిరాకును అభినయిస్తూ, "ఇదేమిటి ఆనంద్! ఇంతదూరము వచ్చి తిరిగి పోతున్నావేమిటి!" అంటూ చేయిబట్టి అబోధబాలునివలె లాక్కెళ్ళుతుంటే, నిద్రనుంచి మేల్కొన్నవానివలె ద్వితీయ హస్తముతో ఫాలభాగాన్ని నేత్రాలను నులుముకుంటూ ఆమెను అనుసరిస్తుంటాడు. ఆమెసత్కారాలను స్వీకరిస్తూ మధుసంచితపలుకులను వింటూ, సరససల్లాపాలలో ముంచుతుంటే ముగ్ధతలో మునకలువేస్తున్నపుడు ఆయనలోని ఆశయాలు లక్ష్యాలు ధర్మాలు దీక్ష ఒక్కమాటుగా విజృంభించి తిరుగుబాటు చేస్తుంటవి. శ్రీరామచంద్రమూర్తి పరధ్యాసలో యేదో ఒకకుటీరములో ప్రవేశించి పరికించినపుడు అది వేశ్యాగృహముగా గమనించి గాబరాపడినట్లు వ్యాకులచిత్తుడై ఖంగారుతో కళవళపాటు చెందుతుంటాడు. చెదరిన ఆయనదృష్టికి శాంతస్వరూప అవతారమూర్తియైన బుద్ధుడు కనిపిస్తుంటాడు. కనిపిస్తున్న ఆ తేజోవంతమైన మూర్తినుంచి శాంతిసందేశాలు, ఆదేశాలు సుస్పష్టరూపంలో వినిపిస్తుం

టవి. నేత్రాలునులుముకుని చూస్తే, మహాస్థవీర ధర్మసేన్ ఒకప్రక్క, ధర్మరక్షిత్ మరోప్రక్క కనిపిస్తుంటారు. తన ప్రమత్తతకు ఆత్మక్షోభ వూపివేస్తుంటుంది. తిరిగి ప్రభకు తెలియకుండా తప్పించుకుని కాలకారాముసంఘము జేరు తుంటాడు.

బౌద్ధవిహార్ లోని గ్రీకునాట్యశాల అలంకృతమై సభ్యులహడావుడితో శోభిస్తున్నది. యురోపిద్ రచించిన గ్రీకుడ్రామా రిహార్సలు్న జరుగుచున్నవి. నందలాల్ గ్రీకు భాషలో ప్రాకృతభాషను మిళితంచేసి, తనపాత్రను సొంత పోకడలో తయారుచేస్తున్నాడు. తనపాత్రలో చిన్ని దుఃఖ సన్నివేశముంది. ఆసమయానికి దుఃఖము పొర్లుతుందో లేదో, కన్నీరుకారుతుందో లేదోనని యేడ్పును చీకాకులతో ప్రాక్టీస్ చేస్తున్నాడు. దుఃఖమూడ్ లోమునిగి లీన మయి, అభినయనైపుణ్యాన్ని పొందాలని యేడ్వ ప్రారం భించాడు. ఏర్పాట్లలో సౌమ్యకు వుత్సాహాన్నిగల్పించి దిద్దుబాట్లనుసూపి, నాట్యశాల బాహ్యాకృత్య మెలావుందో చూడాలని బయటకొచ్చినప్రభ ప్రక్కను పొదచాటునుంచి వస్తున్న దుఃఖరోదనలు విని, విస్మితురాలై వెదుకుతున్నది. నందలాల్ తీవలచాటున భూర్జరపత్రముంచి, ఆ పత్రమే తీరిన కొలువులోని ప్రభువైనట్లు, తాను అపరాధములేకయే, శిక్ష బొందిన భృత్యుడైనట్లు, మోకరిల్లి హస్తద్వయాన్ని జోడించి, అశ్రువులొలికిస్తూ మద్ధకంఠముతో తన నిర్దోషి త్వాన్ని ఋజువుచేసుకో నశక్తుడైనట్లు తన నిస్పృహాచే, బాధచే పొర్లుకొస్తున్న దుఃఖముతో చిన్నగా రోదనలుసలు

పుతూ హృదయవిదారకరూపములో అస్పష్టకంఠముతో విన్నవించుకుంటున్నాడు.

ఉలికిపాటుతో వుత్సాహభరితవూహాలతో ప్రభ పిల్లి అడుగులు వేసుకుంటూ వచ్చి నందా వెనుక నిలిచి పరిశీలిస్తున్నది. ఆయనముందున్న భూర్జరపత్రముపై డ్రామాడైలాగు స్పష్టరూపములో వినిపించుటలేదు. పొర్లుకొస్తున్న దుఃఖము మాత్రము ప్రస్ఫుటమవుచున్నది. ఎవరివల్లనో యెందుకో గొప్ప విషాదఘట్టం జరిగివుంటుంది; తత్ఫలితంగా యేకాంతములో విలపిస్తున్నాడేమోనని, సానుభూతిని ప్రకటించు కంఠ ధ్వనితో "విలపిస్తున్నావేమిటి, యేమిజరిగింది నందా ?" అని ప్రశ్నించింది. నందాఅభినయం చెదరిపోయింది. సిగ్గుబిడియాలతో వెలవెలబోతూ లేచి, మఫ్లర్‌తో అశ్రుధారలను అద్దుకుంటూ, శుష్కహాసమును ప్రదర్శిస్తూ "ఏమీలేదు ప్రభా, రేపు నాటకప్రదర్శనలో యేడ్పువస్తుందో రాదోనని అభినయాన్ని అభ్యాసంచేసుకుంటున్నాను." అన్నాడు. ఆమె నోటికి చేతులడ్డముంచి అదుముకుంటూ, పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుతూ "నీవు అందులో అందెవేసినవాడివనే గదా నీ కా పొర్షన్‌యిచ్చింది. ఇంకా అభ్యాసంచేసి ప్రేక్షకులను చకితులనుచేసి పారితోషికము పొందాలని వాంచిస్తున్నావా?" అన్నది. నందా నతనతలాడుతూ "లేదు లేదు, మీరు దేశాంతరం వెళ్ళినందున యింత దీర్ఘకాలము నాటకాలులేక గొంతుకలు పూడిపోయినవి. చాలాకాలానికి తిరిగి ప్రదర్శనజరుగుచున్నందున ప్రేక్షకులు విపరీతంగా వస్తారు. అందుకని జాగ్రత్తపడుతున్నాను." అన్నాడు. కాని

ప్రభ యీమాటలు ఆలకించినట్లులేదు. ఆమెమనస్సు మరేదో ధ్యాసలోనున్నట్లు గోచరిస్తున్నది. పుష్పవిరాజిత గుల్బర్గా వృక్షమువైపు తదేకంగా చూస్తున్నది. తన మాటలు విన కుండావున్న ఆమెవైఖరిని జూచి విస్మితుడై నిరుత్సా హంతో "ఏమిటి ప్రభా, నేనేమైనా అపరాధంచేశానా?" అని ఆమెకు మరింత సన్నిహితంగా వెళ్ళి అన్నాడు.

ఆమె లలాటాన్ని వత్తుకుంటూ అధీరతాస్వరంతో "ఏమీలేదు నందా, గడచినఘడియలు ఆకస్మికంగా మదిలో రేగినవి. అంతే!" అని తిరిగి ఆకాశమువైపు చూస్తున్నది. ఆయన ప్రేతీకృతునివలె మౌనంగా నిలిచిపోయాడు. ప్రభ అయిదునిమిషాలఅనంతరం అశ్రుభరితనయనాలతో నందాను చూస్తూ, వుత్సాహపూరితకంఠంతో "నందా, మీ కవిగా రెలావున్నారు?" అని ప్రశ్నించింది. ఆయన నిర్లక్ష్య భావంతో "ఆయన ఇపుడు బొత్తిగా చెడిపోయాడు. ఈ నాలుగైదురోజులనుంచి నేను చూడలేదు" అన్నాడు. ఒక్క మాటుగా ఆమెముఖమండలము వెలవెలబోతూ జేవురిం చింది. కంపిస్తున్న అధరాలతో తొట్రుపాటును దిద్దుకుని, అణచుకున్నఆదుర్దాతో "ఏమిజరిగింది నందలాల్?" అని ప్రశ్నించింది. నందలాల్ లోతులు తెలియనివాడు. నిగూ ఢాలు, మర్మాలు, లౌకికాలు అతని కర్థంగావు. తెల్లనివి పాలు, నల్లనివి నీరు అనే సామాన్యబుద్ధి అతనిది. స్పష్టంగా చెప్పినపుడే అర్థంచేసుకోగల అతనిబుద్ధికి ముఖకవళికలలోని పరిభాష అసలే తెలియదు. సామాన్యధోరణిలోనే "ఏమీ లేదు ప్రభా! యెంత వుత్సాహాన్నికల్పించినా, యెన్ని

నవ్వించే కబుర్లు చెప్పినా, యెప్పుడూ మౌనంగావుంటూ తనలోతానే యేదో అనుకుంటుంటాడు. ఎక్కువగా సరయూవొడ్డున యిసుకలోబడి దొర్లుతుంటాడు. ఒక్కొక్కప్పుడు రాత్రులుకూడా అక్కడే పడివుంటాడు. ఆకలి దప్పులుకూడా అతనికి తెలియవు. కేశరాశి జడలుగట్టినవి. దుస్తులు యెప్పుడూ ధూళిధూసరితమైవుంటవి. మతిబోయిన వానివలె కనిపిస్తుంటాడు." అన్నాడు. ఆమెమనస్సు మరింత వికలంజెందింది, ఆత్రతతో యింకేమో తెలుసుకోవాలని వాంఛిస్తున్నది. "ఆయన అలా యెందుకయిపోయాడో నీవు అడుగనేలేదా?" అని ప్రశ్నించింది. "మతిబోయినవానిని నీకు మతి యెందుకుబోయిందని అడిగితే చెప్పగలడా? చెప్ప గలిగితే మతివున్నట్లేగదా!" అని నవ్వుముఖంతో అంటూ "ఆనాటి సరయూవిజయంనాటిమాటలే వినిపిస్తుంటాడు నిన్నుకూడా యెప్పుడూ తలుస్తుంటాడు. ఆ వుత్సవంలో యెవరిదృష్టిదోషమో తగిలి, అతనిమతి పోయివుంటుంది." అన్నాడు. ఆమె కొన్నిక్షణాలు తటపటాయించి, "వాని రేపు మన నాటికాప్రదర్శనకు తీసుకురాగలవా నందా?" అని ప్రశ్నించింది. నందా సరళధోరణిలో "ఆ కవి యిప్పుడు మనుష్యులమధ్యకు వచ్చుటకు సుతరాము యిష్టపడడు. ఎవరి యెదుటపడుటకు యిచ్చగించుటలేదు." అన్నాడు. వినయ పూర్వక ప్రార్థనారూపంలో "నీవు యెలాగయినాసరే నన్ను గురించి శ్రమపడి, వారిని తప్పక తీసుకురావాలి." అని కోరింది. నిరాసక్తతతో "సరే, నేను గట్టిగా ప్రయత్నిస్తాను. నీవు చెప్పినట్లుకూడా చెప్పిచూస్తాను." అన్నాడు నందా.

# భారతీయ ప్రథమ నాటకం

నాట్యశాల యౌవనయువతీ - యువకులతో నిండిపోయింది. ఆలస్యంగావచ్చినవారు బయటనే ఆసీనులవుతున్నారు. హిందువులు, బౌద్ధభిక్షువులుకూడా ప్రేక్షకులలో అధికసంఖ్యలోనే వున్నారు. నాట్యశాలస్టేజి యెత్తుగావుండి ముందుహాలుకు గోడలులేనందున ప్రేక్షకసంఖ్య యెంత పెరిగినా యిబ్బందిలేదు. సౌమ్య స్టేజిమీద కర్టెన్లు సర్దుబాటు జేస్తున్నది. ప్రభ ప్రేక్షకులను ఆదరాభిమానాలతో ఆహ్వానించి స్థానాలను చూపుతున్నది. ఆమె చూసినవైపుకే చూస్తున్న తృష్ణలోని బిత్తరిదృక్కులు యెవరికొరకో వెదుకుతున్నవి. మేకప్ గదిలోనుంచి అంచెలవారీగా ప్రభకు పిలుపులు వస్తున్నవి. కాని, ఆమె చేతితో నివారిస్తూ, ఏదో పోగొట్టుకున్నదానివలె దారులవైపు దూరాలవరకు దృష్టిని బరపుచున్నది. నిరాశానిస్పృహాలతో ముకుళించుకుపోయిన ముఖంతో స్టేజిమీదకెళ్ళి సౌమ్యచెవిలో యేదో వూదింది. సౌమ్య గ్రీన్ రూముకువెళ్ళివచ్చి అందరూ వచ్చారు అనే సౌంజ్ఞరూపములో గులాబిమొదలును వూపితే, పుష్పము వూగినట్లు ముఖాన్ని త్రిప్పింది. "సందలాల్ వచ్చాడా?" అని తిరిగి ప్రశ్నించింది ప్రభ. సౌమ్య మరోమాటు లోనికిపోయివచ్చి "లేదు" అన్నది. ప్రభముఖంలో ప్రసన్నరేఖలు సన్నగా మెరిసినవి. ఆమె కాలుగాలినపిల్లివలె స్టేజిమీదనే అటూయిటూ అడుగులువేస్తూ బెదిరినలేడివలె తెన్నులు చూస్తున్నది. నూతనప్రేక్షకులకు అదికూడా నాటకము

లోని నటనాభాగమేమో ననిపిస్తున్నది. వక్రాలుతిరిగిన పట్టులాంటి ఆమెకురులు పవనతెమ్మెరలకు ఆడుతున్నవి. ఆమె ధరించిన నీలిరంగు పట్టుచీరచెరగు రెపరెపలాడుతున్నది. కెంపు కనకాంబరసమ్మేళనంలో చిందిస్తున్న చెమకులలోని ఆమె సుకుమారశరీరం ధరించిన నీలివర్ణచీరె, గేవారంగు బ్లౌజుతో అద్వితీయమై శోభిస్తున్నది. అరుణవర్ణ అధరాలతో కిరణప్రసారం జరుగుచున్నది. తీర్చిదిద్దిన ఆ లలాటము, చుబుకము, కపోలాలు, స్ఫటికములబోలి స్ఫుటముగా ద్యోతకమవుచున్నవి. కస్తూరిలోముంచితీసినట్లున్న ఆమె మృదువైనహస్తాలు అతినునుపుగా ఆకర్షిస్తున్నవి. చీరె పొరలలో పొదిగినట్లున్న వక్షోజాలు మతిచాంచల్యాన్ని ప్రేరేపిస్తున్నవి. ఆమె మాటాడుతున్నపుడు కపోలాలమధ్య కలుగుతున్నవక్రాలు విజయచక్రాలవలె లావణ్యాన్ని అధిగమింపజేస్తున్నవి. ఆ మీననయనాలలోని బిత్తరిచూపులు, వయ్యారాలొలుకు ఆ మందగమన అడుగులు, ఆమె చీర చెరగు రెపరెపలు, కురులమెదలికలు ప్రేక్షకులహృదయమర్మాలందు జిలిబిలినృత్యాన్ని సృష్టిస్తున్నవి. అనాలోచితంగా జరుగుతున్న ఈ స్వాభావిక కదలికలే నాటకంలోని నిర్ణీతమైన అభినయంకంటె ఆకర్షణీయంగా తోస్తున్నదేమో! ప్రేక్షకులందరూ నిశ్శబ్ద నిర్మలవాతావరణంలో ప్రభను చూస్తూ ఆత్మానందాన్ని పొందుతున్నట్లు తోస్తున్నది.

పెళ్ళివారంతా సిద్ధమైనా పెళ్ళికూతురు సిద్ధంగానందుకు క్రుద్ధులై పాలుబోక తహతహలాడినట్లు గ్రీన్‌రూము నుంచి ఒక్కరొక్కరుగా బయటికొచ్చి ప్రభయెదుట నిరు

త్తరులై నిలిచిపోతున్నారు. ఎవరుపిలిచినా, యెన్ని కేకలిడినా మౌనముద్రలోమునిగిన ఆమె తన హస్తసౌంజ్ఞతో ఆపుతున్నది. మేకప్‌రూములో కొరకొరలాడుతూ బయటికొచ్చి ప్రభయెదుటపడినవారు నిరుత్తరులై నిలిచిపోతున్నారు. నాట్యమండలివారందరిహృదయాలలోను దైన్య పరువులెడుతున్నవి. మనస్సులు పనిచేయుటలేదు. సన్నిహితురాలైన సౌమ్యకుకూడా ప్రభ అంతర్గతము అర్థంగాక విస్తుపోతున్నది.

సౌమ్య చిరాకుతో చిందులు త్రొక్కుతున్న ముఖంతో దంతాలునూరుతూ "ప్రభా, యీ జాగేమిటి?" అని అణచుకున్న కఠినధ్వనితో అన్నది. ప్రభ ప్రహసిత వదనంతో "నీవు పో సౌమ్యా! అందరను తయారుచెయ్యి. "నందలాల్ లేకపోతే నవ్వేరాదు ప్రేక్షకులకు. నవ్వును కల్పించలేని నాటకం రక్తికట్టదు. నందలాల్ కొరకు చూస్తున్నాను." అన్నది.

నందలాల్ లేనిసమయం యెన్నడూ లేదు. అందరికంటె ముందు, అందరికిఆఖరున ఆయన రాకపోకలు. నేడింత ఆలస్యమైనా నందా రాకపోవుట అందరను ఆశ్చర్యాన్వితులను చేస్తున్నది. నందాపోర్షన్ నాటకంలో అంత ప్రముఖమైందిగాదు, ఆ పాత్ర లేకపోయినా నాటకానికి లోటులేదు. మరి ఆయనకొరకు ప్రభ యెదురుచూచుట వింతగానేవుంది. సౌమ్యకు నందాయెడల ప్రత్యేకశ్రద్ధ వుంది. అందువల్లనే అతనిమాట విన్నప్పుడు ఆమెలోనితొందర అణిగిపోయింది.

ఘాటువైపుమార్గమునుంచి యిరువురువ్యక్తులు వస్తున్నారు. అందులో ఒకరు నందాయని నడకలోని ఆ చేతుల

వూపు, స్థూలము తెలియజేస్తున్నది. రెండోవ్యక్తి జిబ్బిగా విరబోసినజుట్టుతో దుర్బలశరీరంతో గనిపిస్తున్నాడు. ఆవ్యక్తే కవి అశ్వఘోష్. సూర్యకిరణముసోకిన కమలమువలె ప్రభ ముఖము వికసించింది. అటూయిటూ అడుగులు వేస్తూ కోణదృక్కులతో అటేచూస్తూ సౌమ్యచెవిలో యేదో చిన్నగా చెప్పింది. సౌమ్య ప్రక్కగా హుటాహుటి యెదురు వెళ్ళి వికారరూపంలోనున్న అశ్వఘోష్‌కవిని, వీరోచిత ముఖప్రదర్శనలోనున్న నందానుఆహ్వానించి తీసుకొచ్చింది. గ్రీన్‌రూములోనివారు ఒక్కరొక్కరుగా బయటకొచ్చి కవిని, రెండవవైపు తిరిగి స్టేజిమీద అటూయిటూ అడుగులు వేస్తున్న ప్రభను అవలోకించిపోతున్నారు. ప్రభమనస్సిపుడు కుదుటపడింది గాబోలు! గ్రీన్‌రూములోకి వెళ్ళింది. సౌమ్య, నందాలు ఆమె ననుసరించారు.

నాట్యప్రదర్శనలో ప్రభ, సౌమ్యలు అత్యద్భుతంగా నటించారు. నందా యీరోజు అభినయంలో విఫలం జెందాడు. ఎంతప్రయత్నించినా యేడ్పుకుబదులు నవ్వొ వచ్చింది. తన దురదృష్టానికి నొచ్చుకుని నొసలుముడివేసి నెత్తిమోదుకుంటూ తిరిగితిరిగి యేడ్వటానికి ప్రయత్నించి అదిమినా ఆగని ఫక్కుమనేనవ్వులతో విఫలంజెందాడు.

నాటకానంతరం సౌమ్య ప్రార్థనాపూర్వకంగా అశ్వఘోష్‌కవిని మేకప్‌గదికి తీసుకెళ్ళింది. ప్రభ నొప్రక్క కవిని తనివిదీర చూడాలని, నమస్కరించి కుశలప్రశ్నలడగాలని, ఆదరసత్కారాలు స్వయంగా చేయాలని, మరోప్రక్క ఆనాటి విజయోత్సవంలోలా అందరూ యెక్కడ హేళ

నలుపట్టిస్తారోననే భీతితోను, అంతర్గత ఆదుర్దాలతో సత
మతమవుచూ కోణదృక్కులను విసరుతూ, తన కేమీ పట్టనట్లు
దూరదూరంగా వుంటూ తానుకూడా గ్రీన్‌రూములో ప్రవే
శించింది. నందా వేసుకున్న భృత్యవేష మింకా తీయలేదు.
అతికించినమీసాలు యింకా అలానే వున్నవి. కవి ప్రవేశ
ముతో ఆవిషయమే మర్చిపోయి, పరమానందంతో పొంగి
పోతూ, తన అభినయం కుదరనందుకు విచారాన్ని ప్రక
టిస్తూ, లోగడ తను యెంత అద్భుతంగా నటించినదీ వివ
రిస్తూ, ఆ తరువాత అక్కడివారందరిని కొద్ది గర్వప్రకటిత
పోజులో చూచి, తనకూ కవికీగల సన్నితసంబంధాన్ని యేక
రువు పెట్టాడు. ఆ తదుపరి, కవి కొంతకాలంనుంచి విచార
గ్రస్తంగా వుంటున్నాడని, ఆ వివరాలు తనకు యెంతయో
చించినా, తెలియలేదనీ వివరించాడు. కవి రచనాప్రభావాన్ని
ఆయన విచిత్రస్వభావ ప్రభావాలను వేనోళ్ళ పొగడి, తరు
వాత వారిని కవికి ఒక్కొక్కరినిగా పరిచయంచేశాడు. ఇక
ప్రభ, సౌమ్యలు మిగిలివున్నారు. ప్రభ అధోముఖియై ముభా
వంగా వుంది. నందా ప్రభ, సౌమ్యలనుచూపుతూ పరి
చయంచేయబోయాడు. కాని, కవి "నేను సాకేతలోవుంటూ
కూడా యింత అనుపమకళకు అనభిజ్ఞునిగా వున్నాను. నేడు
మీద్వారా అజ్ఞాతప్రభాలోకకళాదర్శనప్రాప్తమయినం
దుకు కృతజ్ఞుణ్ణి." అన్నాడు.

కవినోటినుంచి 'ప్రభాలోక' అన్న శబ్దము వెలువడి
నదే తడవుగా యువతీయువకులు వుత్సుకతతోగూడినవవ్వుతో
ప్రభవంకజూస్తూ యేమో అనబోయారు. కాని వెనువెంటనే

కవి "అభినయంలో వాస్తవికత స్ఫురించే యింతఆకర్షణ వుంటుందని యింతకుపూర్వం నాకు తెలియదు. అభినయంతోగూడిన గానం మానవహృదయాలను ముగ్ధతలో ముంచగల విశిష్టశక్తినంతమైందని మీ ప్రదర్శనద్వారా తెలిసింది. మీరు ప్రదర్శించిన యవననాటక ప్రాకృతానువాదము చూస్తున్నపుడు, మన దేశపు కథావస్తువునే తీసుకుని యిదేరీతిలో రచించితే యెంతో బావుండుననిపిస్తున్నది" అన్నాడు.

సౌమ్య:- ఇలా వ్రాయాలని నీవు శ్రద్ధతీసుకుంటే గ్రీకునాటకకర్తలకంటె రసవత్తరంగా వ్రాయగలవు కవీ.

కవి:- నన్ను చిన్నబుచ్చకు సౌమ్యా! గ్రీకునాటకకర్తల శిష్యార్హతమాత్రమే నేను పొందగలను.

అంటూ గౌరవతో మందహాసంచేస్తూ 'ఊర్వశీవియోగం' గూర్చి నాటకంవ్రాయుటనుగురించి సంప్రదించాడు. అందు కందరూ సమ్మతించారు. సౌమ్య మరింత సన్నిహితంగా వచ్చి "'ఊర్వశీవియోగం' మీదే నాటకం వ్రాయి కవిజీ! మేము తప్పక అభినయిస్తాము. కాని, మీ రందు పురూరవపాత్ర ధరించితీరాలి" అన్నది. సంకోచిస్తున్న ముఖంతో. "అభినయంలో ఆరితేరిన మీముందు నన్ను నిలిపి పరిహాసాలపాలుచేయుటకా" అన్నాడు కవి. అనునయ కంఠధ్వనితో "మీ శక్తి సామర్థ్యమంతా మీకు తెలియదు కవిగారు. మా కందరికీ మీసత్తా సరయూవిజయంనాడే తెలిసిపోయింది. మీరు 'ఊర్వశీ వియోగం' వ్రాయుట, మేము అభినయించుట, అందు మీరు పురూరవపాత్ర ధరిం

చుట జరిగితీరవలసిందే. అందుకు కావలసిన చిత్రదృశ్యా లనుకూడా తయారుచేస్తాము” అన్నది సౌమ్య. ఆయన వెలవెలబోతూ అదురుతున్న అధరాలతో యేమో చెప్ప ప్రయత్నిస్తున్నాడు కాని, మాట పెగులుటలేదు. తిరిగి వెంటనే “కవీజీ, మా నాట్యమండలిలో యెక్కువమంది అభిప్రాయాన్ని మండలిలోని ప్రతిఒక్కరు శాసనరూపంగా పాటించవలసిందే.” అని సౌమ్య అసంపూర్తిలోవుండగానే, అందరూ కిలకిలారావంచేస్తూ “కవిగారు అభినయించా ల్సిందే, పురూరవపాత్ర వారే ధరించాలి.” అన్నారు ఒక్క పెట్టున. చిన్నబోతున్న కవిప్రక్కకు జేరి, మోచేతితో పొడుస్తూ కీగంట సైగచేస్తూ “ఫరవాలేదు, సరేనను అశ్వ ఘోష్,” అంటున్నాడు నందా. ప్రభ అంతర్గతఆనందంతో ప్రసన్నదృక్కులబరపుతూ అటూయిటూ చూస్తున్నది. ఎటూ పాలుబోని కవి తటపటాయిస్తున్నాడు. న్యాయస్థానపు బోనులో నిలిపి, కృద్ధచూపులతో వప్పుకోమ్మని గద్దింపబడు తున్నట్లున్న ఆయన “మీ దర్శకత్వములో నేర్పితే, అలానే పురూరవపాత్రాభినయంచేస్తాను.” అన్నాడు. అందరూ ఒక్కమాటుగా హర్షాతిశయాలతో కరతాళధ్వనులుచేశారు. కవిహృదయానికి స్థిమితంకలిగింది. దీర్ఘశ్వాసవిడచి “ఈ నాటకంలో యెన్నిపాత్రలవరకు వుండవచ్చునంటారు?” అన్నాడు సౌమ్యవైపు తిరిగి. సౌమ్య అందరికేసి చూస్తూ, వ్రేళ్ళమీద లెక్కిస్తూ, ఆఖరుకు నందానుకూడా సైగతో లెక్కించి “పదిహేను పదహారుపాత్రలవరకు నటకులుం టారు.” అన్నది. కవి “నేను పదహారుపాత్రలకు మించకుం

డానే చూస్తాను. చిత్రదృశ్యపటాలవిషయంలోకూడా నేనూ మీకు తోడ్పడతాను.” అన్నాడు. నందాకు తనపాత్రేమిటో తనకు తెలియక, తెచ్చుకున్న ఉత్సాహాన్నభినయిస్తూ, అశ్వఘోష్ ప్రక్కకు చేరి, ఆయనహస్తాన్నిబట్టి అటూ యిటూ చూస్తూ ఆజ్ఞాపూర్వకమైనకంఠధ్వనితో “సౌమ్యా, ఓ సౌమ్యా! కాస్త యిటు దయచేయండి.” అని పిలిచాడు.

ప్రభతో యేవిషయమో సంప్రదిస్తున్న సౌమ్య నవ్వునాపుకుంటూ, దగ్గరగావచ్చి పరిహాసపూర్వకంగా శిరస్సును కోణంగావంచి చేయిచాపి “ఏమిటో సెలవివ్వండి మహాశయా!” అన్నది. నందా ప్రసన్నాన్ని మిళితంచేసిన గర్వితవదనంతో, కాలిమడమను వూపుకుంటూ “ఏమీలేదు, పురూరవపాత్రవిషయం నిర్ణయంచేశారు బాగానేవుంది. మరి వూర్వశిపాత్ర కెవరో అదికూడా నిర్ణయంచెయ్యండి!” అన్నాడు. నిశ్చేష్టులవలె అందరూ సౌమ్యవైపు చూస్తున్నారు. స్వయంవరహారం చేతబట్టి వెదుకుతున్నదానివలె ఒకొక్కరినిగా అందరిని పరికిస్తూ, ప్రభమీద దృష్టినినిలిపి కొన్నిక్షణాలతరువాత, “ఊర్వశిపాత్ర మా ప్రభ వేస్తుంది” అన్నది. అందరిలోను కోలాహలం వెడలింది. అందరూ ఆమెనే చూస్తున్నారు; కవికూడా ఉత్సుకతతో ధైర్యాన్ని పూరించుకుని తదేకంగా చూస్తున్నాడు. ప్రభ భీతితో మ్లానతచెందింది. సౌమ్య అశ్వఘోష్‌వైపు చూస్తూ “మా మండలిలో యెవరికి యేపాత్రయిస్తే వారది తప్పక స్వీకరించవలసిందే. ఇది మా రివాజు. ప్రభే ఊర్వశిపాత్రకు తగివుంటుందిగనుక వేస్తుంది. ఏం ప్రభా, సమ్మతమేగదూ?”

అని ప్రభనుద్దేశించి అన్నది. ప్రభ మారుపలుకజాలక, శిర స్సునధోముఖంచేసి "సరే" నన్నది. మరోమాటు కోలాహాలంచెలరేగింది.

వైశాఖ జ్యేష్ఠమాసాల యెండతీవ్రతకు వడబడిన వృక్షజాలాలు తొలకరివర్ష జలాలతో తెప్పరిలి యేపుకుతిరిగి నట్లు, వృష్ణగాడ్పులకు తేలికపడిపైకిపోతున్న మేఘాలకు శీతల పవనాలు తగిలినవెంటనే, కారురంగుతో బరువెక్కి క్రిందికి దిగినట్లు, యెండి చిక్కి శల్యావస్తలోనున్న నది కుంభ వృష్టితో ఒక్కమాటుగా పొంగి తరంగాలతో తపతపలాడు తున్నట్లు అశ్వఘోష్ యవననాటకమండలిలోచేరికతో మారిపోయాడు. ఇపు డాయనమనస్సు వుత్సాహంతో పూగిపోతున్నది. వంటరిగావున్నపుడు కూనరాగాలు విని పిస్తున్నవి. ఆయనలో ఆయనే నవ్వుకుంటూ యేదో ఆలాపనచేసుకుంటుంటాడు. మనుష్యులనుచూస్తుంటే యిపుడు భయంకలుగుటలేదు. దారులవెంట పోవుటకు భీతిలేదు. ఇపు డాయనకు సమయం చాలుటలేదు.

యవననాటకమండలివారితో చేరి, ప్రాకృతభాషలో అనువదింపబడిన అనేక యవననాటకాలను పరిశీలించాడు. అందు వర్ణింపబడిన చిత్రపటదృశ్యాలనుకూడా మననంచేసు కున్నాడు. మండలివారిలో ప్రతిఒక్కరి ప్రజ్ఞావిశేషాలకు సరి పోవునట్లు పాత్రలను సృష్టించాడు. ప్రదర్శనాసమయానికి సరిపోవునట్లు సన్నివేశాలను నిర్ణయించాడు. ప్రతిసన్నివేశా నికి అతికినట్లుండు చిత్రపట దృశ్యాలను సూచించి, యవన కళాస్మృతిచిహ్నమైనట్లు 'యవనిక' నామకరణంచేశాడు.

నాటకము సంస్కృత ప్రాకృతాలమిళితమై అందరకూ అర్థమవురీతిలో గద్యపద్యరూపంలో రచించాడు. ఈ 'ఊర్వశీ వియోగ' మే భారతీయ ప్రథమనాటకము. అశ్వఘోషే భారతీయ ప్రథమనాటకకర్త. ఆయన ఆ తదుపరి 'రాష్ట్రపాల్, సారిపుత్ర మొదలగు నాటకాలు వ్రాసినా, ఊర్వశీ వియోగములోని విలాపము విశిష్టరూపాన్నిచ్చి ప్రేక్షక హృదయాలను కరిగిస్తుంది.

రచనాకార్యక్రమము ముగిసింది. ఇపుడు మండలి వారు యెవరిపోర్షన్‌లను వారు కంఠస్థంచేస్తూ అభినయాభ్యాసాన్ని పొందుతున్నారు. పరీక్షాసమయాలందు విద్యార్థులు టయముకుముందు హాలుచుట్టూ బయట, అంతటా యెక్కడికక్కడ జేరి, నోట్సులు తిరుగవేసుకొనునట్లు, చేతిలో పుస్తకంపట్టి, కనులుమూసి కంఠస్థంచేస్తూ గంటకొరకు యెదురుచూస్తున్నట్లు, సాకేతలోని గ్రీకునాట్యశాల చుట్టు ప్రక్కలంతటా ఒక్కరొక్కరుగాను యిరువురిరువురుగాను నాట్యమండలివారితో నిండివుంది. అందరిలోను శ్రద్ధాదీక్షలు ప్రకటితమవుతున్నవి. నందాకుకూడా అదృష్టవశాత్తు మంచి పాత్రే లభ్యమైంది. కాని అంత పెద్దపోర్షన్ చదువలేక చీకాకుచెందుతూ, అటుయిటూ తిరుగుతూ తను యెవరితో యేమేమి అనాలో ఆ పాత్రధారులు తనముందున్నట్లే వూహించి, అభినయిస్తూ వూహాపోహాలతో తన స్వంత మాటలను సృష్టించాలని ప్రయత్నించి విఫలమై, కవి కొరకు వెదకిపట్టుకుని, "అబ్బ, అశ్వఘోష్! నా ప్రాణం

తీశావయ్యా ! ఇంత పెద్దపోర్షన్ కంఠస్థ మెలాఅవుతుంది చెప్పు ? ఈ కఠినశబ్దాలు నా నోటికి కుదురుటలేదు బాబు. మా నాటకములో ప్రభ నా కిచ్చిన పాత్రలోని యేడుపే బాగుంది.” అంటున్నాడు. అశ్వఘోష్ మందహాసంచేస్తూ “సందర్భము భావార్థము బాగా తెలుసుకున్నపుడు, ఆ మాటలు అతి తేలికయిపోతవి.” అన్నాడు.

నందా మొఖాన్ని వికృతంగాబెట్టి “నావల్లగా దీ పని. యెక్కువ మాట్లాడేపనిలేకుండా అభినయంద్వారా నా పని పూర్తయేమార్గం చూడు బాబు!” అన్నాడు.

చలోక్తిగా “కేవలం యేడ్పుతో ముగించేపాత్రను సృష్టించమంటావా నందా ?” అన్నాడు కవి. ఇతరులంతా దూరాలనుంచికూడా తననుచూస్తున్నట్లు గమనించి, కవి ప్రక్కగా చతికిలబడి, యేడ్పుముఖంతో “మా నాటకమే నాకు బాగుంది. నాలుగుమాటలు అని, పావుగంట యేడిస్తే నా పాత్రపని అయిపోయేది. నీవు యిందులో నాలుగుఆకుల మీద వ్రాశావు. ఇది నేను యీజన్మలో కంఠస్థంచేయ లేను.” అన్నాడు నందా. “నీ పాత్రలోని సంభాషణ యెక్కువభాగము సౌమ్యతో జరుగుతుంది. సౌమ్యవద్దకే పోయి అభినయంతో చూచి చదువు. పోనుపోను తేలికగా కంఠస్థమవుతవి.” అన్నాడు కవి.

అశ్వఘోష్ తనువ్రాసిన తనపాత్రలో లీనమయి, అభినయం అభ్యాసపడ్చుకుంటున్నాడు. తరచుగా మండలి వారు ఆయనచుట్టూ జేరి, తమతమపాత్రలోనిభావాలను మర్మాలను అడిగి తెలుసుకుంటున్నారు. అభినయంతో ఆ

మాటల నుచ్చరించి, ఆయన ఆమోదముద్రలను పొంది, పోతున్నారు. ఆయన కివి జీవితములో వుత్తమఘడియలుగా తోస్తున్నవి. ఆయనహృదయం ఆనందంతో ఆర్ద్రిమవుతున్నది. తనదేశములో తనభాషలో తన నాటకరచన ప్రథమప్రయత్నము. అందలి ప్రధానపాత్రను తానే నటించుట - ఇది సామాన్యసంఘటనగాదు. నాటకమండలివారు కూడా తమ కిదొక గొప్పఅదృష్టంగా భావిస్తున్నారు. నాటకకర్త తమతో ప్రధానభూమికనుధరించి, పాల్గొనుట సామాన్యవిషయం కాజాలదు. అందరిలోను నూతనోత్సాహం ప్రబలరూపం దాల్చింది. దినమొకక్షణంగా గడిచిపోతున్నది.

## ఊర్వశీవియోగ నాటకప్రదర్శన

దృశ్యాలకుసంబంధించిన చిత్రపటాలుకూడా పూర్తయినవి. అందరిపోర్షన్‌లు కంఠస్థమయినవి. తిరిగితిరిగి మననం చేసుకుంటూ తమలోతామే రిహార్సల్‌రూపంలో అభినయం చేసుకుంటున్నారు. అశ్వఘోష్ బుద్ధవిహార్‌లో తిన్నెమీద కూర్చుని, తనపోర్షన్‌లోని పాట పాడుకుంటున్నాడు. దూరంగాకూర్చుని చదువుకుంటున్న ప్రభకు శ్రావ్యమైన రాగంలోని విషాదదొంతరులు చలింపజేసినవి. నెమ్మదిగా లేచి పిల్లి అడుగులువేసుకుంటూ అశ్వఘోష్‌వెనుకకు వెళ్ళి నిలిచి, యేమో చేయాలనుకుంటున్నది. కాని ఆ పాటలోని దుఃఖభరిత ఆర్తనాదం మధురాతిమధురరూపంలో శ్రావ్య

మైన లయనుబొంది ఆమెహృదయాన్ని కంపింపజేసింది. ఆమెకు తెలియకుండానే ఆమెనయనాలు జలాన్ని వలికిస్తున్నవి. ప్రక్కన అజ్ఞాతరూపంలో కూలబడిపోయింది. ఆయనపాట లోని రాగముతోపాటు ఆమెమనస్సు వూగిపోతున్నది. ఆమె తమ డ్రామాలలో యెన్నోపాటలు విన్నది. కాని, యీ పాటలోని మాధుర్యం తనకు విచిత్రానుభూతిని కలిగి స్తున్నది. ఆ రాగములో లీనమై గొంతెత్తి యేడుస్తూ కడి వెడుకన్నీరు కార్చాలనిపిస్తున్నది. ఆమెమనస్సులోని ఆరా టంతో గొంతు శుష్కించి పిడచగడుతున్నట్లున్నది. అధ రాలు సుడులుదిరుగుతున్నవి. పాట ఆగిపోయింది. ఆమె చకితురాలై బెదరినదానివలె అటూయిటూ చూస్తున్నది. తా నిక్కడి కెలావచ్చానా అని ఆలోచిస్తున్నది. ఆయన మోచేతి కేదో తగిలి వెనుదిరిగిచూసి విభ్రాంతునివలె తట పటాయిస్తూ "ఏమిటి ప్రభా, యెప్పుడొచ్చావు? యిలా వెనుకకూర్చున్నా వేమిటి?" అని ప్రశ్నించాడు. ఆమె వెర్రి దానివలె ఆయన్ను తదేకంగా చూస్తున్నది. "నీ నేత్రా లలా జ్యోతులవలెనున్న వేమిటి ? కన్నీరు కారుస్తున్నా వెందుకు?" అని తిరిగి ప్రశ్నించాడు.

ఆమె చెంగుతో ముఖాన్నితుడుచుకుని, గొంతు సవరించుకొని లోతుకంఠంతో "ఏమీలేదు కవిజీ! నే నిక్కడి కెలావచ్చానో నాకే తెలియదు. నీ పాట అద్భుత మైంది." అన్నది. ఆయన నవ్వును ప్రదర్శించి వూరుకు న్నాడు. ఆమె పూరించుకున్న కంఠముతో కవిజీ, నేను

ఒక్కమాట అడగాలనుకుంటున్నాను, దయతో నిజంచెప్తారా?" అని అడిగింది.

కవి:- అడుగు యేమిటో ?

ప్రభ:- ఊర్వశీవియోగం వ్రాయునపుడు కథావస్తువుగా యేమితీసుకున్నారు ?

కవి:- ఊర్వశీ పురూరవలకథనే కథావస్తువుగా భావించాను.

ప్రభ:- ఆ కథ నాకూ తెలుసు. కాని మీరు ఊర్వశిని 'అప్సరా' అంటూ పదేపదే సంబోధించారు?

కవి:- ఊర్వశి అప్సరస గనుక.

ప్రభ:- ఊర్వశీవియోగంలో పురూరవుడు విహ్వలచిత్తుడై వనాలు, పర్వతాలు, సరోవరం, సరయూలలో వెదకినట్లు చిత్రించారు ?

కవి:- వియోగావస్థలో అది స్వాభావికంగనుక.

ప్రభ:- వియోగగాయకుడు లతాగృహంలో పాటతో యేకధారగా అశ్రువులొలికించినట్లు వ్రాశారు.

కవి:- వియోగినికి విషాదగీతిక, అశ్రువులే నిజసంపత్తిగనుక.

ప్రభ:-కాదు. మీరు నాతో యదార్థం చెప్ప సంకోచిస్తున్నారు.

కవి:- నీవు ఏమి తెలుసుకోవాలనుకుంటున్నావో చెప్పు ప్రభా !

ప్రభ:- నాదృష్టిలో నీవు పాత పూర్వశీవియోగ పాటలు కాదు వ్రాసిందీ, పాడిందీను.

కవి:- అయితే యెవరివంటావు ?

ప్రభ:- మీ హృదయములో నివసించిన పూర్వశియే ఆ అప్సరస. (అప్-సరయూయొక్క-నీటిలో, సరా-యీదు నది) సరయూనదిలో యీదునదే నీ అప్సరస.

కవి:- ఇంకా!

ప్రభ:- ఈ పూర్వశియొక్క పురూరవుడు తనఅప్సరస కొరకు హిమాలయపర్వతాలు, అరణ్యాలు, సరోవరాలు, సాగరాలు కాడు వెదికింది; సాకేతలోని సరయూనది, బౌద్ధ విహార్, క్రీడాపర్వతము, పుష్పోద్యానవనములోని సరోవరము.

కవి:- మిగతాదికూడా పూర్తికానివ్వు!

ప్రభ:- ఆ కార్చినకన్నీరు - పాతపురూరవుని యెడల గల సానుభూతితో కార్చినవిగాదు, అవి తనహృదయము లోని వ్యథాభరితమైనవి.

కవి:- ఇన్ని నీవడిగావు. ఒక్కటి నే నడుగుతాను. నీవు క్షణంముందు కార్చినకన్నీ రెందుకు చెప్పు ప్రభా!

ప్రభ:- (ఖంగారు చెందుతూ) నీ పాట విన్నందువలన వచ్చినవి, అంతే!

కవి:-ఆ పాట నీ వియోగప్రదానమంటే నమ్ముతావా?

ప్రభ:- కాని, నీ పాటలోని పూర్వశి పాషాణ మూర్తిగాతోస్తున్నది. అంత హీనంగా ఎందుకుచిత్రించావు?

కవి:- నాలోని వ్యాకులత నైరాశ్యత అలాంటివి గనుక.

ప్రభ:- ఎందు కలా కలిగినవి?

కవి:-నేను ఆ అచిరప్రభా(విద్యుత్)దర్శనసౌభాగ్యము తిరిగి పొందలేననుకున్నాను. ఆమె నన్ను యెన్నడో మరచి పోయివుంటుందనుకున్నాను.

ఆమెనేత్రాలనుంచి తిరిగి అశ్రువులు ఒక్కటొక్కటిగా జాలువారుతున్నవి. వ్యాకులచిత్తుడై "ఏమిటి ప్రభా, కన్నీరు కారుస్తావెందుకు?" అని ప్రశ్నించాడు. ఆమె వణుకుతున్నకంఠంతో "కారణాలు చెప్పగల సాహిత్యం నావద్ద లేదు. అవ్యక్తమైనవారికి కన్నీరుకార్చుటలోనే సాంత్వన, సాంత్వనలోనే సంతృప్తి, సంతృప్తిలో శాంతిలభిస్తుందేమో!" అన్నది. నొచ్చుకుంటూ "అవ్యక్తతతో అసందర్భాలను సృష్టించుకొనుట అదృష్టముకాజాలదు. కారణమేమిటో నిజంచెప్పు ప్రభా." అన్నాడు. చిత్తలో కురియువర్షముమధ్య తీవ్ర యెండ ప్రకాశించినట్లు కన్నీరుకారుతున్న ఆమెముఖములో నవ్వు ప్రదర్శితమయింది. సాంత్వనతో గూడిన కంఠంతో "కవీ, నీకు సరయూవిజయంనాటిదృశ్యాలు గుర్తున్నవా? ఆనాడు మనమిరువురము యిలానే ప్రక్క ప్రక్కల యిక్కడే కూర్చున్నాము. సాకేతప్రజలందరూ మనముందు హాజరయ్యారు. సౌమ్య నృత్యంచేసింది. ఆనాడు నాస్మృతిపథంలో మెదిలినవిషయాలు తిరిగి వరుసగా దొర్లుతున్నవి. అసంభవాలు సంభవాలుగా అనుకోనిరీతిలో మారినపుడు, కన్నీరుకారుట కద్దు అవి ఆనందబాష్పాలు గావచ్చు, భయభీతులతో హృదయకంపనలతో బయల్పడు బాష్పాలు కావచ్చు," అన్నది.

కవి:- బాగా అర్థమయ్యేటట్లు స్పష్టరూపంలో చెప్పు ప్రభా.

ప్రభ:- అన్నిటినీ సుస్పష్టరీతిలో అర్థంచేసుకోగలశక్తి నాలో లేదని ముందే చెప్పాను. తనహృదయంలో జిలిబిలిగా పరువులెత్తేవి అస్పష్టమైనపుడు, తనకే అర్థంగానపుడు యేమని చెప్పగలం చెప్పండి?

కవి:- భయభీతులన్నావేమిటి?

ప్రభ:- గర్భదరిద్రునికి విశేషసంపత్తి లభ్యమైనపుడు, దాన్ని కాపాడుకుని అనుభవించవలసిన తనశక్తిపై శంకకలిగి నపుడు భయభీతులుకలుగుట పరిపాటి.

కవి:- నీవు పొందిన అలాంటి అనుపమవస్తువేమిటి?

ప్రభ:- నీ పూర్వశీవియోగంలో అంత వ్యాకులచిత్తుడ వెందుకైనావో చెప్పు?

కవి:- నా పూర్వశి నన్ను ఆనాడే మర్చిపోయి వుంటుందనుకున్నాను. ఆమెను పొందగలయోగ్యతలు నాలో లేవనుకున్నాను. నాకు మిగిలింది వ్యథేననుకున్నాను. ఆ రూపప్రదానమే నా పురూరవగానము.

ప్రభ:- ఇందులోని యెక్కువభాగము మీ భ్రమ మాత్రమే. మీరు హిందూమతములో వున్నతకులానికి చెందిన కులీనులు. ప్రఖ్యాత కవులు, నిష్ఠ నియమాలుగల సద్వంశీకులు, నేను మ్లేచ్ఛురాలినిగా పరిగణింపబడు గ్రీకు బాలికను, బౌద్ధమతావలంబినిని. అన్నివిధాలా అనర్హురాలిని. నీవు తరతరాలకు యుగయుగాలకు శాశ్వతకీర్తితో ప్రకా

శించే కవివి. విజ్ఞురాలైన ప్రతిస్త్రీ నీకు ఆత్మార్పణంచేసుకో గలుగుతుంది. నీ కంత అధీరత యెందుకేర్పడింది కవీ?

కవి:- ఇతరస్త్రీలవిషయం నా కనవసరం. నా వూర్వశియే నా సర్వస్వం. నీ అంతర్ధానంవలన నేను పిచ్చివాడినై పోయాను. ఇంకా కొన్నాళ్ళు కనిపించకపోతే యేమైపోయే వాడినో చెప్పలేను.

ప్రభ:- కవీ, నురీ స్వార్థివికాబోకు. దేశగాయకుడివి, కవివి. నీద్వారా దేశము యేమేమో ఆశిస్తున్నది. మీరు వ్రాసిన యీ 'ఊర్వశీవియోగం' చూసి ధర్మరక్షిత్ చాలా ప్రశంసించాడు. సాకేతలోని గ్రీకులంతా మీ నాటకాన్ని శ్లాఘిస్తున్నారు. ఒకస్త్రీప్రేమలో మీ అమూల్యజీవితాన్ని అంధకారమయంచేయకండి.

కవి:- స్వార్థము మానవునిస్వభావసిద్ధసొత్తు. కృత్రిమ ప్రేరణలతో దాన్నుంచి విముక్తుడవుట అన్నివేళలా సాధ్యం గాదు. పేరుప్రతిష్టలు దేశోద్ధారణ పొందబోయే సుఖ సౌఖ్యాలను త్యజించుటకు మత్తుమందులాంటివి. ఈలోకము లోని సర్వముకంటె నా వూర్వశియే నాకు విశిష్టమైంది. నా వూర్వశిప్రేమే నాకు సర్వస్వము.

ప్రభ:- (ఆయనహస్తాన్ని తనచేతులలోకి తీసుకుని నిమురుతూ) అబ్బ! కవీ, నిన్ను నీవు మర్చిపోకు. నీకు నాయెడల యింత గాఢప్రేమ వుత్పన్నమవుట నా అదృష్టం. నీవు నాకు అందరానివాడివిగా వూహించి, ఆత్మవ్యధచెందాను. నేడు నీముందు విచిత్రానుభూతి పొందుతున్నాను. ఇది నా అదృష్టము. కాని, నేను దీని యిదేరూపంలో పొందలేను.

నీవు ప్రభయొక్క ప్రేమోపాసక అశ్వఘోష్‌ను దేశము యొక్క మహాకవి అశ్వఘోష్‌నుంచి వేరుచేయాలి. ప్రభ ప్రియుడు అశ్వఘోష్ ద్వారా నీవు యేమయినా అనిపించి, చేయించుకొని యుగమహాకవి అశ్వఘోష్ ద్వారా యింతకు ముందన్నమాటలు అనిపిస్తే నేను సహించలేను.

కవి:- (వినయునివలె) సరే, నీవు చెప్పినట్లే చేస్తాను.

ప్రభ:- (తృప్తితో పులకితురాలై) నా కింత అదృష్టం కలుగుతుందని యెన్నడూ అనుకోలేదు కవీ.

కవి:- నీద్వారా నా కవిత్వానికి నూతనవరం దొరికింది. నా కవిత్వంలోని నూతనప్రేరణా, స్ఫూర్తి నీద్వారానే సంప్రాప్తమయినవి. ఈ ఊర్వశీవియోగంలోని పాటలు నీ ప్రేరణప్రదానాలే. నీ వ్యథాప్రతిబింబమే యీ ఊర్వశీ వియోగము. ఈరూపంలో యిది మనదేశ ప్రథమనాటకముగా రూపొందింది ప్రభా. అనభిజ్ఞతతో నీమనస్సుకు కష్టంకలిగించినందుకు క్షమించు.

ప్రభ వ్యాకులపాటుతో ఆయనచుబుకాన్ని పుణుకుతూ, బరువైనకంఠంతో "అదేమిటి కవీ! నన్ను క్షమాపణ కోరవచ్చునా? మీరు వుత్తమకులీనులు" అన్నది. ఆమె హస్తాన్నిబట్టి చుంబిస్తూ మందహాసాలొలికిస్తూ "నీవు పదే పదే కులంపేరుతో నన్ను చిన్నబుచ్చకు ప్రభా" అన్నాడు.

సాకేతలో గీతనాట్యశాలలో 'ఊర్వశీవియోగము అనేకమారులు ప్రదర్శింపబడింది. అందరి ప్రశంసలనుపొంది, హృదయాలకు హత్తుకుపోయింది. రచనాశైలి, పాటలకూర్పు అత్యద్భుతంగావుందన్నారు. పాత్రధారులఅభినయం అంత

కంటె బాగా కుదిరిందన్నారు. ఈ ఊర్వశీవియోగం సాకేత ప్రజలలోనేగాక, కోసలహద్దులు దాటి ఉజ్జయిని, దశపురీ, సుప్పారక్ భరుకచ్ఛ, శాకల, తక్షశిల మొదలగు మహానగరాల ప్రజలలోగూడా సంచలనాన్ని కలిగించింది. యవనులు విశేషంగాగల యీ అన్నిపట్టణాలలోను గ్రీకునాట్యశాలలో ప్రదర్శింపబడి రాజా మహారాజాల, వ్యాపారస్తుల మన్ననలను పొందింది.

ఈ ఊర్వశీవియోగనాటకముతోపాటు అశ్వఘోష్‌కు ప్రత్యేకించి గ్రీకులలో ప్రముఖస్థానం యేర్పడింది. గ్రీకు దేశమునుంచి వచ్చిన నాటకప్రియులయిన గ్రీకులు ప్రత్యేకించి అశ్వఘోష్‌ను పరామర్శచేసి, సత్కారరూపంలో బహూకరించి, వుత్సాహితునిచేసి వెళుతున్నారు. బౌద్ధమతంలోను నాటకప్రదర్శనలోను గ్రీకుయువకులకు యువతులకు వున్న శ్రద్ధాభక్తులు వుత్సాహము విశేషమయినవి. అశ్వఘోష్ తన ప్రథమప్రయత్నమయిన ఊర్వశీవియోగ నాటకముతో యవనులప్రశంసాపాత్రుడైనాడు. రానురాను హిందువులకంటె యవనులే సన్నిహితులైనట్లు అనుభూతి నొందుతున్నాడు. అశ్వఘోష్ తరచుగా ప్రభయింటికెళ్ళి ఆతిథ్యాలనుకూడా పొందుతున్నాడు. ప్రభతలిదండ్రులకు అశ్వఘోష్‌విషయంలో సదభిప్రాయాలుండుటేగాక, తమ బిడ్డకు తగిన వరుడనే నిర్ణయంతో అడుగడుగున తమఅంతరాత్మలోని సానుభూతిముద్రలను వేస్తూనేవున్నారు. అశ్వఘోష్‌కు కావలసిన ప్రతిది ప్రభద్వారా సంప్రాప్తమవుతున్నది.

యవన యువతీయువకులతో కలిసి, డ్రామా వేయుట, తానే వ్రాసి, తనుకూడా స్వయంగా అభినయించుట, అందలి ముఖ్యపాత్రధారిణియైన ప్రభను ప్రేమించుట, రేయింబవలు ఆమెనంటి తిరుగుట, ఆమెయింట్లోనే విందారగించుట మొదలగువిషయాలు అశ్వఘోష్‌తలిదండ్రులకు తెలిసినపుడు చింతితులైనారు. క్రుద్ధుడైన తండ్రి మందలించు భారాన్ని సువర్ణాక్షి కప్పగించాడు.

# వజ్రచ్ఛేదికోపనిషత్

భోజనానంతరం అశ్వఘోష్‌ను అనునయంగా దగ్గరకు పిలిచి "నాయనా అశ్వం, నీవు నాటకాలలో తిరిగితే తిరిగావుగాని, ఆ యవనరమణులతో స్నేహంచేయబోకు. మనము వుచ్ఛశ్రేణికిచెందిన బ్రాహ్మణులము. అపవాదములకు గురికావట మంత మంచిదిగాదు" అన్నది సువర్ణాక్షి. అశ్వఘోష్ పూరించుకున్న ధైర్యంతో "అమ్మా, నీతో వున్న యదార్థాన్ని చెప్పుట మంచిది. సాహిత్యంలో అభినయరూపంలోని వినోదఘట్టాన్ని సృష్టించినవారు గ్రీకులు. రంగస్థలఅభినయం వారిద్వారానే మనదేశంలో ప్రదర్శితమవుతున్నది. వారివినయం, కలుపుగోలుతనం, వుత్సాహము మన హిందువులలో అంతగా కనిపించవు. వారితో కలిసినందువలన నాలోనూతనోత్సాహము, నూతనస్ఫూర్తికలుగుతున్నవి—" అని అస్పష్టరూపంలో నతసతలాడుతూ ఆగి

పోయాడు. సువర్ణాక్షి ఆయనశిరస్సుమీద చేయివేసి నిము రుతూ "నీవు నాటకంలో వారితో పాల్గొంటే, అపరాధ మేమీలేదు. కాని నీవు యెవరో ఒక యౌవనయువతితో సాంపర్క్యం పెంచుతున్నట్లు మీ నాన్నగారి కెవరో చెప్పారు నాయనా" అన్నది. "అవునమ్మా, నాన్నగారు విన్నదంతా యదార్థమే. ఆమెపేరు ప్రభ. బౌద్ధభిక్షువు శుభగుప్తుని దత్తమిత్రుని పుత్రిక. ఆమెను నేను వివాహ మాడుటకు నిర్ణయించుకున్నానమ్మా" అన్నాడు. ఆమె ఆత్రతతో అతనిశిరస్సును తనవక్షస్థలంమీద అదుముకుంటూ చుబుకాన్ని పుణుకుతూ గాద్గదికంగా "అలాంటిమాట లన బోకు నాయనా. వారు యవనులు. మనము బ్రాహ్మణు లము. యేడుతరాల పరిశీలనతోగాని మనము కన్యను స్వీక రించము. వేదశాస్త్రము మనకు శిరోధార్యము నాయనా. మనరుషులు వచించిన నీతినియమాలు మనజీవితాలకు నిఘం టువులు. వాటికి భిన్నమైనవాటిని ఆలోచించిన దోషము సంభవిస్తుంది" అన్నది.

వేదశాస్త్రాలను క్షుణ్ణంగా అధ్యయనంచేసిన అశ్వ ఘోష్ తల్లిమాటలతో పాలుబోనివాడై నిరుత్తరుడై తిరిగి శాస్త్రపరిశోధనచేశాడు. తత్ఫలితంగా ప్రాచీనరుషులు విప క్షతారహితంగా ప్రవర్తించిన వందలప్రమాణికాలను తల్లికి విశదంచేశాడు. ఆ నిర్వచనలోని అనేకభాగాలే నేటి 'వజ్ర శ్చేదికోపనిషత్'. కాని తల్లిమాటలన్నిటిని విని విసగడతో "ఇవన్నీ నిజమే కావచ్చు. కాని నేటి బ్రాహ్మణులు ప్రాచీన ఆచారాలను విశ్వసించరు, ఆదరించరు. అందువలన వీటితో

ప్రయోజనం లేదు" అన్నది. విభ్రాంతమనస్కుడై "ఎవరిని పూజిస్తున్నామో యెవరిఅడుగుజాడలే శరణ్యమనుకుంటున్నామో వారిద్వారా ప్రత్యక్షప్రమాణికాలైనవన్నీ నిరర్థకాలేనా అమ్మా?" అన్నాడు. "ఇపుడున్నఆచారాలను అతిక్రమిస్తే సంఘము క్షమించదు నాయనా" అన్నది. "ఎవరో ఒకరు అవసరాన్నిబట్టి అతిక్రమించుటద్వారానే ఆచారాలలో నూతనత్వం యెప్పటికప్పుడు కలిగివుంటవి గదా!" అన్నాడు. "అది అప్రస్తుతమయినవిషయం అశ్వం. అందరూ అలా అతిక్రమించి సంఘాన్ని సంతృప్తిపరచుట సాధ్యము యేపనిగాదు" అన్నది. వీరోచితమైనకంఠంతో "నీవు అసాధ్యమనుకునేది సాధ్యమని ఋజువుచేసుకుని ఆచారాలతో మరో నూతనఅంతస్తుని చూపుతా నమ్మా" అంటాడు.

అశ్వఘోష్ తల్లిని సంతృప్తిపరచుటకుచేసిన విశ్వప్రయత్నాలు విఫలమయినవి. కాని ప్రభ లేకుండా తను జీవించుటే దుస్సాధ్యమని విన్నపుడు వివశురాలై పుత్ర వాత్సల్యమోహంతో అశ్వఘోష్అభిప్రాయాలకు ఆమోదముద్రలను వేసింది. ఉత్సాహితుడైన అశ్వఘోష్ వెనువెంటనే ప్రభను తనతల్లి సువర్ణాక్షిముందుకు తోడుకొచ్చాడు. ప్రభ ఆనందబాష్పభరితనయనాలతో హస్తద్వయాన్నిజోడించి ఆమెపాదపద్మాలపైవాలిపోయింది. ఆమెసౌందర్యాన్ని, వినయవిధేయతలను గాంచిన సువర్ణాక్షి ముగ్ధురాలై అపోహతో పొరపాటుచేసినట్లు నొచ్చుకుంటూ, ప్రభను లేవనెత్తి ఆశీర్వదించి హృదయానికిహత్తుకున్నది.

అశ్వఘోష్‌తండ్రి మరింత చీకాకుతో క్రుద్ధుడైనాడు. ఏకైకసంతానమయిన అశ్వఘోష్‌ను మందలించలేకపోతున్నాడు. అంతర్గతంగా అణచుకున్న ఆవేశంతో "అశ్వం, నీవుచేస్తున్నకార్యం యెవరూ సహించరానిది. మనవంశం తరతరాలుగా ఖ్యాతితోవస్తున్నది. నీవు ఆలోచనారహితుడవై అంధత్వంలో ఒక మ్లేచ్ఛకన్య వివాహమాడితే, మన వంశభావిసంతానమంతా సంకరమైకూర్చుంటుంది. నీ వెర్రి మత్తుతో మనవంశమే సర్వనాశనమైపోవుట యెంత శోచనీయమో స్థిమితహృదయంతో ఆలోచించు" అన్నాడు. ప్రభను పెడనాడుట తన కసంభవమైనవిషయమని అశ్వఘోష్ నిర్భీతిగా ప్రకటించినపుడు శాస్త్రిహృషోత్తముడు చేయునదిలేక, ప్రభతలిదండ్రులముందు ప్రస్తావించాడు. అందు తమకుపరిమేయమేమీ లేదని, వారిసినిరోధించుటకూడా తమకు సాధ్యముగానివిషయమని విన్నవించినపుడు వివశుడై ప్రభనే ప్రత్యేకంగా కలిసి యెన్నోబోధించాడు. నిష్ప్రయోజనమై, అధీనతతో తనపగడీని దీసి ఆమెముందుంచి యాచించినపుడు, తను అశ్వఘోష్‌ను మోసగింపజాలనని, ఆయనకోరినరీతిని అశ్వఘోష్‌కు విన్నవిస్తానని ప్రభ చెప్పింది.

# క్షీరనీరసమ్మేళనం

క్షీరము నీరము యేకమయినట్లు ప్రభాశ్వఘోషులు యేకమయి, యీలోకంలోని విభేదాలను కల్మషాలను కార్పణ్యాలను విస్మరించి, సరయూతీరాల్లో, పుష్పోద్యాన వనంలోను, గ్రీకునాట్యశాలలోను, నృత్యశాలలోను, బౌద్ధ విహారాలలోను తిరుగుతూ పరవశులై కాలంగడుపుతున్నారు. ఒకరినిచూసి ఒకరు తన్మయులై మత్తుతో ముగ్ధులవుతున్నారు. ప్రభ సూర్యప్రభవలె అశ్వఘోష్‌హృదయపద్మాన్ని వికసింపజేస్తున్నది. చంద్రప్రకాశముతో పాలప్రవాహితమై ప్రభసిస్తున్నట్లున్న నిర్మల శీతలనదీతీరాన గంటలతరబడి వుల్లాసాలతో సరససల్లాపాలతో కాలంగడుపుతున్నారు. నదీ ధారప్రక్కగా కూర్చున్న ప్రభ తనహస్తంతో జలాన్ని చిలుకుతున్నది. నీటిమీద పడుతున్న ఆమెఛాయ కంపనలు చెందుతూ చిత్రపటంలోని ఛాయవలె శశిధరునికిరణప్రసారంలో మెరుస్తున్న ప్రభ లావణ్యాన్ని అద్వితీయంచేస్తున్నది. ప్రక్కగా ఇసుకమీద పవళించి ప్రభచెరగునుబట్టి నిమురుతున్న అశ్వఘోషును ఆ దృశ్యం చలింపజేస్తున్నది. రాగరంజితమై హృదయం పొంగింది. పులకితపలుకులతో "ప్రభా, నీవు నా కవనానివి. నీద్వారా పొందిన ప్రేరణతోనే 'ఊర్వశీవియోగం' వ్రాశాను. నీ, యీ రూపరాశి నాచేత యెన్నో సౌందర్యకావ్యాలను వ్రాయిస్తుంది. అంతర్గతప్రభాసితకవనము బాహ్యంగా వుండదనుకున్నాను. కాని బాహ్యప్రతిబింబమే అంతర్గతంగా వుంటుందని నేడు

నీద్వారా తెలుసుకుంటున్నాను." అన్నాడు. ఆమె తన చెంగును పట్టివున్న హస్తాన్ని బట్టి బలంగా వత్తుతూ, నెమ్మదిగా ఆయనప్రక్క యిసుకమీద వరిగిపోయింది. మృదువైన ఆమెశిరోజాలు యిసుకలో పొర్లటాన్ని సహింపజాలక ఆమెశిరస్సు బలంగా పైకెత్తి తన వక్షస్సుమీద వుంచి, శిరోజాలను వ్రేళ్ళతో దువ్వుతూ అంటిన యిసుకను రాల్చుతున్నాడు. తనశిరస్సును ఆయనహృదయంమీదనే వుంచి, ఆయనముఖంవైపుకు తిరిగి మధురస్వరంలో నిశ్శబ్ద వాతావరణాన్ని భగ్నంచేస్తూ "ఇంకేను నూతనప్రవాహాలు వుత్పన్నమవుతున్నవో చెప్పండి! బాహ్యంగాలేనిది అంతర్గతంగా ప్రతిబింబించు టెలాజరుగుతుంది, కవిగారు? కావ్యవస్తువు, సాకారసౌందర్యప్రేరణలేకుండా పూర్ణత్వాన్ని పొందజాలదు. నామనస్సులోకూడా నీయుక్క కావ్యమయ చిత్రణ జరుగుతూనేవున్నది గాని, అది వినిపించలేని ఆత్మానందాన్ని పొందు మూనచిత్రం. కవనంలో వినిపించగల ఆ మహత్తరశక్తి అందరకు లభ్యంగాదు. ఆ శక్తి పొందిన నీవు ధన్యుడవు కవి!" అన్నది. "అందుకుకాదు నేను ధన్యుణ్ణి, నిన్ను పొందినందుకు ప్రభా" అన్నాడు.

ప్రభ :- నన్ను అందరానిదానిగా సృష్టిస్తూ మిమ్ము మీరు న్యూనతపరచుకొనుట నాకు సంతోషాన్ని కల్పించదు.

కవి :- న్యూనతాలేదు, సృష్టీలేదు. వున్న యదార్థాన్ని విన్నవిస్తున్నాను.

ప్రభ :- నేను మ్లేచ్ఛురాలిని, బౌద్ధమతావలంబినిని. మీరు వుచ్ఛ శ్రేణికి చెందిన బ్రాహ్మణులు.

కవి :- నీవు యెందుకని మ్లేచ్ఛురాలనో చెప్పు?

ప్రభ :- మీ హిందువులు యవనులందరిని అంటున్నారు గనుక.

కవి :- మీరు యవనులయినా, బౌద్ధమతాన్ని స్వీకరించారుగదా!

ప్రభ :- అయినా, మమ్మ మ్లేచ్ఛులుగానే భావిస్తారు మీరు.

కవి :- అబ్బ! నన్ను కూడా వారిలో కలిపి బాధించకు. మీ దేశస్థులంతా బౌద్ధమతమే స్వీకరించారెందుకని?

ప్రభ :- ఈదేశపు మతాలన్నిటిలో బౌద్ధధర్మమే ఉదారమైంది. మా ప్రవృత్తులకు ప్రకృతిసిద్ధ స్వాతంత్రతలకు అనుకూలమైందిగనుక. అంతేగాక, మా గ్రీకు దేశములో కూడా పరిచయమైన మత మిది.

కవి :- మాదేశములోని బౌద్ధమతం మీ గ్రీకుదేశములో వున్నదా?

ప్రభ :- అవును. మన విజయోత్సవంనాటిసభలో వున్న ధర్మరక్షిత్ భిక్షువు గుర్తున్నాడుగదూ. వారు యిక్కడికొచ్చి భిక్షువుగా లేదు. అలసందా (అలగ్జాండ్రియా)లో భిక్షువిహారంలో భిక్షువులై ఆతరువాతనే యిక్కడికొచ్చారు. వారు యవన వేదాంతంలోను బౌద్ధతత్వశాస్త్రంలోను అఖండపండితులు. ఆరోజు వారితోపాటు వచ్చిన మహాస్థవిరధర్మసేన్ సా[illegible]దారామాలన్నిటికి పెద్ద.

ఆయన జన్మతః చండాలజాతిలోనివాడు. కాని, గొప్ప వుదారుడు, సశ్శీలసంపన్నుడు, సేవాతత్పరుడు, శాంతనిధి, సదా ప్రసన్నవదనంతో వుంటాడు. నిష్టనీమాలనిధి. ఆయన అందరికంటెముందు లేచి కాలకారామమంతా వూడ్చి, పరిశుభ్రంచేస్తుంటాడు. తన భిక్షాపాత్రనుంచి ముందు అందరకు పెట్టిగాని, తాను భుజించడు. సాకేతభిక్షువులందరూ వారియెదుటపడినపుడు మోకరిల్లి శిరస్సులు ఆయనపాదాల మీద వుంచి, ప్రణామాలుసలుపుతుంటారు. బౌద్ధభిక్షువులందరూ కలిసి సహపంక్తిలో భోజనాదులుచేస్తుంటారు. సంఘములో అందరూ సమానులే. భిక్షువుసంఘము సాగరములాంటిదని బుద్ధభగవానుడు వర్ణించాడు. భిక్షుసంఘములో చేరువారంతా సాగరంలోచేరు నదులవలె నామరూపాలను విడచి——

కవి :- (మధ్యలోనే అందుకుని) నిజంగా బౌద్ధమతమే సాగరంలాంటిది. సర్వమానవ సమానత్వ సౌభ్రాతృత్వ నిలయము. ఈదేశములో జనించి ప్రచలితమైన సర్వోత్కృష్టమైన యీ బౌద్ధమతాన్ని హిందూపాఖండులంతా నిరసిస్తున్నారంటే తెలియనిమూర్ఖత్వం. హిందూమతానికి బహుముఖాలుంటవి. ఎక్కడికక్కడ శక్తివంతులైన పండితులు అవుసరానికిఅనుగుణంగా నడిచి, వాటినే పామరులశిరస్సున శిరోధార్యములుగా చిత్రిస్తారు. నేను యెంతో పరిశ్రమచేసి, వేదశాస్త్రాలను అధ్యయనంచేశాను. అందలి ఋషులవచనాలను ప్రమాణికంగా చూపినపుడు, రివాజుగాదన్నారు. ఆదినుంచి వచ్చిన ఆచారాల ~ నిశదంచేసి, యెప్పటికప్పుడు

మారుతుండుటను చూపినపుడు, ప్రస్తుతరివాజులే ప్రమాణికాలన్నారు. బలహీనులమీద, అమాయకులమీద, దరిద్రులమీదా యీ హిందూమతంపేరుతో భూతం సవారీ చేస్తుంటుంది.

ప్రభ :- నాద్వారా మీరు స్వమతవిద్వేషులవుతున్నారేమోనని భయంగావుంది కవీ!

కవి :- అందుకు గర్వించాలి ప్రభా. నీవు నాకవిత్వానికి నూత్నప్రేరణనిచ్చి జీవాన్నికల్పించావు. నాహృదయంలోని అంతర్దృష్టికికూడా నూతనప్రేరణను జీవాన్ని కల్పించుట అదృష్టంగా భావిస్తున్నాను ప్రభా. నేను వేదశాస్త్రాలు సంపూర్ణంగా చదువుటతోనే జ్ఞానసంపత్తినంతా పొందినట్లు భావించాను. కాని, జ్ఞానం హిందూమతశాస్త్రాలలోవున్నదే గాదనీ, అంతకుమించి మహావిశాలమైందనీ నీద్వారా తెలుసుకున్నాను.

ప్రభ :- అన్ని 'సత్ఫలితాలకు సుయోగాలకు నన్నే కర్తగా చిత్రించకు కవిమహాశయా, నేను స్త్రీని.

కవి :- స్త్రీఅయినంతమాత్రాన యెవరినైనా హీనంగాచూస్తే వారిని నేను ఘృణీకరించుకుంటాను. యువనులంతా హిందూమతాన్ని స్వీకరించకుండా బౌద్ధమతాన్ని స్వీకరించినందుకు నా మనస్సెపు డెంతో ఆనందపడుతున్నది.

# మనస్సు చెదరిన భిక్షువు

మిత్రానంద్ సాకేతలోని భిక్షుసంఘాలన్నిటితోను పరిచయము పొందాడు. పొందుతున్న ఆదరముతో వుత్సాహితుడై భిక్షువుల కార్యక్రమములో ముందంజ వేస్తున్నాడు. కాని అలసందాలోని తన భిక్షుసంఘవ్యవహారాలు, అనివార్యరూపంలో అనాశ్రయస్థితిలోని దత్తమిత్రుడు, ప్రభల కొరకు తోడుగా బయలుదేరినవిధము, మార్గమధ్యంలోని ఘటనలు, దొంగలబాధ, ప్రభకు తానుచేసిన సపర్యలు, ఆమె అనేకసందర్భాలలో అన్నమాటలు, లాలింపులు, ఆమెస్వాభావికప్రేమతోగూడిన సరళత, సుస్పష్టమైన ఆమె మధురవాణి ఆయనస్మృతిపథంలో వరుసగా దొర్లుతున్నవి. స్మృతులతో వేడెక్కిన మనస్సుతో చీకాకుచెంది, పాలుపోక క్రమములేని ఆవిషయాలనే స్మరిస్తూ, వేడినిట్టూర్పులు విడుస్తుంటాడు. ఆయన మనస్సును యెంత కట్టుదిట్టంచేసుకున్నా, కార్యక్రమాలలో లీనమై, వాటిని మర్చిపోవాలని యెంత ప్రయత్నించినా, తిరిగి అవే మనస్సులో మెదలుతుంటవి, కనులముందు కనిపిస్తుంటవి. నిష్టలో నియమంలో లక్ష్యాలలో దీక్షావ్రతిగా ప్రతీతిజెందిన తాను నేడు అతి స్వల్పవిషయాలలో పట్టుదలలన్నీ పటాపంచలై, పరాజితుడై పోతున్నాడు. ప్రకృతిసిద్ధమైన ప్రవృత్తులముందు పట్టుదలలలో కృత్రిమరూపంలో నిర్మించుకున్న మానవమార్గాలు పటాపంచలయిపోతవన్న ప్రభమాటలు కర్ణరంధ్రాలలో గింగురుపెడుతున్నవి. తనపరాజయము ప్రభవిజయము అని

దీనత చెంది, తిరిగి ఇది నా పరాజయంగాదు, ప్రకృతిసిద్ధమైన ప్రవృత్తులవిజయమనుకుంటూ సందిగ్ధమనస్కుడై చంచలత్వంతో, ఆత్మలో జరుగుచున్న ద్వంద్వాత్మకసంఘర్షణతో వికలం చెందుతున్నాడు. తాను నిర్వహిస్తున్న సంఘ కార్యక్రమాలు, నియమాలు అన్నీ యంత్రరూపంలో అసభిజ్ఞునివలె చేస్తున్నాడు. అతని ప్రవృత్తులలోని ద్వంద్వవిరుద్ధాలు గంభీరరూపందాల్చి అనుక్షణము విషూ౦ఖతలో ముంచివేస్తున్నవి. ఎవరినో చూడాలనిపిస్తుంది. ఏమేమో అడగాలని దృఢసంకల్పంచేసుకుంటాడు. క్షణంలో సూర్య కిరణముసోకిన మంచు తెరవలె తొలగిపోతుంటవి. భిక్షాపాత్ర హస్తములందుంచుకుని యెక్కడికో బయలుదేరి మరెక్కడికో ఆదమరపుగా జేరి, చూసి, అది ప్రభయిల్లుగా గ్రహించి, పొరపాటుకు నొచ్చుకుంటూ అధరాలునొక్కుకుంటూ వెనుదిరుగుతాడు. లోపలినుంచి వచ్చిన దత్తమిత్రుని పిలుపు విన్నపుడు ఆగిపోయి నిరుత్తరుడై వెనుదిరిగి ఆయన్ను సమీపిస్తాడు. ఆయనిచ్చు హృదయపూర్వక సత్కారాల నందుకొంటాడు. అస్వాధీనంలోని అతని దృక్కులు యెవరికొరకో వెదుకుతుంటవి. ఆ దృక్కులు అంతములో అధీరత చెందుతుంటవి. "పరధ్యానలోనున్నావు లాగుం దేమిటి మిత్రానంద్" అని దత్తమిత్రుడు హెచ్చరించినపుడు వెలవెలబోతూ, తేలిపోతున్న శుష్కనవ్వును ప్రదర్శిస్తాడు. కొన్నిసమయాలందు వివశుడై ప్రభవిషయం తెలుసుకో ప్రయత్నిస్తాడు. ఆమె నాట్యశాలకో, సరయూతీరానికో వెళ్ళిందని తెలిసినపుడు, తన కది అప్రస్తుతవిషయ

మని, ఆమెనుగురించి తను ఆదుర్దాచెందుట అనవసరమని, ఆమెఅవసరము తనకేమిటని మనస్సులోనే తలపోస్తుంటాడు. ఆమె అశ్వఘోష్‌తోకలిసి వెళ్ళిందని విన్నపుడు హృదయ మెందుకో దడదడ కొట్టుకుంటుంది. గొంతుకలోని తరళం ఆరిపోయి, పిడచగడుతుంది. ఊపిరిసలుపక వుక్కిరిబిక్కిరి అవుతుంది. నైరాశ్యతతోగూడిన వేడినిట్టూర్పులు బయ ల్పడతవి. తన కేదో జరుగరాని అపకారంజరిగినట్లు, తానే నిర్లక్ష్యంతో నిధిని కోల్పోయినట్లు, జీవితమే నిరర్థకమైనట్లు భారమైనట్లు అంతరాత్మ వాపోతుంటుంది. నిరాశలలోని ఆఖరినిట్టూర్పుగా దీర్ఘశ్వాసను విడుస్తూ, ఆమెవచ్చువరకు వుండి చూసిపోవాలని మొండికేస్తాడు. అర్భకునివలె ప్రభను చూడాలని బెంగగొన్నట్లు దత్తమిత్రునియెదుట వుండి పోతాడు.

దత్తమిత్రునికి మిశ్రానంద్ యెడల అత్యధిక అను రాగము ఆదరము లున్నవి. అలసందాలో జబ్బునపడి, దారి తెన్నులుగానని నిరాశ్రయస్థితిలోనున్న తనను తనబిడ్డను ఉద్ధరించిన వుదారనిధి, త్యాగమూర్తియైన మిశ్రానంద్ దత్త మిత్రునిదృష్టిలో అపర బుద్ధభగవానుడు. అందుకే మిశ్రా నంద్ కనిపించినపుడు దత్తమిత్రునిశరీరమంతా అనురా గంతో ఆర్ద్రమైపోతుంది. కాని మిశ్రానందలో నూతనంగా పుద్భవించిన విరుద్ధధ్వనులు తెలియవు.

సంధ్యాసమయ మది. శ్రావణమాసపు వర్షపుహోరు ప్రతిధ్వనిస్తున్నది. కారుమేఘాలు బడబడ గర్జనలుసలుపు తున్నవి. మబ్బులతో అంధకారం ఆవరించినట్లయింది.

దొడ్లోని పుష్పగుచ్ఛాలు జలకమాడుతున్నవి. మట్టిమిద్దె నుంచి కారుతున్న ధారలు గుడగుడధ్వనులను కల్పిస్తున్నవి. రోడ్లు నీటితోనిండి, తపతప సెలయేరులవలె పరువులెడు తున్నవి. రోడ్డుప్రక్క పవళించిన ఒంటె నేత్రాలుమూసి నెమరువేస్తున్నది. ఎందునిమిత్తమో నాట్యశాలనుంచి వచ్చిన ప్రభ యింటిలోనే చిక్కుకుని, హాలులో అటూ యిటూ తిరుగుతూన్న ఆమెలోని ఆదుర్దా నెమ్మదిగా తేలిక పడిపోతున్నది. జాతకకథను సతీమణికి వినిపిస్తున్న దత్త మిత్రుడు వర్షపుహోరుకు భూర్జరపత్రములకట్ట కొయ్య పెట్టెలో పెట్టి ప్రభను గాంచి, మందహాసంతో "ఏమి టమ్మా, అలా కాలుగాలినపిల్లివలె తిరుగుతున్నావు?" అంటూ హాలులోకొచ్చి బల్లమీద ఆసీనుడయినాడు. ప్రభ నిరాశతో చల్లబడినదానివలె "ఏమీలేదు నాన్నా" అంటూ కిటికీగుండా బయటివైపు చూస్తున్నది. "ఈరోజుకు మీ నాటకప్రదర్శన బందయినట్లులే ప్రభా, యిలా వచ్చి కూర్చో" అన్నాడు దత్తమిత్రుడు. ఆమె తెచ్చిపెట్టుకున్న నవ్వును ప్రదర్శిస్తూ, వెళ్ళి తండ్రిప్రక్కన కూర్చున్నది.

దత్తమిత్రుడు :- ఇంటివద్ద క్షణంకూడా వుండవెందు కమ్మా?

ప్రభ :- ఎందుకుండటంలేదు నాన్నా, క్రొత్తనాట కంలో నేను ప్రధానపాత్ర వేయక తప్పలేదు. ఆ అభినయ అభ్యాసంకొరకు నాట్యశాలలోనే యెక్కువగా వుండాల్సి వస్తున్నది.

దత్తమిత్రుడు :- మిత్రానంద్ యెన్నోమాసులు

వచ్చిపోయాడు. పావం! నిన్నుచూడాలని తహతహలాడు తున్నాడు.

ప్రభ :- (బిత్తరపోతున్న దృక్కులతో వెలవెల బోతూ) అవును నాన్నా, వారినిచూచి చాలారోజు లయింది.

దత్తమిత్రుడు :- చాలా చిక్కిపోయాడు. పూర్తిగా మారిపోయాడు. సదా ఆనందంగా వుండే మిత్రానంద్ యిపుడు వుదాసీనతతో జాలిగొల్పుతున్నాడు. నిన్నుచూడా లని పదేపదే వాంఛిస్తున్నాడు. మనవల్లనే యీదేశానికి వచ్చాడు. అతన్నిచూస్తుంటే నా మన స్సెందుకో నొచ్చు కుంటున్నది ప్రభా. తల్లినుంచి బిడ్డను వేరుచేసినట్లు, ఆనంద్‌ను తనఆధిపత్యంలోనున్న భిక్షుసంఘాన్నుంచి స్వదే శమునుంచి వేరుచేశాము. అతను మనకుచేసిన ఉపకారం ఏమిచేసినా తీరనిది. ఒకనాడు ఆయన్ను, ఆయనవైద్యవిధా నాన్ని తుస్కారంచేశావు. కాని, ఆయనవిధానంతోను, ఆయనసహాయంతోనే మనము వుద్ధరింపబడ్డాము. (అంటుం డగా ఆయనకంఠం బరువెక్కింది.)

ప్రభ :- (మతిచెదరి, జరిగినదంతా మర్చిపోయి, నూతనజీవిగా సంచరిస్తూ నూతనాధ్యాయంలోనో నూతన లోకంలోనో సంచరిస్తూ, నూతనానుభూతినొందుతున్న వ్యక్తికి ఆకస్మికంగా ఒక్కమాటుగా మతికుదిరి, జరిగినవన్నీ స్మృతిలో మెదిలి భయభీతులు, ఆశ్చర్యంలో మునిగినదాని రీతి ప్రభ గాభరాను అణచుకుంటూ) అవును నాన్నా, ఆసమయంలో వారుచేసింది అసామాన్యమైంది. వారి దేశ

ములో యిష్టంతోనే వుండిపోయాడుగదా. మిత్రానంద్ యొక్కడిభిక్షువుసంఘములోనైనా ప్రముఖస్థానాన్ని పొందు తాడు. చింతితవదనంతో యెందుకుంటున్నాడు నాన్నా ?

దత్తమిత్రుడు:- వచ్చినక్రొత్తలోనే వుల్లాసంగా వున్నాడు. ఇపుడు అకారణంగా ఆయనముఖంలో వుదాసీనత కనిపిస్తున్నది ప్రభా, దొంగలు ముట్టడించినరోజు కూడా ఆయనముఖంలో యింత అధీరత చూడలేదు.

తండ్రినోట దొంగలముట్టడివిషయం విన్నపుడు ఆమె హృదయం కంపించింది. శరీరమంతా గగుర్పాటు చెందింది. ఆనాటి ఆ దారుణదృశ్యమంతా కనులముందు నృత్యంసలుప సాగింది. వారి భీకరరూపములు, దౌర్జన్యాలు, తనకు స్పృహ దప్పుట, యీడ్చుకెళ్ళినపుడు తనకాళ్ళకుతగిలిన గాయాలు, రక్తస్రావము, దేవతాప్రతినిధిలాంటి భిక్షువు తనకు సపర్యలు చేయుట, తనద్వారా ఆయనశిరస్సు చిట్లి రుధిరస్రవంతులు కారుతున్నపుడు ఆయనముఖంలో గనిపించిన స్నిగ్ధరూపం లోని సహనశాంతులప్రకాశము మొదలగునవన్నీ ఒక్కటొక్కటిగా ఆమెమనస్సులో దొర్లుతున్నవి. ఆవాలలో జోవాలు గలిసినట్లు ఆ దొర్లుతున్న దొంతరులలో మరెవరి రూపమో మిళిమితమై, వలికిన సిరామరకలలోనున్న చిత్ర పటమువలె ప్రకటితమవుచున్నది. ఆ దొర్లిపోతున్న చిత్రాలను చూస్తున్నకొద్దీ ప్రభహృదయం అవ్యక్తమైనఆ వేదనలో మునకలు వేస్తున్నది. ఆనందుని చూడాలని మనస్సు ఆందోళనపడుతున్నది.

ప్రాతఃసమయ మది. రెండురోజుల అనంతరం ప్రభా

కరుని వెలుగు కోమలరూపంలో ప్రసారితమవుతున్నది. తెరపి లేని వర్ష బాధతో ముకుళించుకుపోయిన జీవరాసులు విప్పారు తున్నవి. వర్షము ఆగిపోవుట నిర్బంధవిముక్తి ప్రసాదములభ్య మైనట్లున్న ప్రభ మనస్సు అశ్వఘోష్ వైపు పరువులెడు తున్నది. మరోవైపు నిస్వార్థత్యాగనిధి తమ కాపుడుయైన మిశ్రానంద్, దీనవదనంతో జాలిగా తనవైపు చూస్తున్న ట్లున్న దృశ్యం ఆకర్షిస్తున్నది. నీటితో చెరిగి అలుక్కుపోయిన అక్షరాలను చదువలేక, అజ్ఞానివలె అటూయిటూ త్రిప్పి తిలకించురీతి ఆమె అనాలోచితంగా అడుగులు వేసుకుంటూ అనుకోనివిధంగా కాలకారామం చేరింది.

వర్షానికి పడిపోయిన పఠనశాల పునర్నిర్మాణంలో నున్న మిశ్రానంద్ హుటాహుటి ప్రభసమ్ముఖానికొచ్చి తెలి యనిరీతిలో తడబడుతున్నాడు. ఆమెసమ్ముఖంలో కలుగు చున్న అసందిగ్ధ ఆదుర్దాలు నతనత నర్తింపజేస్తున్నవి. అనా లోచితంగా చేరవలసినచోటికే చేరిన ఆమె యేమిప్రశ్నిం చాలో తెలియక, తొట్రుపాటు చెందుతూ చేతులుజోడించి అదురుతున్న అధరాలతో ప్రణామాలర్పించింది. హృద యాంతరాళంనుంచి వుబుకుకొస్తున్న వుత్సాహాన్ని చిరు నగవుద్వారా ప్రదర్శిస్తూ "కులాసాగా వున్నావా ? చాలా మారులు మీ యింటికొచ్చాను. కాని నీవు కనిపించలేదు." అన్నాడు. ఏమిచెప్పాలో తెలియక దిక్కుదోచనిదానివలె ఆయన్ను తదేకంగా చూస్తున్నది. ఆయనహస్తాలు మోచే తులవరకు బురదతో పులుముకునివున్నవి. శరీరమంతా బురదమరకలతో నిండివున్నది. ఆ లేతయెండ మెరుపులో

ఆయనముఖమండలంలోని అస్పష్టరూపంలోని దుఃఖకిర ణాలు జిగిజిగిగా కనిపిస్తున్నవి. ఇరువురిచూపులు కలసి, పాత పాశాలను వల్లెవేసుకుంటున్నట్లు గతించినఘడియలలోని మంచుముత్యాలను ప్రోగుచేసుకుంటున్నవి.

తీగపొదలచాటునున్న యిసుకతిన్నెను చూపుతూ "అటు వెళ్ళి కూర్చుందామా?" అంటూ దారితీశాడు మిత్రానంద్. కలుగుతున్న తొట్రుపాటును సంబాళించు కుంటూ, తప్పటడుగులతో అనుసరించింది. ఆయన యిసుక తిన్నెమీద ఆసీనుడై "కూర్చో ప్రభా, కూర్చో" అన్నాడు. మర్మరహితమై అనురాగంతో ఆర్ద్రమైన ఆ శబ్దాలు వెను కటిమాధుర్యాన్ని స్ఫురింపజేస్తున్నవి, మంత్రించినదానివలె చేరువనే కూర్చుని పాతనేరాలకు శిక్షాస్మృతిముందు నిలిచిన దానివలె వెలవెలబోతున్నది. "నేను యెన్నిమారులు వచ్చినా, కనిపించలేదెందుకని ?" అని తదేకంగా ఆమెను చూస్తున్నాడు మిత్రానంద్. నిరుత్తరురాలై అధోముఖం జేసింది ప్రభ. ఆయన తిరిగి పరిహాసరూపంలో "ఎవరివడిలో వారు యితరులను సునాయాసంగా మర్చిపోతారు. నీయిం టికి చేరాక నన్ను పూర్తిగా మర్చిపోయావు. దేశాంతరు డనైనందున నా మనస్సు కలతచెందుతున్నది." అన్నాడు. ఛెళ్ళునవేసిన చెంపదెబ్బతగిలినట్లు ఖంగారుపడుతూ, "క్షమించు మిత్రానంద్. నేనంత విశ్వాసఘాతకురాలిని గాదు..." అన్నది ప్రభ అదురుతున్న అధరాలతో. మిత్రా నంద్ చేతినున్న బురదను యిసుకతో తుడుచుకుంటూ, వ్రాతముపొందినవానివలె పుత్సాహపడుతూ "ఈదేశను

వచ్చాక నాదీక్ష చెదుపతున్నది ప్రభా. మనస్సంతా అర్థం గానిఆలోచనలతో అలసట చెందుతున్నది.” అని ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు. ప్రభ శిరస్సు పైకెత్తిచూసి నపుడు దృష్టిద్వయం తారసిల్లినవి. తిరిగి శిరస్సును మరో వైపుకు మరల్చింది. “రోజురోజుకు అర్థరహితఅసం తృప్తితో వికలంచెంది, అసమర్థుణ్ణిగా నాకు నేనే గనిపిస్తు న్నాను ప్రభా!” అన్నాడు.

ప్రభ:- మీరు వచ్చినక్రొత్తలో ఇక్కడే బాగున్న దని, ఈదేశంలోనే వుండిపోతానని అంటిరిగదా!

మిత్రానంద్:- అవును, అలానే అన్నాను. ఇక్కడ వుండి, ప్రాకృతభాష బాగా చదివి, బౌద్ధమతగ్రంథాలు క్షుణ్ణంగా అధ్యయనంచేదామనుకున్నాను.

ప్రభ:- ఇపుడు అలసందాపై బెంగకలుగుతున్నది గాబోలు!

మిత్రానంద్:- లేదు లేదు.

ప్రభ:- అయితే, యిక్కడివాతావరణం మీకు నచ్చుటలేదేమో.

మిత్రానంద్:- అలాఅంటే యిక్కడిభిక్షువులకు నేను అపచారంజేసినవాడినవుతాను.

ప్రభ:- ఏదో ఒకకారణం ఉండాలిగదా!

మిత్రానంద్:- అలాంటికారణమేమీ లేదు. అదే విచిత్రం. ఏపనిమీదా నిశ్చలంగా వుండలేకపోతున్నాను. ఉన్నతలక్ష్యాలతో నిర్మించుకున్న యీ భిక్షువురూప నిత్య కార్యక్రమంలో శాంతి లభించుటలేదు. అసంతృప్తితో

గూడిన ఆలోచనలతో మనస్సు వేడెక్కిపోతున్నది. ప్రాకృతిక ప్రవృత్తులకు నిరోధంలో నిర్మించుకునేవాటితో పూర్ణత్వం లభించదని, నీవు మనప్రయాణపురోజులలో అన్న మాటలు పదేపదే మనస్సులో దొర్లి కల్లోలాన్ని కల్పిస్తున్నవి. భిక్షువుసంఘం, బౌద్ధమతానికి సమూనా కేంద్రం గానచ్చు, కాని కేవలం భిక్షువులద్వారా సంఘఆశయాలు సమాజంలో పూర్ణరూపాన్ని పొందజాలవని, కుటుంబంలో వుంటూ, ఆశయసిద్ధికి సాధనచేసినప్పుడు సఫలత సంప్రాప్తమవుతుందని అనిపిస్తున్నది. ఇవన్నీ ఆనాటి నీ మాటల ద్వారా కలిగిన వూహాలే. నీవు నాముందు నిస్సంకోచంగా అలాంటిమాట లనకపోతే, నాలో మార్పువుండేదిగాదు. నా వేషధారణను జూచికూడా నీ నా సమయంలో వ్యంగ్య భాషణలాడావు. వాస్తవాని కవన్నీ నా కపుడు రవంత బాధనే కలిగించినవి. కాని నేడా మాటలే నా కర్ణాలలో ఖంగుఖంగున మ్రోగుతున్నవి.

ప్రభ:- (తడబడుతున్నకంఠంతో) మిత్రానంద్ గారూ, మీరు సామాన్యభిక్షువులు గాదు. గ్రీకు దేశభిక్షు కోటిలో అగ్రస్థానంపొందినవారు. అందరూ మిమ్ము గురువుగా భావించి, మిమ్ము ఆదర్శంగా భావించి అనుకరిస్తుంటారు. ఈ కొద్దివ్యవధిలోనే సాకేతభిక్షువులుకూడా మిమ్ము గుర్తించారు. అత్యధికసన్మానాలను యిస్తున్నారు. అలాంటి మీరు మాట్లాడేధోరణి అగమ్యంగావున్నది.

మిత్రానంద్:- లేదు ప్రభా, నాలోని ఆపట్టుదలలు, దీక్షలు సడలినవి. ఒకనాటి నీ మాటల ప్రేమశాస్త్ర ఉక్తిలో

నేను పరాజయంపొందానని నీమ్ముందు వప్పుకోనుటే మం
చిది. అది నీ విజయంగావచ్చు, ప్రకృతివిజయంగావచ్చు.
నా పరాజయమనిమాత్రం గట్టిగా చెప్పగలను.

ప్రభ నిశ్చేష్టురాలయింది. ఆమెహృదయంలో రెళ్లు పవువులెడుతున్నవి. ఆనాడు యెలాంటిసందర్భంలో యేవ్యూహాలతో అన్నదో గుర్తుజేసుకోగల స్థిమితం లేదు. అగ్నితో చెలగాటమాడి విపత్తునుసృష్టించుకున్నట్లు కంపిస్తున్నది. సులోగన్ మహాపుచ్ఛశ్రేణిలోనివాడు. తనుకుటుంబంపాలిటి రక్షకునిలాంటివాడు. కాని, కలిగిన చనువుతో స్త్రీసహజాలనబడే చంచలత్వంతో ఆనాడు ఆయనతో అప్రస్తుతమైన సంభాషణలు ప్రేరేపించింది. వాగ్వివాదాలు జరిపింది. అవి ఆయనహృదయంలో అంకురమై పెరిగి పెద్దవై హోరుమంటున్నవి. కాని తాను వాటి నానాడే విస్మరించి నచ్చిననావ దొరికి, పులకితురాలై యెక్కి పయనిస్తున్నది. కాని యిపుడీ డగమగస్థితి విన్నపుడు విమూఢతలో మునిగిపోయింది. నేత్రాలు అదురుతున్నవి. మనస్సు చెదురుతున్నది. ఒకటితరువాత ఒకటిగా రెండుప్రతిమలు ముందు జిలిబిలినృత్యం సలుపుతున్నవి. ఒకరు మహాకవి, సాటివిజేత, అసామాన్యశక్తిగలవాడు, తనకోరకు కులగోత్రాలను ఆచారవ్యవహారాలను విసర్జించినవాడు, తలిదండ్రులనుసహితం నిర్లక్ష్యంచేసినవాడు. ఈ జగత్తులోని సర్వముకంటె తనను మిన్నగా ప్రేమిస్తున్నాడు. రెండవవారు: తనను, తనతండ్రిని రక్షించిన రక్షకస్వరూపులు, త్యాగమూర్తి, శాంతస్వరూపులు. తనజీవితాన్నే సమాజసేవ కంకితమొనర్చినవారు.

సచ్ఛీలసంపన్నులు. కల్ల కపటము జిత్తులు టక్కులు తెలి యని నిర్మలహృదయులు. తన అనభిజ్ఞతలోని మాటలను ముడివేసుకుని, మనస్సును చెదరగొట్టుకుని దీక్షనుంచి జారి పోయి. తనకొరకని సామాన్యులలో కలియనున్నట్టుగా తనను అపేక్షిస్తున్న సాధుపుంగవుడు.

ఆపెనుగులాటంనుంచి స్వేదబిందువులు కారుతున్నవి. దీర్ఘమైన శ్వాస వేడిగా వస్తున్నది. అశ్రుభరితనయనాలు రుధిరరంగుతో మెరుస్తున్నవి. అధరాలు వక్రాలుతిరుగుతూ వణుకుతున్నవి. వివేకశూన్యమైన ఆమెదృక్కులలో బెదురుతోగూడిన భీతి ప్రస్ఫుటమవుచున్నది.

మిత్రానంద్ చేతులనున్న మట్టి యెండిపోయినందున బెట్టగాదోచి రుద్ది పూడుకుంటూ ప్రభ యేమిచెబుతుందా యని యెదురుచూస్తున్నాడు. ఇంతలో సంచారంనుంచివచ్చిన కొందరుభిక్షువులు మిత్రానంద్‌ను వెదుక్కుంటూ వచ్చి, పంచప్రతిష్ఠితరూపవందన మాచరించి, యెదుట నిలచు టతో మిత్రానంద్ సంకటంలోపడి నిరుపాయుడై ప్రభ నవ లోకించి "నేను తరువాత వస్తాను." అని ఆగంతుకులను అను సరించాడు. ఊబిలోపడి కూరుకుపోయి పూపిరిసలుపక అంతిమగుటకలు వేస్తున్నదానివలెనున్న ప్రభ దీర్ఘశ్వాసను విడచింది. హృదయములోని దడ యింకా ఆగలేదు. నిర్జీవ త్వాన్నిపొందిన నరాలింకా స్వాధీనంలోకి రాలేదు. చెదిరిన మనస్సు యింకా పాటుకురానందున అంధకారం అలానే వున్నది. సుఖసౌఖ్యాలతో ఆనందోత్సాహంలో మునకలు వేస్తూ, పక్షులకూజితాలతోకలిపి రాగాలాపనసలుపుతున్న

తాను దైవశాపంతో క్షణంలో మతిభ్రమణంలోపడి మునిగి పోతున్నట్లున్నది.

తడబడుతూ తప్పటడుగులు వేసుకుంటూ, యింటికి జేరిన ప్రభనుజూచి తలిదండ్రులు విహ్వాలులైనారు. యెండలో త్రుంచి వేయబడిన పద్మమువలె ఆమెముఖము నడబడి మ్లానతలో ముకుళించుకున్నది. నేత్రాలు రుధిరవర్ణంలో జ్యోతులవలె భీతిని గలిగిస్తున్నవి. జ్వరతాపం మండిపో తున్నది. హృదయంలోనిరక్తము పరువులెడుతున్నది. తల్లి ఆదుర్దానుగాని, తండ్రి ప్రశ్నలనుగాని ఆలకించుస్థితిలో లేదు. తేలిపోతున్న అడుగులతో రివ్వునవెళ్ళి శయ్యమీదపడి అటూయిటూ పొర్లుతూ దొర్లిగింతలుపెటిహస్తద్వయంతో కురులను వూడబెరుక్కొని, పేలబాధతో విసుగెత్తినదానివలె రుద్దుకుని, అరచేతులతో మూడును బలంకొద్దీ అదిమిబిగబట్టి ప్రసవవేదనపడుతున్నదానివలె దీర్ఘశ్వాసవిడచింది. ఆ శ్వాసతోపాటు అశ్రుస్రవంతులు బయల్పడినవి. శయ్య ప్రక్కనజేరి తలిదండ్రులు ఖంగారుతో యేమేమోఅంటూ మరేమేమో చేయబోతూ, వాగూ కన్నీరుకారుస్తూ భయ భీతులతో మిళితమైన గాద్గదికకంఠంతో "ఏమిటమ్మా? ఏమిజరిగింది? కన్నీరుకారుస్తావెందుకు? జ్వరం మండిపోతు న్నది తల్లీ" అన్నారు. వారిమాటలతో ఆమెమనస్సు మన స్సులో చేరింది. పెద్దప్రయత్నంతో హృదయాన్ని అదుపు జేసుకుని, కంఠాన్ని సవరించుకుని, శుష్కధ్వనితో "ఏమీ లేదు. చలిలో యెండ బాగున్నదని వరుసగా నాలుగుగంటలు యెండలోనేవున్నందున జ్వరంతగిలింది. జ్వరతాపంవలన

కన్నీరు కారుతున్నది. అంతే." అన్నది. వెంటనే ధైర్యం బొందినధ్వనితో "అయితే నేను వెళ్ళి మిత్రానంద్‌ను తీసుకొస్తానమ్మా, ఆయన యిలాంటిజ్వరాలకు మంచి చిట్కా మందులిస్తాడు. వెంటనే తగ్గిపోతవి" అని దత్తమిత్రుడు పోనుద్యుక్తుడయినాడు. గాయంమీద కారంచల్లినట్లున్న యీ మాటతో కలిగిన అంతర్గతపులికిపాటును అణచుకుని ప్రసన్న వదనాన్ని ప్రదర్శింపప్రయత్నిస్తూ "అక్కరలేదు నాన్నా, రెండుగంటలు కదలకుండా పడుకుంటే, జ్వర మదే తగ్గిపోతుంది. ఈజ్వరానికి మందు లెందుకు"అని ధీమా ప్రకటించింది. కాని, ప్రదర్శించినధీమాలో వణుకున్నది, నవ్వులో శుష్కత గనిపిస్తున్నది. ప్రభ గట్టిగా చెప్పినమాటలను కాదనలేక, వుపచర్యలలో లీనమయ్యారు. వెంటనే ఆమె ఫాలభాగం మీద కరక్కాయపూటలో ముంచిన తడిగుడ్డ వేసి ఆరకుండా చూస్తున్నారు.

మనఃకంపనలతో వచ్చే జ్వరానికి మందులు వుపచర్యలు పనిచేయజాలవు. అయినా, తన అంతర్బాధ యెక్కడ బయల్పడుతుందో, యేవైద్యులు వచ్చి వాడరాని మందులు వాడతారో, తీరా మిత్రానందే వైద్యుడుగావచ్చి కూర్చుంటాడేమో, అశ్వఘోష్‌కు యదార్థాలు తెలిస్తే, యెంత హాస్యాస్పదంగా తలుస్తాడోననే భీతితో యెప్పటికప్పుడు లోనిబాధను అణచుకుంటూ, ఉత్సాహాన్ని కల్పించుకుంటూ తన కేబాధా లేనట్లు, జ్వరంకూడా పైకి కనిపించునంత శరీరంలో లేనట్లు, ప్రదర్శిస్తూ తలిదండ్రులను మభ్యంలో బెట్టి సమయాన్ని శాంతంగా దొర్లించగలుగుతున్నది ప్రభ.

శరీరంలోని కొన్నిజబ్బులు చికిత్సలేనపుడు, కాలం గడిచినకొద్దీ వుధృతంబొందుట స్వాభావికం, ప్రమాదానికి దారితీయుటకూడా తథ్యం. కాని, మానసికఆందోళనలు బాధలు తిరుగుముఖమగుటకు కాలమొక్కటే సరియైన అవుషధం. సమస్యలను సరిదిద్దగలది సమయమొక్కటే. రెండు రోజులు గడిచినతదుపరి ప్రభ ఒక నిశ్చితాభిప్రాయానికి రాగలిగింది. మనస్సుకు వూరటను కలిగించుకున్నది. జ్వాలాముఖపొంగులు పోవుటతోనే, పొర్లులు, పొగలు ధ్వనులు సద్దుమణిగినట్లు శరీరంలోనితాపం తగ్గింది. కంపనలు అణగినవి. ప్రశాంతంగా పడుకుని ఆలోచించినవిషయాలనే ఆలోచిస్తూ అలసటచెంది కనులుమూసి మర్చిపోవాలని ప్రయత్నిస్తున్నది. మరువాలన్నదే మనస్సులో మరీమరీ చెలరేగుట మామూలువిషయం. అందుకే ఆమె నేత్రాలు మూసినా తెరిచినా ఆవిషయాలే, ఆదృశ్యాలే దాగుడుమూతలాడుతున్నవి. అశ్వఘూమ్‌ను విడనాడుట ఆమె కసంభవము. మిశ్రానంద్‌ను నిరాదరించుట ద్రోహంగా మనస్సు వాపోతున్నది. తనఅనభిజ్ఞతలోని ఆనాటి ప్రేరణ నేడు తనను గేలిచేస్తున్నది. ఆవిషయాన్ని తలంచి నేడు కన్నీరు కారుస్తున్నది ప్రభ.

ప్రభకు జ్వరం వెనుకాడినందున తలిదండ్రులకు శాంతితోగూడిన స్థిమితం లభించింది. ఇపుడు వారు వైద్యుల గురించిన ఆలోచనలుచేయనవసరంలేకపోయింది. అందువలన ప్రసన్నరూపంలో యేకోన్ముఖులై బిడ్డకు వుపచర్యలు సలుపుతూ ఆమెఆనందవాణికొరకు ప్రక్కన కాపెట్టుకుంటు

న్నారు. నాలుగు రోజులు గడిచిపోయినవి. జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. కాని ఆమెకు లేచి తిరుగాలనిపించుటలేదు. ఎవరికీ తనముఖం చూపించాలనిపించుటలేదు తలిదండ్రులను చూచుటకుకూడా కించగలుగుతున్నది. తనదగ్గరకు వస్తున్న అలికిడి విన్నప్పుడు తనముఖాన్ని గోడవైపుకుత్రిప్పి గోడయి టుకలను లెక్కిస్తుంటుంది. పెసరపప్పు వుడికించిన తేట తెచ్చి ప్రభతల్లి మంచంప్రక్కగా నిలిచి "అమ్మా! నీకు ఆకలి బొత్తిగా చచ్చిపోయింది. యీ పెసరపప్పుతేట త్రాగు, ఆకలిపుట్టుకొస్తుంది." అన్నది. ప్రభ రవంత విసగటను ప్రద ర్శిస్తూ "ఏమీతినకపోతే ఆకలి అదే పుట్టుకొస్తుందమ్మా. ఈ పెసరతేట నా కిష్టంలేదు" అన్నది. అనునయంతో "జ్వరపడిలేచినవాళ్ళ కిది అమృతమువంటి దమ్మా, వేడిని తగ్గిస్తుంది, ఆకలిని సృష్టిస్తుంది, స్వాదిష్టాన్ని కల్పిస్తుంది. హాటంవేయక కాస్త త్రాగు తల్లీ" అన్నది తల్లి.

"మిత్రానంద్ నీవు వచ్చావా నాయనా, నీకోసంకు మొన్న నేనే రావాలనుకున్నాను. కాని అమ్మాయి వారిం చింది. మొన్న అమ్మాయికి యెంత జబ్బుచేసిందనుకు న్నావు!" అని బయట అంటువున్న దత్తమిత్రునిమాటలు విని ప్రభ వెలవెలబోతూ, తల్లి చేతిలోని చాయిగిన్నె తీసుకుని గటగట త్రాగివేసి తిరిగి పడుకున్నది. తల్లి ఆదుర్దాతో బయటివైపు కెళ్ళింది. తనముఖంలో ప్రసన్నరేఖలను కని పింపజేయాలని యెంతప్రయత్నిస్తున్నా ఆవేదనలోని వుదా సీనరేఖలే బయల్పడుతున్నవి. "ఏమిజబ్బుచేసింది? నాకు కబురైనాచేయకపోయారా?" అన్న మిత్రానంద్ మాటలు

వినిపించినవి. నేరస్తుని పట్టుకోను న్యాయాధీశుడే వస్తున్నట్లు ఆమె భయకంపితురాలై తా నెవరికీ కనిపించకుండా మాయ మైపోతే బాగుండునని, తలగడక్రిందదూరి దాక్కొగలిగితే యెంత బాగుండునని తలపోస్తున్నది.

దత్తమిత్రుని వినయపూర్వక వేడుక నంగీకరించి, మిశ్రానంద్ ఆరోజు అతిథిగా వుండిపోయాడు. ప్రభ ఆరోగ్యము కుదుటపడిందనే ఆనందంతో తలిదండ్రులికుపురికి అత్యధిక వేడుకగా వుంది. అంత సరళహృదయుడైన మిశ్రానందమనస్సులో తెగనిఆలోచన లుత్పన్నమవుతున్నవి. నాల్గురోజులక్రితం ప్రభ తనవద్ద కొచ్చినపుడు బాగావున్నది. ఈలోపలే ఆదుర్దాపడేంత జ్వరమువచ్చుట, తనకు కబురైనాలేకుండా నయమవుట ఆయనమనస్సు కేదో కొరతను ఆపాదిస్తున్నది. తా నామెతో సంభాషించాలనిచేసిన ఆలోచనలకుప్పలు, తనమనస్సులో కదులుతున్నవి. చిక్కబట్టుకున్న హృదయంతో ప్రభశయ్యప్రక్క కుర్చీలో ఆసీనుడైన మిశ్రానంద్ ఆమె కోమలకరాన్ని నాడిని పరీక్షిస్తున్నాడు. నాడితరంగాలు ఆయనఅంగుళీయాలకు తగులుట లేదు. ఆయనచేతిలో ఆమెహస్తం నొక్కుకుపోతున్నది. ఆయన దీక్షలో అకుంఠితమైనవాడు. ఆశయలక్ష్యపోరాటాలలో ఆయన అఖండవీరుడు. సహనము, త్యాగములో అపారనిధి; కాని ప్రేమఆటలో అవివేకి, అమాయకుడు. నేడు ప్రేమావేశములోని నూతన అబోధనటుడు. అజ్ఞారూపంలోని ప్రేమావేశంద్వారా ఆయననరాలు వుబికి, వివశతతో గూడిన కాంక్షతో ఆమె నాడినేగాదు, చేతినే నలిపివేస్తు

న్నప్పుడు నాడి యెలాదొరుకుతుంది! ప్రభ శ్వాసబిగబట్టి చైతన్యహీనురాలివలె గ్రుడ్లు తేలవేసి పూరుకున్నది. ఆయన హస్తం సడలినప్పుడు వ్రేళ్ళసందులుగా ఆమె సుకుమార హస్తంమీద పడిన వ్రేళ్ళముద్రలు రుధిరాన్ని చిందిస్తూ కని పిస్తున్నవి. వాటినిచూసి క్షణపాటు విచలితుడై సంబాళించు కుని, వెనుకనున్న దత్తమిత్రదంపతులవైపు శిరస్సుద్రిప్పి "ఇప్పుడేదోషమూ గనిపించుటలేదు. విశ్రాంతి అవసరం, అంతే" అన్నాడు. దత్తమిత్రుడు గొప్పఆపదనుంచి బయట పడినవానివలె, దీర్ఘమైన శీతలశ్వాసను విడుస్తూ "మొదటి రోజున్న భయభీతులు యింతవరకుంటే, ముందు మే మిరు పురము ప్రాణాలువిడిచిపుండేవారము." అంటూ బయటకు వెళ్ళిపోయాడు. ఆయన్ననుసరించింది సతీమణి.

ప్రభహృదయంలో యేమిజరుగుచున్నదో యేమో ముఖాన్ని మరోవైపు త్రిప్పింది. పొరపాటుగాచేసిన ఖూనీని మాపుజేసుకోజూస్తున్నవానివలె బిత్తరిదృక్కులతో అటూ యిటూ చూస్తూ వారు పోయినందుకు సంతసిస్తూ, ఆమె హస్తాన్ని చేతిలోవుంచుకుని కంది తేలిన అరవళ్ళమీద మృదువుగా నిమురుతూ, తనమూర్ఖత్వాన్ని దూరుకుంటూ "చేతిని యిలా నలిపివేశానేమిటి? చాలా పొరపాటు జేశాను, క్షమించు ప్రభా" అన్నాడు. ఆమెనుంచి జవాబు లేదు. "ఈపని నేను అనుకునిచేసిందిమాత్రం గాదు." అని విచారసూచకధ్వనిలో అన్నాడు. ఆమె మౌనాన్ని విడువ లేదు. మిత్రానంద్ వ్యాకులపాటుతో "కోపమొచ్చిందా ప్రభా," అంటూ ఆమెచుబుకాన్ని బట్టి, తనవైపుకు

మరల్చాడు. నయనాలలో తొణుకుతూ మెరుస్తున్న అశ్రు వులు ముత్యాలవలె ఒక్కటొక్కటిగా కపోలాలమీద దొర్లు తున్నవి. "అదేమిటి, కన్నీరు కారుస్తున్నావెందుకు?" అన్నాడు. తెచ్చిపెట్టుకున్న నవ్వును ప్రదర్శిస్తూ, అశ్రువు లను అద్దుకుంటూ "ఏమీలేదు ఆనంద్, వేడివలన గాబోలు ఊరికే కారుతున్నవి" అన్నది. ఆయన కరుణార్ద్రభరిత కంఠంతో "కాదుకాదు, నీచేయి వొరుసుకుని నొప్పికలిగింది గాబోలు. నేను మూర్ఖపుపని చేశాను." అన్నాడు. ప్రభ మౌనంవహించింది. మిశ్రానంద్ పశ్చాత్తాపహృదయంతో "నేను యెంత హీనుణ్ణయిపోయానో చూడు ప్రభా! నాడి చూడబోయి, నీ హస్తాన్ని యెలా నలిపివేశానో, అదేరీతి అడుగడుగునా జీవితాన్ని నేను పతనంచేసుకుంటూపోతు న్నాను. ఆశయాలు లక్ష్యాలు మొదలగు హృదయనిర్మిత శాశ్వతభావసంపదంతా మంచుతెరవలె తొలగిపోయింది. ఇపుడు నూతనభావావేశంహృదయంమీద సవారీచేస్తున్నది. ఈ నూతనభావాలముందు వెనుకటి నేను పూర్ణపరాజయం పొంది అశాంతితో తపిస్తున్నాను. ఈ భావాలుకూడా అడు గడుగున అవసరమైనతర్కాన్ని నిర్మించుకుని, బలపడు తున్నవి. వెనుకటిభావసంపదలో ఆత్మతృప్తితోగూడిన శాంతి ఆనందాన్ని కల్పిస్తుండేది. ఆశయలక్ష్యాలవైపు వుత్సా హంతో పరువులెత్తించేది. కాని నేటిభావసంపద ఆత్మఅసం తృప్తితో తపనలో దహింపజేస్తున్నవి. ఇది భరింపరానిది. దీనిబారినిపడినవారు యెన్నటికీ విముక్తిపొందలేరేమో ననిపిస్తు న్నది. ఈ అంతటికి కారణం నీవే ప్రభా." అన్నాడు. ఆమె

గోడమీద పైకి ప్రాకుతూ పడిపోతూ తిరిగి ప్రాకుతూన్న కీటకంవైపు చూస్తున్నది. మిత్రానంద్ సడలిపోతున్న వుత్సాహాన్ని తిరిగి పూరించుకుని, "ప్రభా, నీవు నాల్గురోజులక్రితం కాలకారామం వచ్చినపుడు బాగావున్నావుగదా! అంత ఆకస్మికంగా ఆనాడే నీకు జ్వరమెలావచ్చింది?" అని ప్రశ్నించాడు. ఆయనప్రతివాక్యాన్ని విన్నదోలేదో! విన్నా మనస్సుకెక్కిందోలేదోకాని, యేదో గుర్తువచ్చినదానివలె "వ్యక్తిగత సుఖసౌఖ్యాలు బుద్బుదాలని సమాజకళ్యాణంకొరకు, సమష్టి సంఘ ఆదర్శస్థాయికొరకు, మానవకోటి యావన్మంది సమాన సుఖాన్ని పొందురీతిని స్థిరంచేయుటకు వ్యక్తిగతంగాచేసే త్యాగం వుత్కృష్టమైందని, పరమవున్నతమైందని, స్థిరమైనదని, మీరన్నమాటలు గుర్తున్నవా, మిత్రానంద్!" అన్నదిప్రభ. "అది యెప్పటికీ నగ్నసత్యమే. నిస్వార్థత్యాగంతో ఆశయలక్ష్యసిద్ధికొరకు దీక్షతోసలుపు కార్యక్రమంలో, ఆహుతిఅయిన అసంఖ్యాకుల ఆత్మలమీదనే వుత్కృష్టనిర్మాణాలు జరుగుతుంటవి. అయితే, అన్ని ఆత్మలు యీ వుత్కృష్టనిర్మాణానికుపకరించవు. కొన్ని తైలాలే కొన్ని కార్యక్రమాలకు ప్రత్యేకించి వుపకరించునట్లు అకుంఠితదీక్షతో తననుతాను మరచి, అందు ఐక్యమై అంగమై లీనమై నిలువగలఆత్మలే అందుకుపకరిస్తవి. నాహృదయం అందుకు భిన్నమై చంచలత్వాన్ని పొందింది." అని మిత్రానంద్ అంటుండగా, అసంపూర్తిలోనే ప్రభ అందుకుని "అప్రస్తుతమైన ఆలోచనలతో మిమ్ముమీరు న్యూనతపర్చుకోకండి. మీ ఆధిక్యతను ప్రముఖస్థానాన్ని విస్మరించకండి. అలసందాలో యెందరోయువకులకు

బౌద్ధమంత్రాన్ని ఉపదేశించారు. మీద్వారా కుటుంబాలను త్యజించి, సాధువులైనవారు నేటి మీమాటలు వింటే, విస్తుపోతారు, పరిహాసిస్తారు. ధర్మరక్షకుడే దుర్మార్గానికి వడిగట్టినట్లవుతుంది." అన్నది. శుష్కతబొందినకంఠంతో "అబ్బ! నన్ను అన్నివైపులా వ్యర్థునిచేయకు ప్రభా. స్త్రీస్వభావం నిజంగా విచిత్రమైంది. అసందర్భాలను సందర్భంచేసికూర్చుంటుంది. కొన్ని వేళలందు సవ్యమైనవాటిని అపసవ్యమైనవాటిగా చేసి కూర్చుంటుంది. నిర్మలవాతావరణంలో నిప్పును సృష్టిస్తుంది. మన ప్రయాణంలో నీ వన్నమాటలన్నిటిని ఒక్కమాటు గుర్తుజేసుకో. బౌద్ధభిక్షువుగా భిక్షుసంఘంలో వుంటూ, బౌద్ధమతానికి చేసేసేవ ప్రదర్శనానికి పనికివస్తుందే గాని, సమాజానికి పూర్ణత్వాన్నివ్వజాలదని, బౌద్ధమతావలంబిగా కుటుంబములోవుంటూ, బుద్ధభగవానుని సూక్తులను ప్రతిఒక్కరికి ఆచరణయుక్తంగా అనుభవరూపంతో ప్రచారంచేసినపుడే బౌద్ధమతంద్వారా సమాజానికి పూర్ణత్వం సంభవిస్తుందన్నావు. ఇతరమతాలలో పరలోకచింతతోను, పుణ్యంపేరిట దేవునిపేరిట జరుగుచున్న మూఢత్వాలులేని యీ బౌద్ధమతం, మానవులంతా సుఖంగా వుండుటే ప్రధానఆశయంగాగల యీ మతంపేరిట ప్రచారకులుగా, అగ్రగాములుగా, సంచాలకులుగావుండువారు అందు కతీతులుగా కేవలం కర్మిష్టులవలె యోగులవలె వ్యక్తిగతశుష్కజీవితంలో యాంత్రికజీవితంలో వుండుట దోషభూయిష్టమైందని ఆనాడు నీవుఅన్నమాటలు నాకు బాగా జ్ఞాపకమున్నవి. ఆనాటి నీమాటలు నన్నాసను

యంలో చలింపజేయలేదు. కాని రానురాను హృద యంలో అశాంతిని రేపినవి. నీమాటలలో యదార్థసత్యా లున్నవేమో ననుకున్నాను. ఇపుడు నేను సంపూర్ణంగా మారిపోయాను. అడుగడుగున నీ మాటలే ఖంగుఖంగున వినిపిస్తున్నవి. ఎటుజూచినా నీ దివ్యసుందరరూపమే ప్రత్యక్ష మవుతున్నది. ఏవస్తువునుజూచినా అందు నీరూపమే ప్రతి బింబితమవుతున్నది. నన్ను ఇంత అసమర్థుణ్ని జేసింది నీవే ప్రభా. ఇపుడు సాంత్వనపలుకులతో నోదార్చాలని చూస్తు న్నావు. ఇది న్యాయమా చెప్పు?" అన్నాడు మిశ్రానంద్.

ఆమె గ్రుడ్లప్పగించి వెర్రిదానివలె చూస్తున్నది. "ఇది న్యాయమా" అన్నమాట, ఢోలక్ మీద కొట్టినట్లు ఆమెముందు ప్రతిధ్వనిస్తున్నది. ఏది న్యాయమో, యేది అన్యాయమో స్థిరీకరించగలస్థిమితం ఆమెలోలేదు. ఈ సంసారసుఖసౌఖ్యాల దాగుడుమూతలకు అతీతుడై అతిపవి త్రుడై, త్యాగమూర్తిగా, అరమరలు ఆటంకాలు, సంకుచి తాలు, స్వార్థాలులేకుండా నిరంతరము కిలకిలారావాలతో, ఆనందతరంగాలతపతపలతో పాటలుపాడుకుంటూ, పరుగు లెత్తి అగాధసాగరంలో లీనమవుతున్నట్లు, భిక్షువుసంఘంలో లీనమైన మిశ్రానంద్ నిశ్చలరూపంలో నొక్రప్రక్క గనిపిస్తు న్నాడు. తన అజ్ఞాతప్రేరణతో చపలచిత్తుడై చిందులు త్రొక్కుతున్న ఆనంద్ మరొక్రప్రక్క గనిపిస్తున్నాడు. స్ఫుట మైన స్ఫటికములాంటి పాలరాతివిగ్రహరూపంలో మిశ్రా నంద్ ప్రతిమ గనిపిస్తున్నది. ఈర్ష్యతోనో, అజ్ఞానంతోనో, తెలియనితత్తరతోనో నోర్చజాలక తా నా విగ్రహాన్ని నుసి

బూసి వికృతంజేసినట్లున్న మరోప్రతిమ గనిపిస్తున్నది. స్ఫుటంగా మెరుస్తున్నవిగ్రహం. అతిగంభీరంగా గర్వంతో గూడిన స్థిరత్వాన్ని చాటుతున్నది. సూర్యునిలోవలె నిశ్చల మైన తేజస్సు ప్రకాశిస్తున్నది. తనద్వారా వంచింపబడి నట్లున్న రెండోప్రతిమలో దీనత్వము హీనత్వము చంచలత లతో విషాదచ్ఛాయలతో, తీరనివాంఛలతో గనిపిస్తున్నది. కాని ఆ రెండుప్రతిమలయెడల తా నేదో ద్రోహంచేసి నట్లు, వినాశంవైపు నెట్టినట్లు, అన్నివైపులా తనకృతఘ్నత ప్రకటితమవుచున్నట్లు గోచరించి, ఆమెహృదయం కంపిస్తు న్నది. నేడు మిశ్రానంద్ద్వారా గుర్తుచేయబడిన ఆనాటి తనమాటలు చిత్రవిచిత్రరూపంలో తనను పరిహసిస్తున్నవి. అలాంటి ప్రోత్సాహపుమాటలతో ఆయన నెందుకు ప్రేరే పించానాఅని యెంతఆలోచించినా ఆమెహృదయంలో దుఃఖంతో దొర్లుతున్న అంధకారమే గనిపిస్తున్నది. సమా జానికి తనజీవితాన్ని అంకితంచేసినవాడు. తమకుటుంబం పాలిటి యావజ్జీవితము పూజించవలసిన ఆపద్బాంధవుడు. ఆయన తనచేవంచితుడై తనముందునిలిచాడు. కలుగుతున్న చీకాకును కప్పిపుచ్చను మొఖంమీద చేతులుంచుకుని, బలంకొద్దీ అదుముకుంటున్నది. మలేరియారోగికి లోనుంచే చలి తెరలుతెరలుగా పొర్లి వూపివేసినట్లు ఆమె దుఃఖంతో వూగిపోతున్నది.

మిశ్రానంద్ ఖంగారుపడుతూ ఆమెముఖానికి కరు చుకుపోయిన హస్తాలను విడదీస్తూ, "ఏమిటి ప్రభా, అలా దుఃఖిస్తున్నావేమిటి? ఇక ఆఖరివినతిగా నీతో చెబుతు

న్నాను. నావల్ల అపరాధం జరిగివుంటే, చెప్పు, తగినశిక్ష ననుభవిస్తాను. ఒకవేళ నామాటలు నీ కంత బాధను కలిగించివుంటే, నన్ను క్షమించు ప్రభా. జన్మలో మరెప్పుడూ నీకు కనుపించను." అని నిస్పృహతో కూడిన నిర్ణయాన్ని తెలియజేసినపుడు ప్రభ వెలవెలబోతూ లేవబోతున్న ఆయన హస్తాన్నిబట్టి లాగివుంచుతూ, దుఃఖభరితకంఠంతో "అలా అనకు మిత్రానంద్. నేను కృతఘ్నురాలినిగాదు, అసమర్థురాలిని. మా కుటుంబమునకు నీవు జేసిన మేలుకు నేను ప్రతిగా నీకుజేసినదాన్ని ప్రక్కగాబెట్టి చూస్తున్నాను. నాద్వారా నీ జీవితలక్ష్యం కుంటుపడింది. నీ నిశ్చలహృదయానికి తుచ్ఛమైన చంచలత్వం లభించింది. పరమపవిత్రమైన లక్ష్యాలతో ఆశయాలతో వెలుగుప్రసారిస్తున్న నిస్వార్థ త్యాగమూర్తియైన మీకు స్వార్థం ప్రబోధించి, మీలోని తేజస్సును హ్రాస్వంజేసిన నా క్షుద్రత్వానికి దుఃఖిస్తున్నాను ఆనంద్." అన్నది.

ఆయనముఖంలో ఓదార్పు రేఖలు జిలుగుజిలుగుగా ప్రదర్శితమైనవి. స్థిమితాన్నిబొందినవానివలె కూర్చుని "అందుకా నీ వీ కన్నీరుకార్చునది? నామార్గం నీద్వారా మారినందుకు విచారించాల్సినపనిలేదు ప్రభా. ప్రకృతివిరుద్ధమైన యీ సన్యాసిధోరణెందుకని నీ వన్నపుడు ప్రథమంలో నేనూ అలానే బాధపడ్డాను. కాని నీవు బోధించినమార్గంలోనే మానవపూర్ణత్వమున్నదని నేడు తెలుసుకుని ఆనందపడుతున్నాను. ఆమార్గావలంబనే ఉత్కృష్టమైనదిగా బ్రహ్మానందాన్ని పొందగలుగుతున్నాను. నీమాటలను శిర

సావహించ సంసిద్ధుడనైయున్న నన్ను జూచి గర్వించుటకు బదులు దుఃఖించుటెందుకు ప్రభా!" అంటూ ఆమె కపోలాల మీాది అశ్రుబిందువులను అంగుళీయములతో తుడుస్తున్నాడు. ఎవరిహృదయాలలో యేమిజరుగుతుంటుందో యెదుటివారికి తెలియుట సాధ్యమైనపనిగాదు. కాని, తనకు తోచినట్లు యెదుటివారిమూాకీభావాన్ని నిర్ణయించుకుని స్థిరీకరించుట పరిపాటి. లౌకికానికి స్త్రీలోకానికి అతీతుడైన బౌద్ధభిక్షువు మిత్రానంద్‌కు ప్రభమనోభావం యెలా అర్థమవుతుంది! ఆమె తనఅంతర్గతఆవేదనతో యేప్రలాపం జేసినా, అవన్నీ తనకొరకుగానే గనిపిస్తున్నవి ఆ అమాయకునికి.

అగాధజలరాశిలో మునిగిపోతున్నట్లున్న ఆమెను జలచరాలు వెంటాడి కరుస్తున్నట్లున్నది ఆయనసంభాషణ. ఆమె మాారుపలుకజాలక నెమ్మదిగా ముఖాన్ని మరోవైపుకు త్రిప్పి శ్వాసనుబిగబట్టి హృదయకంపనలను అదుపు జేసుకుంటూ నేత్రాలు అర్ధనిమీాలితంజేసింది. మిత్రానంద్‌కు ఆమెనుచూాస్తున్నకొద్దీ మనస్సులో నూతనవృత్యం ప్రారంభమవుతున్నది. తనకభ్యాసములేని వూాహ లుత్పన్నమవుతున్నవి. ఆమెశరీరచ్ఛాయలోని మెరుపులు నునుపులు అద్వితీయరూాపంలో ఆయన్నాహ్వానిస్తున్నట్లున్నవి. ఆమె శరీరంలోని ప్రతిఅణువు అత్యధికఆకర్షణీయంగా తోస్తున్నది. ఆమె తనకు అతిసన్నిహితంగావుంటూా, అనేక రోజులు ఋతువులు గడిచినవి. ఆరోజుల్లో తాను విముఖుడై, కట్టుబడిన కర్తవ్యాలజపంలో వుదాసీనతలో వుంటున్నపుడు

ఆమె అడుగడుగున తన చెంత జేరి, పరిహాసాలుపట్టిస్తుండేది. సన్యాసి వేషాన్ని వివిధవిధాల విమర్శిస్తూ, తనను రెచ్చ గొడుతుండేది. ఆమెశరీరస్పర్శలను యెన్నో మారులు అనుభ వించాడు. ఆనాడు పసిబాలికవలె తనమీదపడి ఆటలుపట్టి స్తుండేది. కేరింతలుకొడుతుండేది. వెనుకగావచ్చి బూచి ఆటలు ఆడుదానివలె నేత్రాలుమూసేది. తాను యెరుగ నట్లు కదలకుండా శిలవలెవున్నపుడు, తనవీపుమీద వాలి పోయి ముందుకూ వెనుకకూ వూపి, తనను ముందుకుపడ వేసి ఆమెకూడా పోయి తేలవేసిన మదభరితదృక్కులతో చూస్తూ రొప్పుతో గలిపి నవ్వుతుండేది. పయనపురోజుల్లో రాత్రులందు దొంగలభయంతో ఆమె తనకూ, దత్తమిత్రు నికిమధ్య పవళించేది. బడలికలేని గాఢనిద్రతో ఆమెపాదా లను పూర్తిగా తనమీద యెన్నోమారులు వేసింది. పొర్లి గింతలతో తనమీద వచ్చిపడినరోజు లున్నవి. నిద్రలో చెర గిన ఆమెచీరెను తాను సరిదిద్దినసమయా లెన్నోవున్నవి. దొంగలబారిచిక్కినపుడు ఆమెకాళ్ళకు తగిలిన గాయాలతో చీర రుధిరస్రవంతులతో తడిసిపోయింది. ఆమెకు చైతన్యం అసలేలేదు. ఈ సర్వాంగసుందరశరీరమంతా ఆరోజుల్లో పూర్తిగా తనఅధీనంలోనే వుంది. తాను ఆ పాదాలకు కట్టులుగట్టాడు. ఆమెదుస్తులను తానే మార్చాడు. కాని, ఆమెలోని యీ ఆకర్షణాశక్తి తన కానాడు రవంతకూడా కనిపించలేదు. మనస్సు చలించలేదు. ఆరోజుల్లో తన కర్త వ్యము, లక్ష్యాలు, ఆశయాలు ముందు గనిపిస్తుండేవి. తా నొక సైనికునివలె కర్మిష్టిగా కర్తవ్యపరాయణుడవుతే

ధ్యేయంగా వుండేది. అదే ఆనందంగా గనిపించేది. స్త్రీప్రేమ మత్తువంటిదని తుచ్ఛమైనదని తోచేది. సంఘాశయాలు శాశ్వతమైనవి, యేకైకతరణోపాయమని, స్త్రీసుఖం క్షణిక మనీ అనిపించేది. కాని నేడు ఆనాటి తనతలంపులు అంధత్వాన్ని సూచించేవేమోనని, అమాయకఆలోచనలేమోనని, సేవాభావమత్తులోని వెర్రితనమేమోనని ప్రభ ఆనాడు చెప్పినట్లే, స్త్రీని వేరుజేసి, పురుషుడు పూర్ణత్వాన్ని పొందజాలడని, పూర్ణత్వాన్నిపొందని మానవుడు సమాజానికి సంపూర్ణతను ఆపాదించలేడని నేడనిపిస్తున్నది. అందుకే నేడామెశరీరము చూచుటకే మధుభరితమై మత్తులో ముంచివేస్తున్నది. ఇపుడామెస్పర్శానుభూతులను తనశరీరంలోని ప్రతిఅణువు వాంఛిస్తున్నది. ఆమె ఆనాడు మాటాడినమాటలనే తిరిగి మాటాడితే, విని పరవశంకావాలని మనస్సులో అనిపిస్తున్నది. ఆకలితో అలమటిస్తున్నవానికి అద్దాలబీరువాలో గనిపిస్తున్న మిఠాయీలు ఆనందోత్సాహాలను రేకెత్తించినమీదట చప్పరింతలతో కనులార్పకుండా చూస్తున్నవానివలె నగ్నంగావున్న ఆమెహస్తాలను పాదాలను వెర్రివానివలె చూస్తున్నాడు. బయటనుంచి వచ్చిన దత్తమిత్రుడు "అమ్మాయికి నిద్రపట్టిందిలాగుంది" అన్న మాటలతో మిత్రానంద్ పులికిపాటుచెంది, లేచి నిలచాడు. ఆయనఆలోచనలు తెగిపోయిన సినిమారీలువలె అంతటితోనే ఆగిపోయినవి.

అశ్వఘోష్‌ను వర్షమేగాదు, తుఫానులు యేకమయినా ప్రభతోకలియకుండా ఆపజాలవు. వర్షముతోపాటు

ఆయనలో నూతనఅభిప్రాయ ముత్పన్నమయింది. నూతన ప్రేరణాఫలితంగా ఒకకావ్యాన్ని, లేక కనీసం కొన్ని పాటలనైనా వ్రాయమని ప్రభ నిత్యము కోరుతున్నది. కాని, ప్రభప్రత్యక్షంతో తానలా వ్రాయ ప్రయత్నించీ విఫలుడైనాడు. ఆమెలేని యీసమయంలో అద్భుతమైన రచన నొకదానిని వ్రాసి, ఆమెను చకితురాలనుచేయాలనే తలంపుతో తాళపత్రాలను ముందుబెట్టుకుని కూర్చున్నాడు. విశ్వప్రయత్నంతో రచనకుపక్రమించాడు. మూడురోజులు గడిచినవి, మూడు తాళపత్రాలను కుదిరికలులేని కూర్పులతో నింపాడు. కాని, తిరిగి చదివి అసంతృప్తితో చించిపారవైచాడు. పట్టుదలను రెట్టింపుచేసుకుని, మరికొన్ని భూర్జరపత్రాలను విధ్వంసమొనర్చినమీదట నిస్పృహతో నిట్టూర్పులువిడుస్తూ ప్రభకొరకు పయనమయ్యాడు.

ప్రభమనసు్న అస్వస్థతవలన సరిగాలేదని, యెక్కువగా సంభాషించుట అంత మంచిదిగాదని, ఆమెఆరోగ్యం రెండుమూడురోజుల విశ్రాంతితోనే కుదుటపడుతుందని, ఆ మీదట తన స్థిరమైననిర్ణయాలను తెలపాలని, తననిర్ణయాలు తాత్కాలిక మోజులతో చేసుకున్నవి కావని తెలిసినపుడు ఆమె ఆహ్లాదంతో స్వీకరిస్తుందని, యీలాంటి ఆలోచనలతో ఆత్మతృప్తినిపొందుతూ సాధుపుంగవుడైన మిశ్రానంద్ కాలకారామం చేరుకున్నాడు.

మిశ్రానంద్ వెళ్ళిపోవటంతో ప్రభమనసు్న రవంత తేలికపడింది. కాని అమాయకరూపంలో జరిగిన ఆయన హృదయమార్పుకు జాలిపడుతూ పశ్చాత్తాపంతో పరితపిస్తూ

న్నది. తనసర్వస్వాన్ని అశ్వఘోష్‌కు అర్పించికూర్చున్నది. నేడు తనవద్ద తనది యేమివున్నా మిశ్రానంద్ కంకితము చేయుటకు వెనుకాడదు. జైలులోని ఖైదీ కిటికీగుండా ఒక గర్భఆకలితో అలమటిస్తున్న యాచకుని జూచి, జాలితో సానుభూతితో మరేమీచేయజాలక అశ్రువులతో ఆదరం చూపుతూ ఆశీర్వదించినట్లు, తనవద్ద తనదిగా యేమీలేని ప్రభ మిశ్రానందునిజూచి జాలితో కరుణతో విస్ఫారితమై పవిత్రమైన అశ్రువులను అర్పిస్తూ మనస్సా "ఆయనమనస్సు వెనుకటిదీక్షలోనే వుంటే, యెంత బావుండేది!" అంటూ దీవిస్తున్నది.

విధి అతివిచిత్రమైంది. వక్రించినపుడు అన్నివైపుల నుంచి వక్రిస్తుంది. దుఃఖంలోముంచి అదిమి సమాధిచేసి గాని, శాంతించదు. జీవితంలో సుఖఘడియలే యెక్కువ. కాని సుఖఘడియలకంటె దుఃఖఘడియలఅంతరం అత్యధిక మైంది. అందుకే సుఖఘడియలు యిట్టే గతిస్తవి. కాని, దుఃఖఘడియలు యెంత నెట్టినా దూరంకావు.

ప్రభకు పాలుబోని నుయ్యిగొయ్యిలసమస్యలతో మనస్సు వేడెక్కి, తిరిగి కెంపరేచరు హెచ్చింది. ఆమె విసిగిపోయి నుదురుమీద మోదుకుంటుంది. దంతాలను కర కరమనిపిస్తూ, తలగడను మోదుమీదపెట్టి బలమంతటిని ప్రయోగించి వత్తివేస్తుంటుంది. పరమపవిత్రుడయిన మిశ్రా నందకు పిచ్చిమార్గాన్ని చూపిన తాను యీలోకంలో జీవిం చుట న్యాయవిరుద్ధమని, సరయూకి ఆహుతిఅయితే శాంతి, నిష్కృతి లభిస్తుందని మనస్సు వాపోతుంది. ఆత్మహత్య

అసమర్థత్వ ప్రతిబింబమని, ఆహుతియైనా సమస్యలు అపరిష్కృతంగా వుండిపోవచ్చునని తిరిగి అనుకుంటుంది. విరుద్ధ భావాలతో మనస్సు వికలం చెందుతున్నది. తిరిగి జ్వరతీవ్రత హెచ్చుటతో తలిదండ్రులు కళవళపడుతూ, కరక్కాయ పూటతో తడిపిన గుడ్డను మాడుమీదవుంచి, సపర్యలు చేస్తూ మిశ్రానందకు కబురుచేయజూస్తున్నారు.

నూతనరచనతో ప్రభను చకితురాలనుచేయాలని చేసిన గుప్తప్రయత్నాలన్నీ విఫలమయిన అశ్వఘోష్ ప్రభ యింటిముందు జేరి, ఆహ్వానించువారెవరూ గనిపించక, తటపటాయిస్తూ అటూయిటూ పరికిస్తున్నాడు. ఎవరిపదార్థాన్ని వారే బల్లవద్దజేరి, అందుకొను నూతనవిందురీతివలె తనంతటతానే లోపల ప్రవేశించి, శయ్యమీద పడివున్న ప్రభను చూసి, వెలవెలబోతూ అనభిజ్ఞునివలె ఆమె ప్రక్క కూర్చుండి, ఆమెకుడిహస్తాన్ని దీసుకుని నిమురుతూ ఖంగారు చెందుతున్న కంఠంతో "అబ్బ! యెంత జ్వరంగావుంది?" అన్నాడు. ప్రభ శ్వాస తీవ్రంగా ఆడుతున్నది. నేత్రాలు పెద్దవిగా చేసి, అపరాధినిచూస్తున్నట్లు చూస్తున్నది. ఆయన మనస్సులో యేమనుకున్నాడో, నయనాలనుంచి రాలిన అశ్రుబిందువులు ఆమెఅరచేతిలో టపటప పడినవి. వెంటనే ఆమెహాస్యం అదిరింది. లాక్కొన ప్రయత్నించింది. గాద్గదికకంఠంతో "నేను యెంత వెర్రివాడిని! నీకు తెలియకుండా ఒక మంచికావ్యాన్ని నీవుకోరినట్లు వ్రాసి, నిన్ను చకితురాలనుచేయాలని ప్రయత్నిస్తూ నిన్ను కలుసుకోలేకపోయాను. నీవు యెలావున్నావో ననే ఆలోచనలుకూడా లేక, నీవు వచ్చినా కనిపించగూడ

దని గుప్తస్థానాలలో కూర్చుని, రచనాప్రయత్నంలో మునిగి పోయాను. నా ప్రమత్తతను మన్నించు ప్రభా!" అన్నాడు. నీటిలోమునిగి చావబోతున్నవాడు, నీరు చల్లగావుందా, వెచ్చగావుందా అని అడిగినట్లు, "ప్రాశారా? ఏదీ?" అని లోతుకంఠంతో అడిగింది. "నీవు చూసి పరిహాసిస్తావని చించి పారేశాను" అన్నాడు. ఆమెలోనివుత్సాహం అణగి పోయింది గాబోలు, తిరిగి ప్రశ్నించలేదు. ఆమెముఖం మ్లానతచెంది నిస్తాణిలో వుండిపోయింది. అశ్వఘోష్‌కు తిరిగి పలుకరించాలనే ధైర్యంలేక ఆమెహస్తాలను నిమురుతూ విమూఢునివలె వుండిపోయాడు.

# ప్రేమచికిత్స

ఆరాత్రికి జ్వరం మరింత వుగ్రుతరూపం దాల్చింది. భరించలేని తపనలో రొప్పుతున్నది. అర్భకునివలె అశ్రుభరిత నయనాలతో, ప్రక్కనకూర్చుని తదేకంగా చూస్తున్న ఆయనకు అంతా అంధకారమే గోచరిస్తున్నది. విపత్తులోని అంతిమఘడియలలోనున్నట్లు ఆయనహృదయం దడదడలాడుతున్నది. అగాధంలోమునిగి బుటకలు వేస్తున్నవానివలె అధరాలుఅదురుతూ వక్రాలుతిరుగుతున్నవి. హృదయక్షోభతో ఆక్రందనలరూపంలో ఆగిఆగి అపస్వరధ్వనులు బయల్పడుతున్నవి ఆయనకంఠంనుంచి. తనను నమిలిమ్రింగివేస్తున్న వ్యథ క్షణంలో దుఃఖరసాలొలికిస్తూ అత్యధిక శ్రావ్యమై

సుకుమారమై మాధుర్యాలతోనిండిన రాగరూపాన్ని పొందింది. ఆలోచనాస్థాయిలోని రాగరంజితమైన దుఃఖరసం పాషాణాలనుసైతం కరిగించురీతిలో వున్నది. ప్రభ కర్ణాలు రిక్కించి వింటున్నవి. ఆ ప్రీతరూపందాల్చినముఖంలో వుత్సుకతాకవళికలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నవి. అప్రయత్నంగా మాధుర్యాలొలుకు ఆయనకంఠంనుంచి బయల్పడుతున్న పాట ఊర్వశీవియోగంలోనిదే.

"సరయూనది సంగీ - హృదయార్పణ జేసితి పొంగీ,

........................."

ఇపు డాయన మనస్సిక్కడలేదు. స్ప్రేనుంచి గాలి వత్తిడితో నీరు ధారగా చిందుతూ బొట్లుగా ప్రక్కలకు ప్రవహిస్తున్నట్లు ఆయనహృదయంలోని వేదన పాట రూపంలో నోటిగుండాను, కన్నీటిరూపంలో కళ్ళగుండాను బయల్పడుతున్నది. గాఢప్పెండలోనున్నదానిమీద పన్నీరుచల్లినపుడు సొమ్మసిల జేయు చల్లదనాన్ని కల్పించునట్లు అశ్వఘోష్ రాగము ఆమె మనస్సును మంచుతెరతో కప్పినట్లు శీతలంజేసింది. ఆమెలోనివుష్ణతాపం హరించింది. స్పృహకలిగింది. స్థిమితాన్ని పొంది ఆయన్ను చూస్తూ పరవశురాలవుతూ, కదిపితే ఆ దృశ్యం యెక్కడ చెదిరిపోతుందోననేభయంతో శ్వాసను మృదువుగా విడుస్తూ హాయినిగ్రోలుతూ "కవిత్వానికి సంగీతానికి యదార్థమాతృక దుఃఖభరితవ్యథ అన్నది పరమసత్యం." అని అనుకుంటున్నది. వ్యథతో పూగిపోతున్న ఆయనహృదయానికి, అశ్రువులతోనిండిన నేత్రాలకు అంధ

కారందప్ప మరేమీ గనిపించుటలేదు. అందువలన తనమనో నేత్రంలోని దుఃఖాన్ని రాగరూపంలో యింకా పలికిస్తూనే వున్నాడు. అమృతకలశమనే ఆయనకంఠం పలికిస్తున్న ధారను హాయిగాగ్రోలుతూ, క్షణమొకరీతిగా ఆరోగ్యాన్ని పొందు తున్నది ప్రభ. ఆమెమనస్సులోని, మలినాన్ని, అసందర్భా లను, సందిగ్ధాలను ఆ అమృతం కడిగివేస్తున్నది. తనహృద యాధిదేవతారాధన ఆఖరిస్తోత్రంలో చైతన్యాన్ని సమూ లంగా కోల్పోయి వుచ్ఛస్థాయిలో నామనినాదాన్ని స్తోత్రిస్తూ రోగిమీదకు వాలిపోయాడు. తన అమూల్యసంపదను ఆవల బెట్టి,ఆదమరచిదుష్టస్వప్నాలలోబడి దుఃఖిస్తున్నవానిని మేల్కొలిపి మరచిన నిజసంపత్తిని యేదేవతోవడిలోబెట్టి"జాగ్రత్తగా కాపాడుకో" అన్నపుడు, ఆవ్యక్తిస్థితే ప్రభ కాసమయంలో కలిగింది. ఆత్రత,వుత్సుకత, ధైర్యము ఆత్మానందము ఒక్క మాటుగా ఆమెలో పెల్లుబికినవి. వెంటనే ఆయనశిరస్సును బాహువులలోకి దీసుకుని, మృదువుగా యెత్తి తనహృదయం మీాద పెట్టుకుని, ఆయనకురులలో వ్రేళ్ళుదూర్చి నిమురు తున్నది. ఆయనదీర్ఘశ్వాస ఆమెవక్షానికి తాకుతున్నది.

అశ్వఘోష్ శిరస్సు పైకెత్తి ఆమెనుపరికించి, ఆశ్చ ర్యాన్వితుడై తదేకంగా చూస్తూవుండిపోయాడు. ఆయన ముఖంమీాది అశ్రుముద్రికలింగా స్పష్టంగా కనిపిస్తున్నవి. కాని, అదంతా కలలోని కన్నీరువలె గనిపిస్తున్నది. పవళించి దరహాసరూపంలోనున్న ప్రభ సగంలేచి, కుడిచేతిఅంగు ళీయములతో కన్నీరు తుడుస్తున్నది. తల్లివడిలోని పసిబిడ్డ వలె "నీకింతకుముందు జ్వరం ప్రమాదరూపంలో వుండెనే?"

అని ప్రశ్నించాడు. ఆమె జవాబుకు ప్రతిగా గాబోలు, చిరునగవును చిలికించింది. కారు మేఘాల క్రింద తడుపుకుంటున్న వానికి మెరుపు లభ్యమైనట్లు, ఆయన శరీరంలోని నాడులన్నీ ఒక్క మాటుగా తన్ని తానం చేసినవి. "ఇపుడు జ్వరం పూర్తిగా పోయినట్లేనా?" అంటూ ఆమె హస్తాన్ని బట్టి, సరి క్రొత్త చికిత్సకునివలె నాడిని వెదుకుతున్నాడు. ఆమె దరహాసంచేస్తూ "వున్న జ్వరం నాడిలోనే వుండదులెండి. నాడిని పరీక్షించి తెలుసుకోను విశేష నైపుణ్యం కావాలి." అన్నది. కలిగిన ధైర్యంతో లోతు స్వరంతో వ్యంగ్యంగా "అవసరాలు నైపుణ్యాన్ని సృష్టిస్తవి." అన్నాడు. ఆమె మరింత ముగ్ధురాలవుతూ "పరమసత్యాన్ని పలికావు కవీ, వేడిని వేడే హరింపచేయగలదన్నట్లు, దుఃఖాన్ని అంతకు మించిన దుఃఖమే దూరము చేయగలదని నేడు ప్రత్యక్షనిదర్శనతో రుజువుచేశావు." అన్నది. అర్థంగాని అమాయకునివలె "నేనేమి జేశాను?" అన్నాడు. "నా జ్వరానికి సరిపోయే ఔషధాన్ని వాడావు" అన్నది. తడుపుకున్న వానివలె "నేనే మందూ వాడలేదే!" అన్నాడు. "దుఃఖరూపంలో నీవు మహా ఆకర్షిస్తావు కవీ" అన్నది. జ్వరంలో ఆమె మతిబోయి యిలా మాట్లాడుతున్నదేమోనని వుద్విగ్నుడై ఖంగారుతో ఆమె హస్తాలపట్టి, శయ్యమీదికి అదుముతూ "నీవు పడుకో ప్రభా. జ్వరం సంధిలోకి దించిందేమోనని నాకు భయంగావుంది" అన్నాడు. ఆమె కిలకిలనవ్వుతూ, ఆయన హస్తాన్ని తనముఖమండలంమీద వేసి అదుముతూ "భయపడకు కవీ! ఇంతకుముందే నీవు పూర్వాశీవియోగపు

పాటను ఆలాపనచేశావు. అబ్బ! అందులో యెంత మాధుర్యంతో గూడిన మత్తు వుంది! ఆపాటలోని కూర్పు లయతానం సమ్మేళినమై; అమృతంవలె నీకంఠంనుంచి ప్రవహిస్తున్నపుడు, నీ శరీరంలోని ప్రతిఅణువుయొక్క వేదన సంయుక్తమై, సన్నిబద్ధమై శ్రావ్య సరాగమై, పీతాంబర ఫణిరాజ నాజూకువంపులరీతి ప్రవహిస్తుంటే మృతకళేబరాలు సైతం లేచి నృత్యంసలుపగలవు కవీ!" అన్నది. అనభిజ్ఞుని వలె ఆమెను కనులార్పకుండా చూస్తున్నాడు. తననుదురు మీదున్న ఆయనహస్తాన్ని మృదువుగా నిమురుతూ "మనము నాట్యశాలలో అనేకమారులు మీరువ్రాసిన 'పూర్వశీవి యోగం' ప్రదర్శించాము. కాని మీ పాటలో యెదుటి పాషాణాలనుకూడా పన్నీరుగా కరిగించు, యింత మాధుర్య మిదివరకెన్నడూ కనిపించలేదు కవీ! జన్మలో మరువరాని మధురఘడియ ఆ పాటను విన్నఘడియే" అన్నది.

"సానుభూతిలోగాని, అభినయంలోగాని సహజత్వం పుట్టిపడదు. వ్యథాభరితహృదయరోదనలు ఆక్రందనలలో నలిగి, కరిగి, మరిగి కావుర్లుక్రమ్మి జ్వాలాముఖవలె వేదన పొంగిపొరలునపుడు సాక్షాత్ దుఃఖదేవత పృథ్విమీద దొర్లి గింతలుబెడుతూ ప్రళయాన్ని ఆహ్వానించినట్లు ప్రేక్షకులు భీతిలుతూ వేదనాస్తోత్రంలోని కమనీయతకు ముగ్ధతనుబొంది, ఆ లయలో వూగిపోవుట సహజము" అన్నాడు. "అదేమిటి కవీ! ఆ పాటరచన అపుడయినా యిపుడయినా నీదే. ఆ నాట్యశాలలో పాడిందీ నీవే, యిక్కడ పాడిందీ నీవేగదా!" అన్నది. ప్రేమలోలుకు కోణదృక్కుల బరపుతూ, కవో

లాన్ని బట్టి మృదువుగా మెలివేస్తూ "ప్రశ్నలతో వేధించకు ప్రభా. అది అభినయం, యిది యదార్థవిలాపం. వీటిఅంతరం అనంతమైంది" అన్నాడు. "నీ ఆ వేదనా ప్రతిఫలమే ఆపాట అయినపుడు ఆపాటపాడుటలో యేసమయంలోనైనా సహజత్వం వుండాలిగదా." అన్నది. "హృదయందుఃఖావేదనలతో మరిగి, పొంగిపొరలినపుడే ఆపాటకు సహజత్వంవస్తుంది" అని అశ్వఘోష్ అంటుండగా దత్తమిత్రుడు ప్రవేశించి, విచారగ్రస్థ కంఠంతో "ఇలాంటి విషజ్వరాన్ని నే నిదివరకెన్నడూ చూడలేదు అశ్వం. పూర్తిగా నయమయినట్లే గనిపిస్తుంది. ఒక్కక్షణంలో తిరిగి వుగ్రుతరూపం దాల్చుతుంటుంది. ఇపుడెలావుంది ప్రభా?" అన్నాడు. సిగ్గిలుతున్నవదనంతో ప్రభ "బాగానేవుంది" అన్నది.

ప్రభ, అశ్వఘోష్‌లు తిరిగి యధావిధిగా కలిసి మెలిసి నాట్యశాలలోను బౌద్ధవిహార్‌లోను సరయూతీరాన తిరుగుతున్నారు. దూరదూరపట్టణాలనుంచి వస్తున్న "పూర్వశీవియోగ" నాటకప్రశంసలతో మరింత వుత్సాహితులై, యురోపిడ్ మొదలగు గ్రీకురచయితలనాటకాలను తరచితరచి చూస్తున్నారు.

మిత్రానంద్ ప్రభయింటినుంచి కాలకారామం వెళ్ళినప్పటినుంచి, ఆయనమనస్సు వుధృతరూపంలో కలవరపెడుతున్నది. అలసందానుంచి పయనమై వస్తున్నదారిలో తనను యేవైపుకు ప్రోత్సాహపరచిందో, యేమార్గంలో మానవపూర్ణత్వాన్నిపొంది, సమాజాన్ని ఆదర్శప్రాయంచేయువచ్చునని తార్కికంగా తనను నిరుత్తరునిచేసిందో, నిశ్చలము నిర్ధా

రితనుఅయిన తనను యేవైపుకు మరల్చుటకు లాలించిందో, తనవివేకమంతటితోను విన్నవించిందో, నేడందుకు భిన్నంగా మాట్లాడుట, తా నా రోజుల్లోవున్న అభిప్రాయాలవైపుకే తిరిగి మరల్చ ప్రయత్నించుట చీకాకును కల్పిస్తున్నవి.

ఒకనాటి అవాంఛనీయాలు మరోనాడు వాంఛనీయాలుగాను, ఒకనాటివాంఛనీయాలు మరోనాడు అవాంఛనీయాలుగాను పరిణామంపొందుట పరిపాటి. మానవస్వభావ మెప్పుడూ సందర్భపడనివాటివైపు అసంభవాలవైపు పరుగు లెత్తుట, అసంభవాలు సంభవాలయినపుడు వాటిమోజుపోయి, మరో అందరానిదానికొరకు ఆరాటపడుట, తనయెట్టయెదుట లభ్యమయినదానిని నిర్లక్ష్యంతో దూరంచేసుకుని, ఆతరువాత దానికొరకే విలపించుట సహజమైపోయింది.

ప్రభ తనకు సన్నిహితంగావుండి, తనను లాలింపులతోను, ముద్దులొలుకు మురిపాలతోను, అత్యధికఆప్యాయతతోను ప్రోత్సహించినపుడు తాను నిష్టలతో నియమాలతో ఆశయలక్ష్యాలదీక్షలో మత్తులో విముఖతను ప్రదర్శిస్తూ, నిరసనతో పయనించాడు. ఆనాటి ఆమెలాలింపులు వినతులు, ప్రేమదృక్కులు యీనాడు మధుసంచితస్మృతులై హృదయాన్ని చిందులుత్రొక్కిస్తున్నవి. ఆనాటి తా నవలంబించిన పరమపవిత్రము యోగ్యముఅయిన దీక్షలో నేడు మసక గోచరిస్తున్నది. ఆనాటి తనవ్యూహాలలోని శిఖరాలు నేడు శిథిలాలుగా గనిపిస్తున్నవి. ఆనాడు అయోగ్యంగా స్వార్థపూరితంగా సంకుచితంగా గనిపించినవే నేడు జీవితపూర్ణపథానికి సోపానములవలె గనిపిస్తున్నవి.

# ఆహుతి

భిక్షువుసంఘంలోగాని, సంఘకార్యక్రమంలోగాని మనస్సునకు ఈషణ్మాత్రం శాంతిలభించుటలేదు మిశ్రానందకు. తననలెనే ఆమెకూడా తా నిటుమారితే,ఆమె అటు మారెనా, లేక తన ఆంతరిక యదార్థలోతులను పరిశీలించు పరీక్షయా అను సందిగ్ధాలోచనలతో సతమతమవుతున్నాడు. మనస్సెప్పుడూ అస్పష్టవిషయాలలో ఆఖరినిర్ణయాన్ని తన కనుకూలంగానే చేసుకుని, సంతృప్తిని పొందుతుంటుంది. మిశ్రానంద్ మనస్సు అనుక్షణమూ ప్రభవైపుకే పరుగులెడుతున్నది. "బుద్ధభగవానునికి, ఆయనఆశయాలకు ద్రోహం చేసి, స్వార్థానికి పాలుమాలినవాడివవుతావు. నీ జీవితం అలాంటి నికృష్టపథానికి గాదు, ఉత్కృష్టకార్యానికి" అని మనస్సులోని నో ప్రవృత్తి చైతన్యాన్నిగల్పిస్తుంటుంది. "పిచ్చివాడా, మానవజాతిసంతతిని తనుగీచినగీటుమీద నడువమని బుద్ధభగవానుని ఆశయంగాదు. సుఖప్రదమైన సర్వశ్రేష్టమైన,ఈర్ష్యాద్వేషదుఃఖరహితమై సమానత్వము సౌభ్రాతృత్వము సమిష్టిక్షేమమే ఆశయంగాగల మానవ సమాజనిర్మాణమే వారిఆశయము. వ్యక్తిగతసుఖాలకొరకు వ్యక్తిగతసంపత్తికావాలి;ఆ సంపత్తిసంపాదనలో పోటీలుపడి, ఈర్ష్యాద్వేషాలు మోసాలహద్దులను అతిగమించిరాక్షసత్వం పొందారు.కనుక,కాంక్షలను విసర్జించమన్నాడు;వ్యక్తిగతసంపత్తులకు తిలోదకాలివ్వమన్నాడు.సేవాభరితజీవితమేయుత్కృష్టమైందిగా భావించమన్నాడు.అందు జీవితసర్వస్వాన్నిసమాజసేవ కంకితమొనర్చి, భిక్షువుగా జేయుట పరమోన్నతమార్గ

మన్నాడు. అయితే మానవులందరూ ఆమార్గాన్నే అవలం బించి, భిక్షువులయితే, మానవజాతే అంతమొందుతుంది గదా, కనుక బుద్ధభగవానునిఆశయమర్మము అంతేకాదు. ఆ భిక్షుసంఘము తనవాంఛిత సర్వశ్రేష్ఠసమాజనమూనా ప్రతిబింబప్రదర్శన మాత్రమే. కుటుంబసుఖాలను పొందుతూ, బౌద్ధమతావలంబిగా ఆదర్శరూపంలో ప్రదర్శిత మవుతూ, సమష్టిసుఖాన్ని సమష్టిక్షేమాన్ని వాంఛిస్తూ, అందుకే తన యావత్ శక్తిని వినియోగిస్తూ శాంతితోను సుఖసౌఖ్యాలతోను పరస్పరానురాగాలతోను ఆనందాను భూతులతోను తులతూగుతుండు మన్మథమయసామ్రా జ్యాన్ని నిర్మించుటే బుద్ధభగవానుని ఆశయమైవుంటుంది గనుక, నీవు కుటుంబీకుడవైనపుడే సృష్టిలోని పూర్ణత్వాన్ని చూడగలవు, పొందగలవు. పూర్ణత్వంలోని నవసమాజాన్ని వూహించగలవు, నిర్మాణానికి కృషిచేయగలవు" అని మరో ప్రవృత్తి అన్నది.

ఆయనహృదయతంత్రులమీద యెవరో మృదువుగా మీటినట్లు మర్మముడులు విప్పారితమై సరాగసంబద్ధఆలో చనలు తంతియలుతంతియలుగా పవనసవ్వడులనుప్రాకినట్లవు తున్నవి. ఆనందస్పందనలలో సర్వాంగాలు పులకితమై తీయతీయని కూనరాగాలను చిందిస్తున్నవి. రోహిణియెండ లకుబీటలువారిన పృథ్వి వసంతరుతువుతో హరితవర్ణమై ప్రకృతి సిద్ధ సుగంధాలను వెదజల్లుతూ మనోహరదృశ్యాలతో శోభించునట్లు మిశ్రానంద్ శరీరంలోని ప్రతిఅణువు నూతన నోత్సాహాన్ని పొంది, విజయగీతికను ఆలాపిస్తున్నది.

ప్రభకు తనయెడలనున్న సానుభూతి, శ్రద్ధాభక్తులు అపారమని తననుప్రేమిస్తున్నదని మిత్రానందుని దృఢాభిప్రాయం. ఆనాటిప్రయాణంలోని అనేకసంభాషణలు సంఘటనలు ఆయనతలపులను ధృవపరుస్తున్నవి. ఈనాటి ఆమెవిముఖత కేవలం తనలోని స్థిరత్వాన్ని పరీక్షించుటకేనని ఆయన సంతృప్తి. ఆమెలేని తనజీవితం నిరర్థకమని, అసంభవమని, సుస్పష్టరూపంలో, అభేద్యమైననిర్ణయంతో తెలియజేయుటకుకూడా నిర్ణయించుకున్నాడు. దీనత్వంతోను శుష్కత్వంతోను అనభిజ్ఞతలోనున్న ఈ సాధుజీవితంలో యదార్థశాంతి లేదుగనుక, స్వస్తిజెప్పనున్నట్లు ఆమెకు వినిపించ నిర్ణయించుకుని బౌద్ధమతావలంబినియైన ఆమెతో తాను అన్నివైపుల నుంచిసర్వతోముఖంగాకలిసిపోయి, ఈర్ష్యాద్వేషాలు,కక్షలు, కార్పణ్యాలు,కుత్రిమాలు, కౄరత్వాలు లేని ప్రేమాదరాలతోను, శ్రద్ధాభక్తిప్రపత్తులతోను, హృదయోన్నతిలోని అనుభూతులతోను పూర్ణరూపాన్ని పొంది ప్రకృతితరంగాలలో వూగుతూ సమాజంలోని ప్రతిఒక్కరిని ఆ స్థాయికి, తన స్థాయికి పైకిలాగ ప్రయత్నిస్తూ సమాజంలోని సర్వప్రజలను తనస్థాయికి తెచ్చినపుడు, సర్వాంగసుందరంగా రూపొందు ఆదర్శసమాజాన్ని చూచి, బుద్ధదేవునిఆశయం నెరవేరిందని అనిపిస్తుందని అనుకుంటుంటే, ఆయనసర్వాంగీణము పులకితమవుతున్నది.

మనస్సులోని యీ దాగుడుమూతలాటలో సమయాన్ని దొర్లించుట దుస్తరంగావుంది మిత్రానందుకు. ఆమె లేకుండా యిక యీలోకంలో ఒక్కఅడుగు ముందుకు నడ

చుటకూడా, తన కసాధ్యమన్న విషయాన్ని ప్రభకు తెలియ జేయాలని అంతర్గతఆందోళన చెందుతున్నాడు. ఆమెను యేకాంతంగా కలుసుకుని తనమనస్సులోని వివరాలన్నీ చెప్పాలని స్థిరంజేసుకున్నాడు.

దత్తమిత్రుడు గృహావెచ్చాలసేకరణకొరకు నౌఖరుతో సంతకు వెళ్ళిపోయాడు. ప్రభతల్లి వంటశాలలో యేదో పనిచూసుకుంటున్నది. భోజనాదులు ముగించుకుని, నాటకశాలకు పోనున్న ప్రభ అశ్వఘోషులు భుక్తాయాసంతో గాబోలు, హాలులోని తఖతాబల్లమీద వాలి, బోరగిల తిరిగి, శరీరభారాన్ని మోచేతులమీద మోపి, శిరస్సును పైకెత్తి, బుగ్గనున్న యెండుఖర్జూరకాయను దంతాలమధ్య బెట్టి నొక్కుతూ "అదిసరేగాని, ప్రభా, తానొకటితలిస్తే దైవం వేరొకటి చేశాడన్నట్లు, నీకు కనిపించకుండా నేను యెన్నిరోజులు యేది వ్రాయాలని ప్రయత్నించానో, అన్నిరోజులు నీవు జ్వరంతో బాధపడ్డావు. నేనువచ్చినపుడు నీ జ్వరంచూచి, అధీరుణ్ణయిపోయాను. ఆతరువాత వెంటనే ఆకస్మికంగా తగ్గిపోయిం దెందుకని?" అని ప్రశ్నించాడు. ప్రభ కొంగుతో ముఖంతుడుచుకుంటూ వచ్చి, ప్రక్కగా బల్లమీద కూర్చుని, ఆయనచుబుకాన్నిబట్టి తనవైపుకు త్రిప్పి, మందహాసాలొలికిస్తూ "అయితే, జ్వరంవచ్చినందుకు చెప్పమంటారా, లేకపోయినందుకా?" అని యెదురుప్రశ్న వేసింది. ఆయన వుత్సాహభరితుడై "రావటానికి పోవటానికి, రెంటికీ కారణాలు చెప్పు ప్రభా" అన్నాడు. ఆమె మరింత మందహాసంచేస్తూ "ఆరెంటికీ మీరే కారణమంటే

విశ్వసిస్తారా?" అన్నది. ఆయన అలిగినవానివలె ముఖాక్రుతి చేసి "పో ప్రభా, యెల్లప్పుడూ వ్యంగ్యంపనికిరాదు. నిజానికి స్త్రీకి వివేకము విజ్ఞానము అధికమైతే, పురుషుడు వేగలేడేమో ననుకుంటాను" అన్నాడు. "అబ్బ! కవీ, నీవు మహాకవివి. నీలోకూడా స్వార్థాలు పక్షపాతాలు వున్నవా? వివేకానికి విజ్ఞానానికి స్త్రీపురుషవివక్షతఎందుకు చెప్పు? అది ఒక జాతి సొత్తు కాజాలదు కవీ!" అని పరిహాసరూపంలో కోరగా చూసింది. "ఇష్టాలు అయిష్టాలు అనేవి కవిత్వానికి ప్రాణం లాంటివి. స్వార్థప్రతిబింబాలే యిష్టాలు అయిష్టాలు. స్వార్థం లేకుండా కవి కాజాలడు. అసలువిషయం చెప్పవుగదా నీవు" అన్నాడు. "అసలువిషయం నీవే కారణమన్నాను గదా!" అన్నది. పెద్దగా యోచిస్తున్నవానివలె నుదురు రుద్దుకుని, పాలుబోనివానివలె "నీకు జ్వరమొచ్చుటకుగాని, పోవుటకుగాని నే నెలా కారణంకాగలనో నా కర్థమువుట లేదు ప్రభా. నిజం చెబుతున్నాను." అని దీనధ్వనిలో అన్నాడు. వెంటనే ప్రభ యేదో చెప్పబోయిందికాని, కంఠము పెగల లేదు; కళ్ళు చెమ్మగిలినవి. అధరాలు అదురుతున్నవి; ముఖం జేవురించింది. చెప్పటానికి మరింత ప్రయత్నించినమీదట మాటకుబదులు దుఃఖరోదనలు పొర్లినవి; అశ్రువులు యేక ధారగా వలుకుతున్నవి. ఆయన వెంటనే లేచికూర్చుని, ఆమెశిరస్సును తనవక్షస్సుమీదకు వాల్చి కపోలాలమీద నిమురుతూ, ఆశ్చర్యాలోలుకుకంఠంతో "ఏమిటి ప్రభా, విషయమేమిటో చెప్పు?" అని అడిగాడు. ఆమె దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ అస్పష్టశబ్దాలలో "నన్ను వంటరిగా

యెన్నటికీ విడిచిపెట్టకు కపి." అన్నది. ఆమె అశ్రువులను తుడుస్తూ, కంఠాన్ని నిమురుతూ "భయపడకు ప్రభా, నిన్ను యెన్నటికీ వంటరిగా విడువను. జరిగినదానికి నన్ను క్షమించు. కాని అసలువిషయ మేమిటి ప్రభా!" అని ప్రశ్నించాడు.

క్వినయిన్‌ను మ్రింగినట్లు ఆమెకంఠంనుంచి పొర్లుతున్న దుఃఖాన్ని మ్రింగివైచి, దుఃఖగీరలలో కలిసిన శబ్దాలతో, "మిశ్రాసంద్ బౌద్ధమతావలంబనలో అకుంఠితమైన దీక్షా పరుడు. తనసర్వస్వాన్ని సంఘానికర్పించిన నిరతుడు. అల సందాలో ప్రజామన్ననలబొందిన నిరాడంబర సంఘసేవ కుడు. మా కుటుంబాన్ని వుద్ధరించిన రక్షకుడు. ఆయన యెడల నాకేగాదు, మా కుటుంబానికి అపార భక్తిగలదు. వారిని నేను పూజించగలను కాని, ప్రేమించలేను. నాహృదయ మంతటిలోను నిన్ను నింపుకున్న సంగతి ఆయనకు తెలియదు కపి. ఆయన అమాయకుడు. తనమార్గమునుంచి లక్ష్యాల నుంచి జారిపోయాడు. నేడు దారితప్పిన పథికుడు. నేటి ఆయనధోరణి జూస్తుంటే, దయతోను, జాలితోను భయ భీతులతోను మిళితమై నాహృదయంలో ప్రచండతుఫాను చెలరేగుతున్నది!" అంటుండగా భరింపరానిదుఃఖకంపనలు కుదిపివేస్తున్న ఫలితంగా అశ్వఘోష్‌పాదాలవైపు ఒరిగిపోయి రోదిస్తున్నది. అశ్రువులు ఆయనపాదాలమీదపడి తపన స్థాయిని తెలియజేస్తున్నవి.

అశ్వఘోష్ కళవళపాటుతో ఆమెశిరస్సునుపట్టి యెత్తుతూ "ఏమిజరిగింది ప్రభా, విషయ మేమిటో చెప్పవా? నీకు జ్వరమొచ్చుటకు, ఆకస్మికంగా క్షణంలో అదృశ్యమవు

టకుగల కారణాల నడిగాను. వాటికిబదులుగా నీవు అసందర్భమైనవిషయాలేవో తెచ్చి, దుఃఖిస్తున్నావు. ఏమిటో అర్థమయ్యేట్లు చెప్పు ప్రభా." అని గోదాగ్నిధోరణిలో ప్రశ్నించాడు. కాని ఆమె యీమాటలను వినగలిగేస్థితిలో లేదు. హృదయంలోని దుఃఖం పొంగి ఆక్రందనరూపంలో బయల్పడుతున్నవి. రొప్పుతున్నది. అధరాలు అదురుతూ వక్త్రాలు తిరుగుతున్నవి. అశ్రువులు ప్రసనంతులుగా స్రవిస్తున్నవి. రుధిరాన్ని పులుముకున్న శశిధరుని బోలివున్నది ముఖమండలము. కారుతున్న కన్నీటినితుడుస్తూ కరుణార్ద్రకంఠంతో "అబ్బ! యీ దృశ్యాన్ని నేను భరించలేను ప్రభా! లోలోన కుములుటతో సమస్యలు పరిష్కారంకాజాలవు. పరస్పరం వినిపించుకొనుటలో యెంతకఠినసమస్యలయినా పరిష్కృతమవుతవి. వుపశాంతియైనా లభిస్తుంది. ఏమిటో వివరంగా చెప్పు? మిత్రానంద్ నిన్నేమయినా అన్నాడా?" అని ప్రశ్నించాడు. ఈ మాటలనుకూడా వినగలస్థిమితం ఆమెలో లేదు. ఆయన బాహువులమధ్య అర్థంగాని ఆ వేదనలో, కుమిలి కుమిలి విలపిస్తున్నది.

బయటివైపునుంచి కిటికీగుండా నాపరాతిఫలకాలు రెండు ఒకేమాటుగా లోపలకు జారిపడినవి. అందు ఒక ఫలకం 'ఫట్' మని రెండుగా వ్రక్కలయింది. ఆ రాళ్ళు అక్కడ యెందుకుపడినవో యేమో తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాడు అశ్వఘోష్. కాని తనచేతులలో సుధిలేనివ్యథతో వ్రాగిపోతున్న ప్రభ వుండిపోయింది. అర్థంగాని

ఆందోళనలలో ఆమెను నోదారుస్తూ, ఆమెవైపూ ఆ రాతి ఫలకాలవైపూ చూస్తున్నాడు.

అరగంటఅనంతరం ప్రభ స్థిమితాన్ని బొందింది. అశ్వఘోష్అరచేతిని తనముఖమండలానికి వేసి మృదువుగా అదుముకుంటూ "నన్ను క్షణంకూడా వంటరిగా విడువకు కవీ!" అని దీనంగా అన్నది. "అసలువిషయ మేమిటో విడమర్చి చెప్పు ప్రభా!" అన్నాడు అశ్వఘోష్. "సానుభూతిలో మనోదౌర్బల్యముంటుంది. మనోదౌర్బల్యంలో భయభీతిని బొందుట సహజం కవీ." అంటూ ఆమె నెమ్మదిగా లేచి తనదుస్తులను దిద్దుకుంటున్నది.

అశ్వఘోష్ ఆత్రతతో వెళ్ళి హాలులోవల పడిన ఆ రాతిఫలకాలను ఒక్కటొక్కటిగా యెత్తి చూచి, ఆశ్చర్యాన్వితుడై అలానే నిలిచిపోయాడు. ప్రభ అనభిజ్ఞురాలివలె "అలాఅయిపోయావేమిటి కవీ? ఆ రాళ్లెక్కడివి?" అంటూ ఆయనప్రక్కగా జేరి, ఆ ఫలకాలను పరిశీలిస్తున్నది. రాతిముక్కతో ఆ రాతిఫలకాలమీద ప్రాకృతభాషలో యేదో వ్రాయబడివున్నది. అశ్వఘోష్ పరిశీలిస్తున్నరాతిని పైకియెత్తి తాను చదువుతున్నది.

"ప్రభా, నిన్నుచూడాలని, నా బాధను విశదంచేయాలని యింతకుముందే యిక్కడకు వచ్చాను. నీ మాటలను పూర్తిగా విన్నాను. నా భ్రమ దూరమయింది. కాని మనస్సు యీ మార్గంనుంచి మరలుట దుస్సాధ్యమైంది. సేవామతులోనిదీక్షలనుంచి లక్ష్యాలనుంచి జారి, సుఖస్వప్నాలలో విహరించినవాడు, ప్రేమసాగరంలో మునిగినవాడు

అగ్నిగుండానికి ఆహుతికాగలడుగాని, యిసుకయెడారిలో పయనించలేడు. నీ ప్రేరణే నన్నీమార్గానికి మరల్చినట్లు వూహించాను. నేడు నిరాశ నిస్పృహాలలో మునిగి, అన్ని వైపుల ఆవరించివున్న గాఢాంధకారంలో శోధిస్తున్న మన స్సుకు మరోమార్గము వెలుగు కనిపించుటలేదు. ఈ అంధ కారంలోకూడా అంతఃప్రవృత్తులన్నీ అటువైపుకే పరువు లెడుతున్నవి. అందుకనే యిందు నీ ప్రేరణాదోషము లేదు. ఇది కేవలం ప్రకృతిసిద్ధమైంది. కఠోరనిర్ణయాలతో నిర్మించు కున్న దీక్షలోని లక్ష్యాలు ఆశయాలు ఆదర్శాలు తుఫానుకు వ్రేళ్ళతో పెళ్ళగిలిపోయినవృక్షాలవలె, కూలిపోయినభవ నాలవలె, చెదరినపుడు, చెరిగినపుడు కలిగే నిస్పృహాతో నిరాశతో పయనించగలడు, నూతనవెలుగును సృష్టించుకో గలడు. కాని, ప్రకృతిసిద్ధంగా హృదయాంతరాళంలో అంకు రించి వికసించిన పవిత్రప్రేమ విఫలమందినపుడు అన్నివైపుల అంధకారంలోని శూన్యందప్ప ఏమీ మిగులదు. కర్కశ రూపమయిన యీ శూన్యంలో పయనించుటకంటె, విరమిం చుట మహోత్కృష్టమైంది. ఆత్మహత్య అసమర్థత్వంలోని నగ్నరూపమనునది శుద్ధఅబద్ధము. జీవితంలో విఫలంబొందిన వారు ఆత్మహత్యను ఆశ్రయింపజాలక సాహసంలేక తమ పిరికితనాన్ని కప్పిపుచ్చుకోను తమఅసమర్థత్వాన్ని మభ్య పెట్టను ఆత్మహత్య మహాపాపమని పిరికితనమని ప్రచారం చేశారు. వ్యథాభరితహృదయంతో క్షోభిస్తున్న మనస్సుతో భరింపరానిబాధలతో నైరాశ్యతలోని శూన్యతలో చావుకు భయపడిన పిరికివాడుదప్ప పయనింపజాలడు. శిధిలంలోనే

నూతననిర్మాణాలు జరుగుతుంటవి. నీ జీవితంలో నేను అడుగుఅడుగునా కనిపిస్తూ హృదయంలో కలతలనుకల్పిస్తూ, అశాంతిని పెంచుతూ, దుఃఖాలతో మెలివేయకుండా, స్వేచ్ఛగా అశ్వఘోష్‌కవితో కలిసి ఆనందజీవితాన్ని పొందుటకు ఆత్మహత్యారూపంలో నాజీవితాన్ని నీకు నిస్వార్ధరూపంలో అంకితమొనరుస్తున్నాను. సమాజానికి నూతన సందేశాన్ని సమర్పించగల నీ హృదయాన్ని బొందిన కవి మహా అదృష్టవంతుడు. నీ ప్రేరణలో ఆయన అనంతశక్తిని పొందగలడు. మీ యిరువురిని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

ఇట్లు

మీ మిత్రానంద్"

వలుకుతున్న అశ్రువులను అద్దుకుంటూ, అతిప్రయాసతో ఆ రాళ్ళమీదివ్రాతను చదువగలిగింది. అందులోని ఒకొ్క వాక్యము ఒక మరశీలవలె తనగుండెల్లోకి గిరగిర తిరుగుతూ పోతున్నట్లనిపించింది. క్షణక్షణము ఆమెహృదయము ఆగిపోనున్నట్లు తోచింది. ఆ లేఖలోని ఆఖరిపంక్తులు చదివినక్షణంలో ఆమె కూలినకుప్పవలె పృథ్వీమీదకు వాలిపోయి, అశ్వఘోష్‌పాదాలను చుట్టవేసి కుములుతున్న దుఃఖంతో విలపిస్తున్నది. ఆమెశిరస్సునుబట్టి లేవనెత్తుతూ గ్లానిభరితకంఠంతో "ఆశ నిరాశలతోను, సుఖదుఃఖాలతోను వక్రాలవలెతిరుగుతూ దాగుడుమూతలాడుతుంటుందిమానవ జీవితము. నిరాశలోనిస్పృహ చెందినా, దుఃఖంలో అధైర్యం పొందినా జీవితమే వక్రిస్తుంది. దుఃఖంలో సుఖాన్ని సృష్టించు

కుని వెలుగును శోధించవచ్చు. అధీరతలో అజ్ఞానంపొడసూపి అంధకారం ఆవరిస్తుంది. లే, ప్రభా, ముందు మిత్రానందుని ఆత్మహత్యనుంచి కాపాడుట మనకర్తవ్యము" అంటూ ఆమె హస్తాన్నిబట్టి బయటకు దారితీశాడు.

కాలకారామభిక్షుసంఘము, పరిసరప్రాంతాలు వెదకి హతాశులయ్యారు. ఇరువురూ ఒకరినొకరు పలుకరించుస్థితిలో గాని, ప్రశ్నించుస్థితిలోగాని లేరు. ఎవరిహృదయాలలో యేమి దొర్లుతున్నదో మౌనవ్రతధారులై యిరువురూ వకరివెంట మరొకరుగా బౌద్ధవిహార్ నుంచి సరయూవైపుకు వెళుతున్నారు. అది మూడవఝామునసమయము. సరియూ తపతపలాడుతున్న తరంగాలతో రజితకాంతులను వెదజల్లుతున్నది. నదిఅంచులనున్న వృక్షరాజాలమీది పక్షిజాలాలు కునుకు తీస్తున్నవి. ఆ యిసుకతిన్నెలమీదుగా పోతున్న మౌనవ్రతధారులు యెందుకు పోతున్నారో యెక్కడికి పోతున్నారో వారికీ తెలియదు, ఇతరులకూ తెలియదు. అది స్వైరవిహారమూగాదు, పరిశోధనాపయనమూ గాదు. హృదయంలో ఆందోళనపెడుతున్న కలవరంలోని ఖంగారుతో ఆత్రుతలో అనభిజ్ఞులై అడుగులోఅడుగువేసుకుంటూ ముందుకు పోతున్నారు. వారిఅడుగులసవ్వడి విని గాబోలు, నీటిఅంచున జేరిన మార్జాలాలు పరువులెడుతున్నవి. అనంతాకాశములో విహరిస్తున్న పక్షులు వుండివుండి రివ్వున పైకిపోతున్నవి. హృదయాలను కంపింపచేసే దుఃఖపూరితప్రవాహాలలో మునకలువేసుకుంటూ, వూపిరిసలుపక అపుడపుడు పైకి ప్రక్కలకు చూస్తూ, తిరిగి అధోముఖంజేసి నడుస్తున్న వారి పాదాల

ముందు ఆకస్మికంగా కాషాయవస్త్రాలకుప్ప, దానిప్రక్కన కమండలము గనిపించి, విస్మితులైనారు. కళవళపాటుతో ఖంగారుపడుతూ అశ్వఘోష్ అనభిజ్ఞునివలె, ఆ కమండలాన్ని వస్త్రాలను పైకితీసి పరిశీలనచేస్తున్నాడు. ఆ కమండలం ప్రభకు చిరపరిచితమైందే. ఆ గేవారంగుశాలువామీంది మరకలముద్రలు తనకు బాగా తెలుసు. దొంగలబారిచిక్కినపుడు తనగాయాల రుధిరంతాలూకుమరకలే అవి. దుఃఖం పొర్లుతున్న కంఠంతో "ఎంతపని చేశావు మిత్రానంద్!" అంటూ కుప్పవలె కూలబడింది. అశ్వఘోష్ దీర్ఘశ్వాసతో కర్తవ్యోన్ముఖుడై సరయూలో దూకి మునకలు వేసుకుంటూ, సుడిగుండాలలో పరిశోధించాడు. వడ్డులదూరంవరకు గాలించాడు. నిరాశతో తిరిగి ప్రభవున్న చోటికే వచ్చి, ఆమెస్థితి చూసి నొచ్చుకుంటూ లేవదీస్తూ, ముఖంమీంద తడిగుడ్డవేసి తుడుస్తూ "ఇంత అధీరతచెందినందువలన ప్రయోజనంలేదు. నదివడ్డున కొంతదూరం పోయి వెదుకుటవసరను" అంటూ ఆమెను నడుపప్రయత్నించాడు. కాని తేలిపోతున్న పాదాలతో ఆమె తూలుతున్నది. పాలుబోనివాడై "సరే, నీ విక్కడే కూర్చునివుండు, నేను వెళ్ళి వెదికివస్తాను" అని బయలుదేరాడు.

సంధ్యాసమయంవరకు అశ్వఘోష్ నదివొడ్డులవెంట వెదుకుతూనేవున్నాడు. కాని ప్రయోజనం లేకపోయింది. అధికంగా యేమీ తెలుసుకోలేకపోయాడు. నిర్జీవిలావున్న ప్రభను తనవూతంతోను, సాంత్వనపుమాటలతోను బౌద్ధవిహార్లోని తిన్నెవరకు నడుపుకెళ్ళి విసగడతో "ప్రభా,

నీ స్థితి అర్థంగాని అసందర్భమైందిగా వున్నది. అన్నిటికీ అవధులుంటవి. కాని, నీ వ్యవహారం విచిత్రమైందిగా వుంది. నీకూ బ్రహ్మానంద్‌కున్న సాంపర్క్యమేమిటో అసందిగ్ధంగా తోస్తున్నది. నీ ప్రక్కనుండి చీకాకును కలిగించుటవుతుం దేమోననుకుంటాను. నీవు జాగ్రత్తగా యింటికి వెళ్ళు" అంటూ అశ్వఘోష్ తేలిపోతున్న అంగలు వేసుకుంటూ నాట్యశాలవైపు నున్న పొదరింటి ప్రక్కకెళ్ళి ఆసీనుడైనాడు.

ఆయన మనస్సు విరుద్ధధ్వానులతో కల్లోలపడుతున్నది. దూరంగా కనిపిస్తున్న పర్వతాలు కావుస్త్రగమ్మిన పొగలవలె తిరుగుచున్నట్లున్నవి. అనంత ఆకాశంలో తేలియాడుతున్న మేఘాలు వణుకుతున్నట్లున్నవి. పశ్చిమాన కోరగా చూస్తున్న సూర్యునిలో నిరాశాదృక్కులు కనిపిస్తున్నవి. మయూరకూజితాలు అపశ్రుతులవలె కఠోరంగా వినిపిస్తున్నవి. పవన తెమ్మెరలకు రెపరెపలాడుచున్న చెట్లఆకులు అపహాస్యరూపంలో కరతాళధ్వనులు సల్పుతున్నట్లున్నది. పుష్పగుచ్ఛాలమీద స్వయంవరవిహారిగా తిరుగుతున్న మధూకం చేస్తున్న గానం లో విలాపశ్రుతులు వినిపిస్తున్నవి. అనాలోచితంగా ఆయన కనులనుంచి కన్నీరు కపోలాలమీదుగా స్రవిస్తున్నవి. లలాటంమీద ముత్యాలవలె స్వేదబిందువులు మెరుస్తున్నవి.

దీర్ఘ వేడినిట్టూర్పును విడుస్తూ, ఫాలభాగంమీద చేయివేసి అనుకుంటూ "ఈ లోకంలో మనస్సును పరాధీనంచేసుకొనుటకంటె హీనమైంది మరొకటిలేదు. పరాధీన మనస్కుడు మృతసమానుడు. మృతసమానజీవితంకంటె మృత్యువే ఉత్కృష్టమైంది. అందుకే బ్రహ్మానంద్ ఆత్మ

హత్యను స్వీకరించాడు. మిశ్రానంద్ ప్రభలసంబంధాలు యెంత ఘనిష్టమైననో?" అనుకుంటుండగా ఆయనమనో నేత్రానికి ఆ రాతిఫలకాలమీది లిఖితపంక్తులు సుస్పష్టంగా గనిపిస్తున్నవి. వాటిని చదువుతుంటే దీనతలోని ఆ సాధు సజ్జనునిముఖం గోచరిస్తున్నది. ఆ అమాయక భిక్షువు ఆత్మ హత్యకు, తన అసహనీయమైనవ్యధకు కారకురాలైన ఒకస్త్రీ స్వరూపం అస్పష్టరూపంలో ఘృణితరూపంలో గనిపిస్తున్నది. వుత్తేజితుడై అశ్రుభరితనయనాలను నులుముకుంటూ, వ్యధా భరితకంఠంతో "స్త్రీస్వరూపవ్యధాగ్ని! నిన్ను ఆ సృష్టికర్త కూడా అర్థంచేసుకోలేదు. పురుషునిహృదయంలో వ్యధాగ్నిని రగుల్చుట నీకు వినోదముగావచ్చుకాని, ఆ తాపం జ్వాలా ముఖపర్వతాలకు మించినదని నీకు తెలియదు. నీ చంచల త్వంచే పురుషహృదయాలు దడదడలాడుతూ, తపనలో దహించుకుపోయి వినాశమొందుతుంటవి. కాష్టము పేర్చి, కణకణ మంటజేసి, కనులవిందుగా జూచు స్వభావము నీది. నీవు సర్వకాలాలకు అర్థంగాని వైచిత్ర్యానివి."అంటూ దీర్ఘ వేడినిట్టూర్పును విడుస్తూ, పృథ్విమీద వాలిపోయాడు. కనుకొలకులగుండా జారుతున్న తాపంతోగూడిన కన్నీటి బిందువులు కర్ణరంధ్రాలలోకి పోతున్నవి. రుద్ధరూపంలో అంతర్గతంగా తనలో తానే గొణుక్కుంటున్నాడు. "నిన్ను నిందించుట నా అవ్యక్తము ప్రభా, నీవు నా నాటకములోని పూర్వశివిగానే వుండిపో. నీ వియోగములోని వ్యధాభరిత భావాలనే అందు నింపుకున్నాను. నీవు నా హృదయంలో

శాశ్వతంగా ఆ వియోగరూపముద్రలతో వుండిపో ప్రభా"
అని నేత్రాలుమూసి అనుకుంటున్నాడు.

అచేతనావస్థలోనున్న ప్రభ అయిదునిమిషాలఅనంతరం మూలుగుతూ లేచి అటూయిటూ పరికించింది. అశ్వఘోష్ కనిపించలేదు. ఆయన వెళ్ళిపోతూ అన్నమాటలు అస్పష్టంగా వినిపించినగుర్తు. తనను యీస్థితిలో విడచిపోవుట సామాన్యమైనవిషయంగాదు. అన్నివైపుల తన కాఘాతం సంభవించినట్లు, విధి వక్రించినట్లు, హృదయాందోళితురాలై అనభిజ్ఞురాలివలె ఆకాశమును పృధ్విని పరికిస్తున్నది. ఆ రెండూ యేకమై యీ సర్వసృష్టిని లయింపజేయాలని ఆమె వాంఛ. ఇపుడు మిత్రానందుని ఆత్మహత్యకంటె అశ్వఘోషుని అదృశ్యం ఆందోళనపరుస్తున్నది. మిత్రానంద్ అశ్వఘోష్‌లు ఒకరితరువాత ఒకరుగా తనముందు దీనంగాను, మరుక్షణంలో హెచ్చరికజేస్తున్నట్లు క్రోధితరూపంలోను గనిపిస్తున్నారు. తాను అత్యాచారిఅయినట్లు తనకౄరత్వాలకు వారు గురియైనట్లు, తాను వారిని భరింపరానిదుఃఖకూపంలోకి దొర్లించినట్లు మనస్సులో అసందిగ్ధమైన ఆలోచనలు దొర్లుతున్నవి. హృదయఫలకం దడదడ కొట్టుకుంటున్నది. వూపిరి సలుపుటలేదు. హృదయంలో కొండలు దూరినట్లు బరువెక్కిపోతున్నది. మనస్సు వేడితో తపనజెందుతున్నది. జిహ్వ పిడచగడుతున్నది. అశ్రుభరితనయనాలముందు అంతా అంధకారం ఆవరిస్తున్నది.

"నిశ్చలాతినిశ్చలము దృఢముఅయిన మనస్సుతో మార్గావలంబిగానున్న ఆ పవిత్రమూర్తిస్వగూపుడయిన

మిత్రానంద్‌తో ఆనాడు అలాంటి అసందర్భప్రలాపా లెందుకుచేశాను? అంతగా యెందుకు తర్కించాను? ఆయన్ను పతనోన్ముఖునిచేసి, ఆత్మహత్యకుగురిచేసిన మహా పాపిని నేను. ఇటు మహాకవినికూడా దుఃఖపెడుతున్న మూర్ఖురాలిని నేను." అని వాపోతూ, పట్టరానిఆవేశంలో పొర్లిన దుఃఖంతో తిన్నెమీదపడి దొర్లిగింతలుపెడుతూ పెద్దపెట్టున విలపిస్తున్నది. మానవహృదయంలోని దుఃఖము అవధులకు మించినపుడు పెద్దపెట్టున యేడ్చి కన్నీరు కాల్వలుగాకార్చిన గాని, హృదయం రవంత తేలికపడదు. ఆమె యేడ్చియేడ్చి కన్నీరు కార్చికార్చి సొమ్మసిలి, నేత్రాలుమూసింది. నిద్రావస్థలో ఆమె కలవరపాటుచెందుతున్నది.

ఆమె యెటుజూచినా మిత్రానంద్ గనిపిస్తున్నాడు. ఆయన కనిపించనిచోటికి పోవాలని ఆదుర్దా పైకి యెగసింది. యెంత పైకిపోతున్నా మిత్రానంద్ వెంటాడుతూనేవున్నాడు. "మానవపూర్ణత్వంలోని సుఖప్రదమార్గాన్ని చూపావు. కుటుంబీకజీవితంలో సమష్టిసుఖాన్ని సృష్టించు కళ్యాణకర మార్గాన్ని కనులముందుంచావు. మునుపటిమార్గం నాకిపుడు కంటకమైంది. నీవులేకుండా నేను పయనించలేను. నీ ప్రేరణతో నూతనజీవితాన్ని పొందాను. నా మనస్సు మారిపోయింది. హృదయం సుకుమారకుసుమరూపంలో వికసించింది. శరీరతత్వాలు మారినవి. నాలోని యావత్తూ నిన్ను వాంఛిస్తున్నవి. నీకొరకు తపిస్తున్నవి. నీ వానాడు నాలోని యీ మార్పేగదా కోరింది. ఇపు డలా పారిపోతావెందుకు ప్రభా." అంటూ తనను ప్రార్థిస్తున్నాడు. ఆ మా

టలు సూదులవలె పొడుస్తున్నవి. వినజాలక యింకా వేగంగా పోతున్నది. "పదవులెత్తి ప్రయోజనంలేదు. నీవు స్త్రీవి. రెచ్చగొట్టుట నీస్వభావము. నీప్రేరణద్వారా రగిలిన మంట నిన్నూ ఒకనాడు మాడ్చివేస్తుంది. నా పూర్వాశీవియోగ వ్యధలో అలవబడి, అందులోనే ఆనందాన్ని శోధిస్తున్న నా ముందుకొచ్చి చెదిర్చి, విచిత్రానుభూతులనొసగి నటనా నైపుణ్యాన్ని ప్రదర్శించావు. అమాయకుడయిన ఆ సాధు పుంగవుని హతమొనర్చావు. నన్ను కొరగానివానిగా చేశావు. నీ మాయమాటలలోని మాధుర్యం యెవరినైనా పరవశపరచగలదు. సరయూవిజయంనాటి ప్రథే నా పూర్వాశి. నీవుమాత్రం కాదు. నీవు రెచ్చగొట్టి చిచ్చుబెట్టు మాయలాడివి." అన్నమాటలు పైనుంచి వినిపించినవి. ఆమె విభ్రాంతితో ఆకాశమువైపు చూసింది. మధివర్ణితమైన జ్యోతులలాంటినేత్రాలతో క్రోధావేశాలతో సుస్పష్టంగా గనిపిస్తున్న ఆ వ్యక్తి అశ్వఘోష్ మహాకవి. భరింపరాని విఘాతము సంభవించినట్లు భీతిలి, శక్తిలేనిదానివలె క్రిందకు జారి, పృథ్విలోని ఒక మురికికూపంలో పడిపోయింది. మురుగు కుళ్ళు మొదలగు నానాదుర్గంధాలతో గుబాళిస్తున్న ఆ వూబిలో మునిగి పైకిలేచింది. ఆమెసర్వాంగాలు జిగటలతో వాంతులనుజేయించు దుర్గంధాన్ని జిమ్ముతున్న వూబితో మెత్తబడినవి. తనచేతులతో ముఖంమీంది వూబిని యెంత తుడుచుకోవాలని ప్రయత్నించినా సాధ్యమవుటలేదు. వూపిరిసలుపక గిజగిజ కొట్టుకుంటున్నది. శరీర మింకా బాడిలో దిగిపోతున్నది. ఆమె ఆశలన్నీ అడుగంటినవి.

విషాదమూ ఆయన కనుభవమే. అందలి అన్నికోణాలూ అవగతమైనవే.అవన్నీ దుఃఖంతోనో ఆనందంతోనో విజ్ఞానకాంక్షతోనో సంఘాన్ని సంస్కరించులక్ష్యంతోనో వియోగవ్యధతోనో పయనించు సాక్షీఅయినమార్గాలు. కాని నేడు తన ముందు నిలిచినది వాటన్నిటికీ భిన్నమైనది, సాధ్యంగానిది, విచిత్రమైనది. ఇది అవ్యాజమైన గాఢప్రేమలో క్షణికానికి నిర్ణయించుకున్న యెడబాటు. ఇది వియోగంగా తలంచి, వ్యధనుపొంది విలాపాన్ని చిత్రించమని ప్రభఆజ్ఞ. కోరి కల్పించుకునే దుఃఖంలో విలాప మెలావస్తుంది! ఆయన యెంత ప్రయత్నించినా, అది అసాధ్యంగా తోస్తున్నది. చంచలత్వం ద్యోతకమవుతున్నది. ఆమెముందు నిలిచి, లాలింపులతో "ఈ కొద్దిసమయమేగా, అయినా యెడబాటును సహించగలుగు దృఢత్వం పొందాలి, అలవడాలి." అన్నట్లు మనస్సుకు తోస్తుంది. "నన్ను వెర్రివాడినిజేసి, యీ 15 రోజులయినా బాధించుటెందుకు చెప్పు? సర్వవిధాలా నచ్చిన స్త్రీని పొందిన కవి, శృంగారగీతాలు వ్రాయలేడు. వాడి మనస్సు అనుక్షణము ఆ ప్రేమమూర్తితోనే ఆడుకుంటుంది. ఆత్మానందంలో మునకలు వేస్తూ, అలుపుసలుపులులేని ప్రత్యక్ష ప్రణయ వేడుకలలో వుక్కిరిబిక్కిరిఅయ్యే ఆ పూర్ణరూపంలోని ప్రేమను గ్రోలు ప్రణయమూర్తి పదులకొరకు రచన లెలా సాగించగలడు?" అని మనస్సు వినిపిస్తుంది.

వెంటనే తనముందు గూర్చుని, దాగుడుమూతలాడుతున్న ప్రభ "అందుకే నీకు వియోగం కల్పించింది. ఇంకా జాగుచేయక, వ్యథావిలాపాన్ని సాగించు" అని హెచ్చరిక

చేస్తుంది. "వున్నధనాన్ని పెట్టెలోదాచుకుని, పోయినట్లు పదిమందిలో దుఃఖించాలంటే యదార్థదుఃఖ మెలావస్తుంది? నటనలాంటిదుఃఖాన్ని తెచ్చిపెట్టుకుంటే దుఃఖముయొక్క నిజస్థాయి యెన్నడూ రాదు. పేలవరూపంలో దుఃఖాన్నభిన యించ వూనుకుంటే, మరుక్షణం నవ్వుతో తోసిబోవటం గద్దు. అంతేగాదు, యదార్థరూపంలో తనకున్న యేకయిక నిధి అదృశ్యమయినపుడు తనదుఃఖవిలాపాన్ని పదిమందికి వినిపించి, సానుభూతినిపొంది, సంతృప్తిపడుట అసాధ్యము. ఆ నిధి అదృశ్యమైనట్లు తెలిసినక్షణమే తన చేతనావస్థను కోల్పోతాడు. శాశ్వతంగా కనులుమూసి తనదుఃఖాన్ని తనను అంతంచేసుకుంటాడు. పరిపూర్ణప్రేమలో విఫలంబొం దినవ్యక్తి తనవ్యధావిలాపాన్ని వినిపిస్తూ, బజార్లవెంట తిరు గుట అసంభవము. విఫలంబొందిన మరుక్షణమే అతనియిష్టా నిష్టాల ప్రమేయంలేకుండానే, అనాలోచితంగా ఆ క్షణమే సమూలంగా అంతమైపోవుకుంటాడు." అని మనస్సు వినిపిస్తుంది.

తిరిగి యెదురుగానున్న ప్రభాప్రతిమ "నీమాటే నిజ మని రుజువుచేసుకోజూడకు కవి! ప్రేమవియోగంద్వారా ఆధ్యాత్మికప్రేమికులై, తన మనోఫలకంలో శాశ్వతంగా నిలిచిపోయిన ఆ ప్రేమదేవతకు నిష్కామంతో జీవితాంతం ఆరాధనలు సలిపినగాథ లెన్ని లేవు? ప్రేమవియోగంద్వారా బయల్పడిన నిష్కామంతోగూడిన ఆధ్యాత్మికప్రేమారాధన మహోత్కృష్టమైందిగా ప్రచలితం. దైవభక్తులుగా మలిగిన వారికంటె యీ ప్రేమారాధనాస్తోత్రికులహృదయాలు విశిష్ట

మైనవి, అద్వితీయమైన శక్తికిలిగినవి. అలాంటి ఆధ్యాత్మిక ప్రేమదేవతారాధన సాగించు కవి. ఆగూపంలో నీవు లోకాని కందించు స్తోత్రంలో మనయిరువురము ధృవమవుతాము" అంటుంది.

"లోతునీటిలో యేమున్నదీ యెవరికీ తెలియదు. అగాధమని వదిలివేస్తారు. సాధ్యమైనలోతులోనే జరిగే విమర్శలన్నీ. ప్రేమానందంలో శిఖరస్థాయికిజెందినవారిహృదయాలలోని భావాలను యథాతథంగా యెన్నడూ వివరించలేరు. అందుకుతగిన భాషలేదు, వుండదు. ప్రకృతి యెంత అర్థంగాని అనంతమైందో ఆ పరిపూర్ణప్రేమలోని స్థాయీ అలాంటిదే. పరిశోధనలకు సాధ్యమైనలోతుగల నీటివలెనే అనుగుణమైన క్రిందిస్థాయిలోని ప్రేమజీవులు వియోగం పొందినపుడు విలాపరూపంలో ఆధ్యాత్మికప్రేమస్తోత్రాన్ని వినిపించగలుగుతారు. ఆధ్యాత్మికప్రేమస్తోత్రంద్వారా వ్యథితునికి ఆత్మసాంత్వన, తృప్తి కలుగుతుంది. కాని ప్రేమలోని శిఖరస్థాయినందుకున్న ప్రేమికులస్థితి అలాంటిదిగాదు. అచట తృప్తికి సాంత్వనలకు అవకాశమేలేదు. మొదలులేని వృక్షము, గోడలు స్తంభాలులేని గృహము, భావములేని భాష వుండు టెలా అసంభవమో, అలానే అగ్రస్థాయికి చెందిన ప్రేమికులు వియోగవ్యథను భరిస్తూ స్తోత్రించుట సంభవము." అని మనస్సు మళ్ళీ వినిపించింది.

ఈవిధమైన ద్వంద్వభావాలతో, విరుద్ధకంపనలతో చీకాకు చెందుతున్నాడుదప్ప, ఆశయసిద్ధికి అవకాశంకలుగుట లేదు. నిముషాలను లెక్కిస్తూ యీ తెలివితక్కువఆంక్షకు

ప్రభమీద చిరాకుచెందుతూ అనుక్షణము ఆరాటపడుతున్నాడుదప్ప, రచనావిషయాలోచనే లేదు. గంటము చేతబూని, వ్రాయాలని యెంతప్రయత్నించినా పట్టుదల వీగిపోయి, ఆంక్షను అతిక్రమించి వెళ్ళి, ప్రభను కలవాలని వుత్తేజితుడై, గంటాన్ని ఆవలవైచి, సరసర బయలుదేరతాడు. ప్రభపట్టుదలలోని కఠినత్వము నగ్నరూపంలో మనస్సులో దొర్లుతుంది. అడుగులు తడబడుతవి. ఆమెలోని క్రోధావేశాలను తా నెన్నడూ చూడలేదు. అయినా కలవరపాటుకలిగి ముందు కడుగిడలేక, వెనుదిరిగి వచ్చి దీర్ఘ వేడి నిట్టూర్పు విడుస్తూ పక్కమీదపడి దొర్లి గింతలుపెడతాడు. తిరిగి గట్టినిర్ణయాలు చేసుకుని వ్రాయ నుద్యుక్తుడవుతాడు. ఆ తాళపత్రంలో ఆమెప్రతిమ సుస్పష్టంగా గనిపిస్తుంది. ఆమెకు గుచ్చుకుంటుందని తనప్రణయమూర్తిమీద గంటాన్ని ఆడించుట అవివేకమని గంటాన్ని జారవిడచి, ఆ పత్రంలోనప్రతిమని యింకాస్పష్టరూపంలో చూడదలచి నేత్రాలునులుముకుని చూస్తాడు. తిరిగి ఆమె కనిపించక, విసిగి అక్కడే కుంగిలబడి వాపోతాడు.

ప్రభస్థితి అంతకంటె అధ్వాన్నంగా వుంది. ఆమె మనస్సు అశ్వఘోషునకు నీటిబయటపడిన మత్స్యమువలె కొట్టుకుంటున్నది. కర్తవ్యజ్ఞానముగల స్త్రీకి పట్టుదలతో గూడిన ఆత్మశక్తి అడుగుఅడుగున పెరుగుతుంటుంది. అశ్వఘోషురచనాశక్తి తనద్వారా తనప్రేమద్వారా మృగ్యమవుటను ఆమె సహించలేకపోతున్నది. ఆయనప్రకాశానికి తాను అడ్డుగా నిలిచినందుకు ఆత్మ క్షోభిస్తున్నది. అందుకే తనపట్టు

దలను నిబిడీకృతంచేసి నిష్టలోమునిగి జపిస్తున్నదానివలె తపిస్తూ రోజులు దొర్లిస్తున్నది. అశ్వఘోష్ కోపంతో అలకతో ఆవేశంలో చురుకుగా వ్రాస్తుంటాడని, రోజూ పది పత్రాలనైనా వ్రాస్తుంటాడని, ఈ తభా యీ అనుభవాలన్నిటితో, ప్రత్యక్షంగా అభినయంలో తానుపొందిన అనుభవంతో అత్యద్భుతంగా వ్రాస్తుంటాడని, ఆ వ్రాసిననాటకాన్ని రేయింబవలు ప్రయత్నించయినాసరే, ప్రదర్శించాలని, అది ప్రదర్శించినపుడు తనను నిర్లక్ష్యంతో వూహించినవారంతా పరితాపపడతారని, దుష్టప్రచారాన్ని సాగిస్తున్న నందా అందరికంటెముందు సిగ్గిలి పాదాలంటి,క్షమాభిక్ష వేడుతాడని, అలాచేయించే, నందాకీ నూతననాటకంలో పాత్ర యివ్వాలని, ఇప్పటివరకు నందామాటలు విన్నందుకు సౌమ్యకూడా మరింత విచారపడుతుందని, పట్టణంలోని ప్రతిఒక్కరిమన్ననలు దక్కినపుడు అంతటికీ కారకురాలు తానేయైనట్లు అశ్వఘోష్ తనయెడల ముగ్ధుడవుతాడని మొదలగుఆలోచనలలో మునిగి, తననుతాను మరచి సమయాన్ని దొర్లించుకుంటున్నది.

అది 14 వ రోజు. ఆంక్షలోని ఒక్కరోజుమాత్రమే మిగిలివున్నదని, మరునాడే తాను ప్రభను చూడగల అదృష్టంకలుగుతుందని, సంవత్సరాలతరబడి జైలుశిక్షననుభవించిన ఖైదీవలె ఒకప్రక్క ఆనందంతోను, మరోప్రక్క ఒక్క పంక్తియైనా వ్రాయకుండావున్న తాను కలసినపుడు యేమి చెప్పాలా, యెలా ఆమెను వోదార్చటాయని భయముతో బాధపడుతున్నాడు. కొంతైనా వ్రాసివుంటే, తాను ఆంక్షను

నిర్లక్ష్యంచేసి వెళ్ళి కలిసివుండేవాడు. తను యెంత ఆదుర్దాతో వ్రాయప్రయత్నించినా సఫలంపొందలేదు. తనలోని రచనాశక్తి నేడు లోపించింది. తాను నేడు అసమర్థుడు. ఆవిషయాన్ని ఆమె అర్థంచేసుకునేట్లుచేయు వుపాయమేదో తెలియుటలేదు. రచనలో విఫలమందుతున్నట్లే ఆమెను యదార్థాన్ని నమ్మించుటలోకూడా విఫలమందుతున్నాడు. జీవితంలో యింత విచిత్రసమయమొస్తుందని తా నెన్నడూ ఆశించలేదు. సర్వసంపదలున్నా జీర్ణశక్తి నశించి బాధపడుతున్నట్లు, ఆకలితో అలమటిస్తున్నరోగికి వైద్యుడు లంకణ ఆంక్ష పెట్టినట్లు తనహృదయం పరితపిస్తున్నది. ఒక్కరోజులో ఆంక్ష తీరిపోబోతున్నదన్న వుత్సాహానికిబదులు, అర్థంగాని పిరికితనంతో వుక్కిరిబిక్కిరి అవుతున్నాడు. క్షణక్షణము వ్యథతో మనస్సు నలిగిపోతున్నది.

గడువు మరొక్కరోజేనన్న ఆనందభరితవుత్సాహంలో గంతులు వేస్తున్నది ప్రభ. తనకోర్కెమీద అశ్వఘోష్ వ్రాసేవుంటాడని, పూర్తిచేసికూడా పెట్టినగడువు వ్యవధి వున్నందున అలకతో ఆగివుంటాడని, తాను వెళ్ళి కలిస్తే వుప్పొంగిపోతాడని ఆలోచనలు చేస్తూ కౌతూహలంతో పయనమయింది. ఖైదునుంచి విముక్తిపొందినదానివలె అంతర్గతఆనందం వుబికి పరువులెత్తుతున్నది.

అది అపరాహ్నసమయము. శీతకాలపుతిమ్మిరులను కలిపించు మాగయెండ కాస్తున్నది. అనంతఆకాశమంతా నగ్నపర్వతాలను, మంచుపర్వతాలను, మలినంతో పూర్వభాగాలను పులుముకున్న మంచుపర్వతాలను బోలిన

మేఘగుచ్ఛాలతో శోభిస్తున్నది. దినకరుడు మబ్బుదొంతరులలో దాగుడుమూతలాడుతున్నాడు. అంతములేని ఆలోచనలతో విసగడచెందిన మనస్సుతో పక్కమీద మాగన్నుగా నిద్రిస్తున్నాడు అశ్వఘోష్. పడకప్రక్క గంటము, తాళపత్రాలు వున్నవి. లోపల ప్రవేశించిన ప్రభ మెలకువగా పిల్లి అడుగులు వేసుకుంటూ దగ్గరగా వెళ్ళి, ఆ తాళపత్రాలు తీసి పరిశీలించింది. అవన్నీ అలిఖితపత్రాలు. క్షణపాటు వెలవెలబోయి, వ్రాసి పూర్తిచేసినకట్టను దాచివుంటాడని, తిరిగి, యేమయినా వ్రాయను యీ నూతనకట్టను సంసిద్ధపరచుకునివుంటాడని వూహించి, ఆగదిలో పరిశోధన ప్రారంభించి, విఫలురాలై తిరిగి ఆయనప్రక్కగా వెళ్ళి కూర్చుని ఆలోచిస్తున్నది.

ఈలోకంలోని తుచ్ఛవాంఛలను ఆందోళనలను విస్మరించి, సర్వజనులకు సమానసుఖాన్ని ప్రసాదించు నిష్పక్షపాతియైన నిద్రాదేవతవడిలో అశ్వఘోష్ విశ్రమించి "కుర్రు కుర్రు" మంటున్న శబ్దము వినిపిస్తున్నది. నిద్రలోనున్న ఆయనముఖకవళికలను పరిశీలిస్తున్నపుడు గొప్ప అలసటలోని నిద్రగా తోస్తున్నది. ఆయనఫాలభాగంమీద ముత్యాలవలె మెరుస్తున్న స్వేదబిందువులు ప్రక్కలకు జారుతున్నవి. ఆ దృశ్యాన్ని జూస్తున్న ప్రభ కరుణావిగళితురాలై నొచ్చుకుంటున్నది. "కర్తవ్యమోహంలో వెర్రిలో ని స్వంత అలసటకు గురిచేశాను అశ్వం. ఇక యెప్పటికీ యింత బాధకలిగించను. తాత్కాలికసుఖాలకులోనై శాశ్వతకీర్తిని వ్యర్థం చేసుకోరాదు కవీ! నీ నీడలాంటిదానిని నేను. నీ సుఖంలోనే

సుఖాన్ని, నీకీర్తిలోనే కీర్తిని పొందగలదానిని నేను. నీకు ప్రేరణనిచ్చుటే నాకు జీవములాంటిది. నీకీర్తిలోనే నాకు ఆనందము ఆత్మతృప్తి వుంటుంది. నాద్వారా అదృశ్యమైన నీ అమరత్వాన్ని పునరుద్ధరించుటకే యీ బాధను కల్పించాను" అని మనస్సా అనుకుంటూ, చెంగుతో ఆయన నుదురుమీంది స్వేదబిందువులను అద్దుతున్నది.

అశ్వఘోష్ వులికిపాటుతో లేచి, ప్రభనుగాంచి వెలవెలబోతున్నాడు. ఆమెదృక్కులలో యెంత సానుభూతి గనిపిస్తున్నా మమకారాలొలుకుతున్నా ఆయనమనస్సు భీతితో కలవరపాటుచెందుతున్నది. ప్రభ అణచుకోజాలని ఆదుర్దాతో "నీవువ్రాసిన వెక్కడ దాచావు కవీ?" అని ప్రశ్నించింది. ఆప్రశ్నతో ఆయనముఖం మరింత చిన్నబోయింది.

తాను యెంతప్రయత్నించినా ప్రయోజనంకలుగలేదని, తనలోని కవనశక్తి నేడు లోపించిందని, తనద్వారా రచలుసాగుట యిక దుస్తరమని, తాను అసమర్థుడనని, యిక తనద్వారా ఆశించుట నిష్ప్రయోజనమని అశ్వఘోష్ దుఃఖభరితకంఠంతో వెలియజేసినపుడు, ప్రభ నిర్విణ్ణురాలై దీర్ఘఆలోచనలో మునిగి వేడినిట్టూర్పును విడిచింది. "ఈ యేకాంతసమయంలో నేను గుర్తురాలేదా కవి?" అని ప్రశ్నించింది. కవి నిర్దిష్టమైనధ్వనిలో "నీవు అనుక్షణము నాముందే కనిపించావు. నీస్పర్శలు పొందాలని, ముద్దులాడాలని, గిలిగిలింతలుపెట్టాలని మనస్సు నాపోయింది. కల్పించుకున్న వియోగంద్వారా ప్రేరణ యెన్నడూ కలుగదు ప్రభా,

వ్యథలోని అగ్రస్థాయికిచేరినపుడే మనస్సు దుఃఖఆవేశంలో పరువులెడుతుంది. మనస్సులోని ఆ దుఃఖపరువంతా స్వభావ సిద్ధ కళాత్మకరూపంలో కవిత్వంగా ప్రభాసిస్తుంది. అది వివేక హృదయాలన్నిటిని ఆకర్షిస్తుంది. దుఃఖాభినయంద్వారా హృదయంలోని మర్మతంతువులు విలపించవు, మ్రోగవు, శ్రుతిని ప్రేరేపించవు. హృదయతంతువులు జలజలలాడని దే తానములో మాధుర్యములోలుకు సరాగము, తాళము, యమకము కుదురదు. వృథాప్రయాసలే అవుతవి. కట్టలు తెగి పారు నీటివలె దుఃఖముదొర్లిన హృదయావేశము కవనరూప ములో పరువులెడుతుంది.'' అన్నాడు.

ఆమె కళవళపడుతున్న మనస్సుతో "కవీ, నీలోని శాశ్వతస్వరూపాన్ని మృగ్యంచేశాను. పై పెచ్చు అనవసర శ్రమను ఆంక్షతో కల్పించాను. నన్ను క్షమించు కవీ. నాట్యశాలవైపు మనం పోనందుకు నాటకప్రదర్శనలు జరుప నందుకు నందా, సౌమ్యలు దుఃఖితులై క్రోధితులై మనమీాద వ్యంగ్యప్రచారంచేస్తున్నారు. వారిప్రచారాలు వినలేక వారిని ఆశ్చర్యంలోముంచివేయాలనే కుతూ హాలంతో, మంచి నూతననాటకరచనకొరకు మీాకు బాధ లను కల్పించానుదప్ప ప్రయోజనంలేకపోయింది. నేను నిన్ను ఒక్క వరమడుగుతున్నాను కవీ; అది ప్రదానం చెయ్యి. నాకు చాలు. ఇక యెన్నడూ నీకు యింత అసం దర్భమైనబాధను కలుగనివ్వను.'' అని ఆయనచుబుకాన్ని పుణుకుతూ కాంక్షాభరితదృక్కులతో చూస్తున్నది. ఆ దృక్కులలో వైరాగ్యంతాలూకు రేఖలు కొన్ని కనిపిస్తున్నవి.

అశ్వఘోష్ ఆమెవంక మరీమరీ చూస్తూ, ఆమె అరచేతిని పట్టుకుని, కపోలాలమీద పెట్టి అదుముకుంటు న్నాడు. ప్రభ అవ్యాజమైన అంతర్గతప్రేమను ప్రదర్శిస్తూ "కవీ, నాకోరకు నేను యెన్నడూ అర్థించలేదు. నేడు ఒక్క వరం ప్రసాదించమని వేడుకుంటున్నాను." అన్నది. ఆమె శిరస్సును బాహువులలో బంధిస్తూ, కరుణాభరితకంఠంతో "అంత బేలపోకు ప్రియా. నా సర్వస్వాన్ని నీ కర్పించుకున్న వాడిని. నీవు యేదికోరినా సంసిద్ధుడను ప్రభా. నీవు కోర వలసిన అవసరంలేదు, ఆజ్ఞాపించవచ్చు." అన్నాడు. ఆమె వెంటనే తనచేతిలో చేయి వేయించుకుని "అయితే, నీమాట నెగ్గిస్తాను, అక్షరాలా పాటిస్తాను అని అభయమివ్వ అశ్వం." అన్నది. అశ్వఘోష్ హర్ష ధ్వనిచేస్తూ హస్తాన్ని వూపుతూ "ఒకమాటుగాదు, ప్రభా, సహస్రమాయలు అభయ మివ్వగలను." అంటూ అభయమిస్తూ "నీవుకోరనున్న దేమిటో చెప్పు ప్రభా." అని ప్రశ్నించాడు. "ప్రభ అదృశ్యంలో అశ్వఘోష్ స్థిరచిత్తుడై రచనసాగించాలని ప్రభకోర్కె." అన్నది. తడబాటుపడుతూ అతను గొంతుపెగలక నతనత లాడుతూ— "ఇది ఘోరఅన్యాయం ప్రభా! ఇది నావల్ల జరుగనిపని. ప్రభావిహీన అశ్వఘోష్ క్షణంకూడా యీలోకంలో నిలువజాలడు." అన్నాడు.

ప్రభ నేత్రాలుపెద్దవిచేసి, అధరాలమీద వేలుబెట్టు కుని "పొరపాటు, అలాంటిమాట లనగూడదు కవీ! ఇచ్చిన అభయాన్ని జవదాటగూడదు. ప్రేమికురాలికిచ్చినమాట

సామాన్యమైందిగాదు. ఆ మాటను నిర్లక్ష్యంచేయుట యీలోకంలోని అనాచారాలన్నిటికంటె హీనమయింది. నన్ను శాశ్వతంచేయుటకై, నా ప్రేమకు అమరత్వాన్నిచ్చుటకై, కావ్యాలువ్రాయుటకై నీవు వుండితీరాలి కవీ! నీ విచ్చిన అభయాన్ని విస్మరిస్తే ప్రభ ప్రేమను తృణీకరించినట్లే!" అన్నది.

అశ్వఘోష్ కుమారిల్లుతున్నవానివలె, ప్రభహస్తాన్ని విడువకుండా "ప్రభా, అంతా కళవళపరిచేవిషయాలే మాటాడుతున్నావు. నేను అసమర్థుణ్ని. నీవులేని నాకు యీలోకమే శూన్యం. నన్ను మభ్యపెట్టి, మయిదుచేయజూడకు." అని వినమ్రధ్వనిలో వినిపించాడు. ప్రభ నాట్యసమితివిషయాలలో ఆయన్ను మరిపించింది.

ఆమరునాడు నాట్యసమితి తిరిగి శోభితమైంది. జనం కిటకిటలాడుతున్నారు. హాలునందు అలంకారాలు సజ్జింపబడుతున్నవి. సౌమ్య అందరికంటె వుత్సాహితురాలై అలంకారఆధిపత్యాన్ని వహించింది. నందా కుతిదీర పట్టణమంతా ప్రచారంసలుపుతున్నాడు. ప్రదర్శింపబోవునది 'పూర్వశీవియోగమే అయినా, నూతనవిధానంలో వుంటుందని, మరింత ఆకర్షణీయంగావుంటుందని, తనపాత్రను తానే మార్చి సరిక్రొత్తసంభాషణలను పెట్టినట్లు అభినయాన్నిసృష్టించినట్లు మొదలగువిషయాలతో విరామంలేకుండా పట్టణమంతటా తిరిగితిరిగి ప్రచారంసలుపుతున్నాడు నందా.

ఎంతవుల్లాసంతో నందా నాటకప్రదర్శనగురించి ప్రచారంసలిపివచ్చినా, సఫలతబదులు విఫలతకలిగింది.

నూతనవిధానాన్ని ప్రదర్శించాలని ప్రయత్నించిన నందా అభినయం వికృతంగానున్నందున ప్రేక్షకులనుంచి కేకలు వినవచ్చినవి. అశ్వఘోష్‌అభినయంకూడా అంత తృప్తికరంగా జరుగలేదు. ప్రభమాత్రం అందరికి మిన్నగా, పూర్వప్రదర్శనలకంటె మిక్కిలిగా అభినయించి ప్రశంసలు పొందింది.

# వరదానం

"అశ్వఘోష్, నీవీరోజు చాలా తలవంపులు తెచ్చావు. అడుగుఅడుగున అంత తడబాటుపడ్డావేమిటి? అసలే మీకు పరధ్యానసెక్కువ. నేడది తననగ్నరూపాన్ని ప్రదర్శించింది. మనయిద్దరి మూర్ఖతవలన యీ కళంకం శాశ్వతఅశ్వఘోష్‌కు ఆపాదితమవుతుంది." అన్నది ప్రభ. అస్థిరతాస్వరంతో "నీవు ఒక వెర్రిఅభయంద్వారా నన్ను భయాందోళనలలో ముంచివైచావు. నీకంటె నేనే ముందు అదృశ్యమవుసమయ మొచ్చింది. ఈ సందిగ్ధాలలో సతమతమవుతున్న నాకు అభినయసామర్థ్య మెలావస్తుంది చెప్పు!" అన్నాడు. "అలా చిన్నవిషయాని కంత గాభరాచెందుతావెందుకు కవీ! జీవితంకంటె కర్తవ్యం గొప్పది. కేవలం సుఖాలకొరకు కలలుగన్నా నదికి దుఃఖాలే లభ్యమవుతవి. కర్తవ్యసిద్ధిలో మునిగి తననుతాను మర్చిపోవాలి. నీవంత బాధపడుతున్నావు. నేనయితే అంతబాధపడను. నీవు లేకపోయినా, నేను ఆత్మహత్యచేసుకోను. జీవిస్తాను. జీవితం

సాఫీఅయిన ఒకేవిధరాజబాటలాంటిదిగాదు కవీ. అనేక అంతస్తుల సమ్మేళనము. చీకటివెలుగులు అందనేకవిధాలుగా ప్రతిబింబిస్తవి. ఒకరు పోయినంతమాత్రాన రెండోవారు ఆత్మహత్యకు పూనుకోరాదు. చేయవలసిన నిర్దిష్ట కార్యక్రమముంది. మీరు లేకపోతే నేనేమిచేస్తానో చెప్పనా?" అంటూ ప్రక్కకుతిరిగి దీర్ఘశ్వాసను విడచింది.

అశ్వఘోష్ పిడచగడుతున్న గొంతుకతో "చెప్పు చెప్పు?" అన్నాడు. ప్రభ కంఠాన్ని తీక్షణంచేసి "ఆత్మహత్య అసమర్థత్వంతోగూడిన మూర్ఖత్వమని బుద్ధభగవానుడు నిర్వచించాడు. నేను యీమధ్య వీణమీద పాడుట బాగా అభ్యాసంచేస్తున్నాను. అశాశ్వతఅశ్వఘోష్ నానుంచి వెడలిపోయినపుడు యుగయుగాలకు కవియైన శాశ్వతఅశ్వఘోష్‌యొక్క ఆరాధనచేస్తాను. నీ వీణమీద నీ పాటలనే పాడుకుంటూ కోసలదేశంబయటకూడా తిరుగుతాను. తిరిగి యేలోకములోనైనా, యేదేశములోనైనా మనయిరువురము సాకారరూపంలో యేకమయ్యేవరకు నేను నీగీతాలను నీవీణమీద పాడుకుంటూనే పోతుంటాను కవీ! ఇందు భయపడవలసినవనేమిటి చెప్పు? నేనులేనపుడు నీ వేమిచేస్తావు చెప్పు?" అని ప్రశ్నించింది. ఈమాటలు వింటున్న కవి శరీరసర్వస్వము కంపించింది. మాట్లాడాలని ప్రయత్నిస్తున్నా కంఠముశుష్కించి, స్వరము పెగులుటలేదు నేత్రాలు వర్షించనున్నట్లు జలజలలాడుతున్నవి. పెద్ద ప్రయాసానంతరము హీనస్వరంలో "నీవులేని ఆ ఘడియలు మహావిషాద

మైనవి. అయినా, నీకిచ్చిన అభయం ప్రకారం నేను ఆత్మ హత్యచేసుకోను. జీవితాంతమువరకు నీ ప్రేమ ప్రేరణలోని గీతాలను పాడతాను. నేను నీ శాశ్వతఅశ్వఘోష్..." అంటుండగా అతనికంఠం గద్గదమైపోయింది.

# చిత్రలేఖనము

సంధ్యాసమయ మది. హృదయంనుంచి నిర్బంధావస్థలోనున్న అశ్వఘోష్ కింకా విముక్తికలుగలేదు. దత్త మిత్రునియింటిలో ప్రభగదియందు ఒక ముక్కాలిపీటమీద ఆసీనుడై కదలికలుమెదలికలులేని బందీవలె నిగ్రహంతో వున్నాడు. ఎదురుగా గోడకుబ్రేలగట్టిన కాన్వాస్‌మీద కుంచెతో ఒక గ్రీకుచిత్రకారుడు అతినైపుణ్యంతో చిత్రిస్తున్నాడు. ప్రక్కనున్న శయ్యమీద అటూయిటూ దొర్లి పరికిస్తూ, యీయిరువురకు మిన్నయైన జాగ్రత్తతో చిత్రంలో జీవత్వంవచ్చుటకు సలహాలనిస్తూ ఆనందంతో మురిసిపోతున్నది. ఆ చిత్రపటంలోని అశ్వఘోష్‌కుకులను ప్రభ తన స్వహస్తాలతో దిద్దింది. "ప్రభా, ఇక నేను కూర్చోలేను. నాప్రక్క ఉక్కబోస్తున్నది, మరోప్రక్క శరీరం తిమ్మిరు లెక్కుతున్నది." అన్నాడు అశ్వఘోష్ ప్రభ మందహాసం చేస్తూ "తొందరపడితే ప్రయోజనంలేదు మహాశయా. తనకీ అవస్థనుంచి విముక్తినిచ్చుటకే యీ యేర్పాటు జరుగుచున్నది." అన్నది.

"సాకారసజీవిని విడచి, ప్రతిమతో తృప్తిపడుట సాధ్యమా?" అన్నాడు.

"మానసికతృప్తి ఆనందాకి మూలం కవీ!" అన్నది.

"అది సందిగ్ధహృదయంలోని రాజీసూచనమాత్రమే కాగలదు. అయినా, ఇలాంటి ప్రతిమలతోను, స్ఫటికమూర్తులతోను తృప్తిపడు రాజీస్వభావం హిందువులది. నీవు బౌద్ధమతావలంబినివిగదా?" అన్నాడు.

ఆమె చిరునగవును చిలికిస్తూ "మతమేదయినా నేను స్త్రీనన్నవిషయాన్ని విస్మరింపకండి. స్త్రీస్వభావ మెప్పుడూ మూఢత్వాలవైపు నడచుట నైజము కవీ!" అన్నది.

పొరపాటుమాటాడినవానివలె చిన్నబుచ్చుకుంటూ "స్త్రీలైనా మీలో మూఢవిశ్వాసాలుండవని, విశేషవిజ్ఞానంతో వుంటారని నాకు తెలుసు. నే నలా మాటాడినందు కన్యథా భావించకండి." అన్నాడు.

చిత్రకారుడు వెళ్ళిపోయాడు. ప్రభ అశ్వఘోషులు బౌద్ధవిహారంలో నడుస్తున్నారు. ప్రభాకరుడు పశ్చిమకనుమలను చాటుచేసుకుని తొంగిచూస్తున్నాడు. గగనంలోని మేఘాలలో అక్కడక్కడ మేలిమిసువర్ణ కాంతులతోను, గేవారంగుతోను రంగితమై శోభిస్తున్నవి. శీతలపవనతెమ్మెరలకు వృక్షరాజదళాలు కరతాళనృత్యంసలుపుతూ తమ ఆహ్లాదాన్ని ప్రకటించుకుంటున్నవి. వుండివుండి మయూరకూజితాలు వినవస్తున్నవి. నదిహోరు సప్తరాగసమ్మేళనారూపంలో వినిపిస్తున్నది. ప్రభనడుముచుట్టూ తనహస్తాన్ని పెనవేసి, అడుగులోఅడుగు వేసుకుంటూ పోతున్నాడు.

ప్రభ మధ్యలోనే ఆపి, నదివైపు తదేకంగా చూస్తూ, ఆహ్లాదాన్ని గ్రోలుతూ "ప్రియతమ్, సరయూనది యెంత చక్కటి అనురాగంతో పిలుస్తున్నదో చూడు! ఏ నది నిన్ను పరిచయంచేసిందో, ఏ నదీతరంగాలతో మనం పరస్పర స్పర్శానుభూతులనుపొందామో, ఏ జలప్రతిబింబాలలో అంతస్సహంగా ప్రభావితులమైనామో, ఏ నదీప్రవాహం మనలను శాశ్వతప్రేమికులనుగా బంధించిందో ఆ సరయూ నన్ను పిలుస్తున్నది అశ్వఘోష్. ఆ నదియొక్క గలగల ధ్వనులభావం నన్ను పిలచుటే" అన్నది. అతను అమాంతం ఆమెను కవుగిలిలో పైకియెత్తి, అధరాలమీద చుంబిస్తూ "నీవు నా ప్రాణానివి. నన్నువిడిచి యెన్నటికీ పోలేవు ప్రభా!" అన్నాడు.

గ్రీష్మకాలపురోజు లవి. అశ్వఘోష్‌తల్లి సువర్ణాక్షి అస్వస్థగానున్నది. ప్రభ రేయింబవలు రోగిసేవలో నిమగ్నమైయుంటున్నది. అశ్వఘోష్ బయట అడుగుపెట్టకుండా ప్రభకు చేయూతగావుంటూ, ఆమెచేస్తున్న సేవలో కించిత్ భాగాన్నయినా పంచుకుంటూ సమక్షంలోనే వుంటున్నాడు. రోజురోజుకు రోగిస్థితి నీరసిస్తూ నిరాశవైపుకు మొగ్గుతున్నది. వైద్యులందరూ ఒక్కరొక్కరుగా, రోగిస్థితి ఆఖరి దశలోనున్నదని, ఇక మందులవలన ప్రయోజనంలేదని, ఏక్షణంలోనైనా ప్రాణంపోవచ్చునని జవాబిచ్చి వెళ్ళిపోయారు. చిక్కి శల్యమై మంచానఅతుక్కుని మూలుగులకు కూడా శక్తిలేక బాధపడుతున్న సువర్ణాక్షిని చూడజాలక భర్త దేవునిగదిలోనే వుంటున్నాడు. తను తనయింటిలోడ

లుగా స్వీకరించుటకు యెవరిని హేయంగా పరిగణించాడో, యెవరిద్వారా తనవంశప్రతిష్ట సర్వనాశనమవుతుందని భావించాడో, యెవరు మ్లేచ్ఛరాలుగాను, యెవరిపాదముద్రలు తన పవిత్రగృహంలో పడితే నరకతుల్యమవుతుందనుకున్నాడో, తరతరాలుగావస్తున్న తన వంశవిశిష్టత, జాతిస్వచ్ఛతలోని పుచ్ఛత విచ్ఛిన్నమవుతుందనుకున్నాడో ఆమెసేవల నందుకుంటున్నది, తనధర్మపత్ని సువర్ణాక్షి. ఆమెనడిలో విశ్రాంతిని పొందుతున్నది. కన్నబిడ్డకు చేసినట్లు సేవలుచేస్తూ, వడిలోని రోగిపడుతున్న బాధకు సానుభూతిరూపంలో గాబోలు కన్నీరుకారుస్తున్న ప్రభను తేరగా చూచినపుడు, గంగాప్రసాద్ నేత్రాలుకూడా చెమ్మగిలుతున్నవి.

రోగిప్రక్కన చూస్తూవుండినవానికికూడా రోగమొస్తుందన్నట్లు సువర్ణాక్షికోరకు ప్రభ, ప్రభకోరకు అశ్వఘోష్ వరుసగావున్నందున, అతనిమనస్సు బండబారిపోయి, తానూ రోగివలె దూరంగా పవళించి, తల్లికి సేవజేస్తున్న ప్రభవైపు విసుగులేకుండా చూస్తుంటాడు. అటు రోగిసేవతోపాటే, అశ్వఘోష్‌కు ఆహారము, విశ్రాంతి మొదలగువిషయాలోకూడా ప్రభ శ్రద్ధవహిస్తున్నది.

"ప్రభా, అమ్మకంటెముందు నీప్రాణాన్ని కోల్పోయేట్లున్నావు; కాస్తయినా విశ్రాంతితీసుకోకపోతే యెలా చెప్పు? అమ్మసేవజేయటానికి నాకుకూడా కాస్త అవకాశాన్నివ్వు ప్రభా." అంటూ లాలించాడు ప్రభను. ఆసమయంలో సువర్ణాక్షి మరింత విషాదరూపంలో గనిపిస్తున్నది. శ్వాసకూడా అతికఠినంమీద ఆడుతున్నది. అందువలన

ప్రభ ఆఖరి ధైర్యంకూడా అడుగంటింది. గంభీరమైనకంఠంతో "ఈ రాత్రికి బాధ్యతంతా మీరే వహించండి. ఇక నేను వెళతాను" అంటూ అలసటతో అశ్వంపాదాలమీద వాలిపోయింది. అత నామెశిరస్సుబట్టి లేవదీసి, తలనిమురుతూ "చాలా డస్సిపోయావు పోయి. విశ్రాంతిదీసుకో ప్రభా. అమ్మసేవవిషయం నేను చూస్తానుగా!" అన్నాడు.

"సరే, నేను వెళుతున్నాను, మాట మరువకండి!" అంటుండగా ఆమెకనుకొలకులగుండా అశ్రుబిందువులు జలజలలాడుతున్నవి. అశ్వఘోష్ కలవరపడుతూ అశ్రువులను తుడుస్తూ "ధైర్యాన్ని సడలనివ్వరాదు ప్రభా. ఏంపరవాలేదు, నీవు పో." అని ఆమెను బయటివైపుకు పంపాడు. ఇచట ఆమె విశ్రాంతిపొందజాలదు. కనుక చాలారోజులకు బలవంతంమీద యింటికి పంపుతున్నాడు. నేడామె ముఖంలో అన్నివైపులనుంచి అధీరత ప్రస్ఫుటమవుతున్నది. అధోముఖంచేసి సరసర వెళ్ళిపోయింది.

# పరితాపం

గగనమండలంలోని శశిధరుని అంగడి అతిశోభాయమానంగా అలంకరించబడింది. పృథ్వియంతటిమీద క్షీరాన్ని చిమ్మినట్లు, పాలనురుగుతో కప్పబడినట్లు శీతలశ్వేతకాంతులు ప్రతిబింబిస్తున్నవి. అవయవసౌష్టవాలసంతటిని విశేష ఆభరణాలతోను, శిరోజాలను పుష్పాలతోను ముప్పేరగా అలంకరించుకున్న జవరాలివలె నక్షత్రకూటమితో ప్రభాసి

స్తున్న జాబిలితో ఆకాశం అద్వితీయమై అలరారుతున్నది. వసారావైపునుంచి కనిపిస్తున్న వెన్నెలవెలుగును జూచిన సువర్ణాక్షి "నాయనా అశ్వం, ప్రభ యేదీ?" అని ప్రశ్నించింది.

అశ్వఘోష్ :- బడలికతో యింటికెళ్లిందమ్మా.

సువర్ణాక్షి :- నన్ను మిద్దెపైకి తీసుకెళ్ళు తండ్రీ.

అతను ఆమెను నెమ్మదిగా తన భుజస్కంధంమీద వేసుకుని మిద్దెపైకి తీసుకెళ్లి పరుపుపరిచి పడుకోబెట్టాడు.

సువర్ణాక్షి :- (తడబడుతున్న మాటలతో) అశ్వం, ఈసమయంలోనే బిడ్డను బయటి కెందుకుపోనిచ్చావు బాబూ ?

అశ్వఘోష్ :- వారిఅమ్మగారింటి కెళ్లిందమ్మా. వచ్చినప్పటినుంచి విరామంలేకుండా నీకు సేవచేస్తూ నిద్రాహారాలులేక డస్సిపోయిందమ్మా! అందుకని యీరాత్రి విశ్రాంతితీసుకోమని పంపాను.

సువర్ణాక్షి :- ప్రభ కులమత మేదయినా, దేవత లాంటిపిల్ల నాయనా! మహాసాధ్వీలక్షణాలే దాని కున్నవి. దాని నెన్నడూ నిర్లక్ష్యంచేయకు అశ్వం. దాన్ని బాగా అర్థంచేసుకున్నరోజు మీ నాన్నగారి కీనాడున్న దుఃఖం వుండనేవుండదు. ప్రభద్వారా పోయే వంశప్రతిష్ట మర్యాదలు వున్నందువలన కలిగే ప్రయోజనమూ వుండదు నాయనా. ఆమెద్వారా మనవంశం శాశ్వతంగా వుద్ధరింపబడుతుందని నా కిప్పుడు ఆత్మవిశ్వాసం కలిగింది.

అంటూ గుండెలమీద హస్తాలువేసి అదుము కుంటూ, దంతాలుబిగబట్టి "నాయనా, గుండెలమీద చేతులుంచి అదుము. పగిలిపోతున్నదిరా," అన్నది. అశ్వఘోష్ మన స్నేహితుడో విహరిస్తున్నది. తనసన్నిధిలో మెలిగిన వస్తువువిలువ తనవూహాకుఅందని అతీతమైనవిలువగా తోచి, మన స్నేహితుడికో తేలిపోతున్నది. కౌతూహలచాంచల్యంతో దాగుడుమూతలాటలాడుతున్నది. ప్రభ తనపాలిటి దేవకన్యగాను, వరదేవతగాను, తనసర్వస్వంగాను తలంచుట ప్రథమంనుంచివున్న వూహాలలోనివే. కాని నేడు అవసాన దశలోని తనతల్లినుంచి వస్తున్న ప్రశంసలతో స్తుతితో, యెన్నెన్నో చిత్రవిచిత్ర అమూల్యఆభరణాలను సృష్టించి అంతఃపురాల కందిచ్చిన విశ్వకర్మ తనకొరకని సృష్టించు వున్నదాని అందాన్ని అవలోకిస్తూ విస్మితుడై, విభ్రాంతుడై దానివిలువను నిర్ణయింపజాలక చూస్తూనేవుండిపోయినట్లు పొంగి పులకితమైన వుల్లంతో ప్రభఅంతస్సును అంచనగుణకారాలు వేస్తున్నాడు. ఆకాశానికి అంతములేనట్లే ఆమె అంతస్సు అంతకంతకు మించి, అనంతమై, అద్వితీయమై ఆశ్చర్యాన్వితునిచేస్తున్నది. అందుబాటులోనున్నది యెంత అమూల్యమైందయినా దానిస్థాయి కొరవగానే కనిపిస్తుంటుంది. అందకుండాపోయినదానివిలువ పెరుగుట, అందుబాటయి, సన్నిధిలోకిచేరినదానివిలువ తరుగుట మానవ స్వభావం. అశ్వఘోష్మహాకవి విలువలను, అందచందాలను తూచినట్లు వర్ణించగల నిపుణుడు. కాని నేడు తన తల్లి ద్వారా ప్రశంసలుపొందిన ప్రభవిలువ తనహృదయఫలకం

లోని గీటురాయికి అందక అతీతమై కనిపిస్తున్నది. విలువ తెలియని తనఅపజయసూచకంగా ఆమెముందు మోకరిల్లి ప్రణమిల్లాలనిపిస్తున్నది. తల్లి ద్వారా నేటికి గుర్తింపబడిన, ప్రశంసింపబడిన ఒక అమూల్యరత్నసమానమైన ప్రభను పొందినందుకు అశ్వఘోష్‌హృదయము గర్వంతోను ఆనందంతోను కావుర్లుకమ్మి ఆనందబాష్పాలరూపంలో నేత్రాల వెంట వెలువడుతున్నవి. పరువులెత్తుకెళ్ళి ఆమెను కవుగిటిలో బంధించి, ఆముఖమండలంలో ప్రజ్వరిల్లు తేజస్సును స్పష్టరూపంలో చూడాలని, అమ్మహృదయంలో ఆమెకు కలిగిన ఆదరాభిమానాలను వివరించాలని, నాన్నగారుకూడా ఒకరోజు తప్పక అలానే పశ్చాత్తాపపడతారని మొదలగు హృదయజనిత వూహాలలో వుక్కిరిబిక్కిరిఅవుతుండగా, గంగాప్రసాద్ ప్రవేశించి, అధీరతలోలుకుకంఠంతో "ఎలా వుంది?" అంటూ సువర్ణాక్షిశిరస్సుప్రక్కగా కూర్చుని, ఆమెముఖాన్ని పరికిస్తున్నాడు. సన్నని ఆమెహస్తాలు పృథ్విమీద వెదుకుతున్నవి,భర్తపాదపద్మాలకొరకుగాబోలు. అలిసిపోయినకంఠంతో, హీనస్వరంతో "మీరు మహాపండితులు. నిష్టలు కఠోరదీక్షలు మీ నియమాలు. తనకంటె తనబిడ్డ ఖ్యాతినిపొందుట పూర్వజన్మపుణ్యఫలితము. మన బిడ్డ అశ్వం లోకంలో శాశ్వతకీర్తిని పొందుతాడు. వాడి మనస్సును యెన్నడూ కష్టాన్ని కలుగనివ్వకండి. ప్రభ మన వంశానికి వెలుగులాంటిది. ఆవిడలోని అవిచ్ఛిన్నమైన సరళత్వము, సాధుత్వము, వినయ సేవాభావము హిందూవున్నత మహిళస్థానాన్ని స్థిరంచేస్తున్నవి. జరిగినది మరచి, ఆమెను

కోడలుగా స్వీకరించండి..." అంటుండగా ఆమెకంఠం పద్ధ మవుట, అదేసమయంలో గంగాప్రసాద్‌హస్తం నోటిమీద చిన్నగా తగులుట జరిగినవి. ఆమె తనస్వరాన్ని స్పష్టంచేసుకుని "ఇక నా నోరు మూయజూడకండి. అది మిమ్ము మీరు మోసగించుకొనుటే కావచ్చు. నే నిక జీవించను; కొన్ని క్షణాల అతిథినిమాత్రమే. ఈదేశములోని హిందూస్త్రీలందరికంటె ప్రభ వుత్తమురాలు, యోగ్యురాలు అనుసది మరువకండి. దాన్ని కోడలుగాస్వీకరించిననాడే నా ఆత్మ యేలోకంలోవున్నా శాంతిపొందుతుంది." అంటూ వెదికి భర్తహస్తాన్నిబట్టి తనశిరస్సుమీదుంచుకుని గాద్గదికంగా "దానివిషయంలో నాకు మాటివ్వండి. ప్రభ పరమవుత్తమోత్తమురాలు. అలాంటి యువతిని కోడలుగాపొందుట మనఅదృష్టం. దానిస్వీకారంతో పోయే కులమతాలు, వంశప్రతిష్ఠలు పోవుటే మంచిది. ప్రభను కోడలుగాస్వీకరిస్తానని, ఆదరిస్తానని నాకు మాటయివ్వండి."అంటూ తనశిరస్సుమీదున్న భర్తచేతినిబట్టి కుదిపింది.

గంగాప్రసాద్ ద్వితీయహస్తంతో కన్నీరద్దుకుంటు గద్దెపోయినకంఠంతో "నేటికి పరాజయంపొందాను సుశీలా! నీమాటే నెగ్గుతుంది; నీవు ఆరోగ్యంపొందు." అంటూ చీత్కారంచేస్తూ పూజాగదిలోకి వెళ్ళిపోయాడు. ఈలోకంలో పట్టుదలలు పంతాలు క్రోధావేశాలు యెవరిలో యెక్కువగావుంటవో, వారిలోనే హృదయదౌర్బల్యం కూడా విశేషరూపంలో దాగివుంటుంది. అది బహిర్గతమైనప్పుడు పొంగిన నదీప్రవాహంవలె ప్రవహిస్తుంది.

అవసానదశలోనున్న తనతల్లి వినయవిధేయతలతో ప్రార్థించి తనతండ్రిద్వారా పొందిన అభయాన్ని వింటున్న అశ్వఘోష్ విచిత్రానుభూతులనొందుతున్నాడు. భగవంతుడు తనసంకల్పబలంతో యీయావత్తును స్వర్గధామం జేసినట్లు, తనతలిదండ్రులు దేవత్వంబొందినట్లు వారిఆత్మలు పరమపవిత్రమై ప్రేమవెల్లువలై వలుకుతున్నట్లు మధురానుభూతులలో పూగిపోతున్నాడు. తనహృదయదేవతయిన ప్రభ ప్రభావం విశేషమై, విశిష్టమై, అద్వితీయమై అనంతమై ప్రతిబింబిస్తున్నది తనహృదయంలో. ఇక ఆమెను యిదివరకువలె సాధారణరూపంలో చూడరాదని, వంటరిగా నడువనీయరాదని, లేశమాత్రపు కష్టాన్నయినా కలుగనీయరాదని, ఆమె సుకుమారసౌందర్యాన్ని చూచు అవకాశమహద్భాగ్యాన్ని క్షణానికయినా కోల్పరాదని, రూపరాశిలోను, గుణగణాలలోను, విజ్ఞాననిఘంటువులోను ఆమె అపారనిధియని, ఆమెలోని ప్రతిభ, ప్రభావము, నైపుణ్యము, స్నిగ్ధసేవానిరతి తనతలిదండ్రుల పాఖండత్వాన్ని పరిమార్చినదని, నరకాన్నే స్వర్గతుల్యంచేయగలయోగ్యవతియని మొదలగు మధుమయవూహాలలో వూగుతూ తల్లిముందు నిలిచివున్నాడు.

సువర్ణాక్షి అస్పష్టంగా గొణిగిన సవ్వడి విని, వులికిపాటుతో వంగి "ఏమిటమ్మా?" అని ప్రశ్నించాడు. "నాయనా, గొంతు యెండుకుపోతున్నది. కాస్త జలం తాగించు." అన్నది సువర్ణాక్షి. రాగిపాత్రలోని నీటిని తాగించి, ఆమెకెదురుగా ఆసీనుడై ఆలోచనాదొంతరులలో మునిగిపోయాడు. దత్తమిత్రునియింటికి పరుగుపెట్టాలని

మనస్సు పరవళ్ళుత్రొక్కుతున్నది. కాని ప్రక్కనున్న తల్లి అవసానస్థితి అడ్డులాగుతున్నది. ఆయన అక్కడే కూలబడి వున్నాడు గాని, మనస్సు విసుగువిరామంలేని విహారంసలుపుతున్నది. ఇప్పటివ్యూహాలలోని ప్రభ వినూత్నరూపంలో శోభిస్తున్నది. నూతనానందం అనుభూతమవుతున్నది. రేయి మూడవజాము నడుస్తున్నది. కాని తల్లిస్థితిని చూచు సుధి కూడా ఆయనలో కలుగలేదు. మధుపానమత్తులో మునిగిన వానివలె మృదుమధురస్మృతులను సృష్టించుకుంటున్నాడు.

పూజాగదిలో దేవునిముందు పడి అలసటలో నిద్ర చెందిన గంగాప్రసాద్ వేకువకు మెలకువపొంది, సువర్ణాక్షి ఎలావున్నదోనని గాభరా చెందుతూ, మిద్దెపైకి అడుగిడుతూ అశ్వం, ఓ అశ్వం! అమ్మకెలావున్నది?" అని ప్రశ్నించాడు. ఏలోకంలోనో విహరిస్తున్న అశ్వం వులికిపాటు చెంది, తత్తరబిత్తరలాడుతూ తల్లివైపు తిరిగి, ఆమెమీద చేయివేసి "అమ్మా, అమ్మా!" అంటూ పిలుస్తున్నాడు. కాని జవాబులేదు, కదలికమెదిలికలు లేవు. శరీరం చల్లగాతగిలింది. ఆత్రతతో ముఖంలోముఖంపెట్టి చూశాడు. ఆమెముఖం ప్రశాంతంగావుంది. నేత్రాలు శాశ్వతంగా మూసుకున్నవి. నిర్మలమైన ఆమెముఖంలో నుంచి యింకా యేవో దివ్యసందేశాలు వినవస్తున్నట్లే వున్నది. పట్టరానిదుఃఖంతో "అమ్మా." అంటూ ఆమె వక్షస్సుమీద పడిపోయాడు అశ్వఘోష్. నిష్టనియమాల లోని గంభీరమూర్తియైన గంగాప్రసాద్ చెంగుతో అశ్రువులను అద్దుకుంటూ ప్రక్కనున్న పిట్టగోడను పట్టుకున్నాడు.

ఆ గోడనున్న పై రాళ్ళు వూడి, చేతిలోకివచ్చినవి. ఆయన సరసర క్రిందకు దిగి పూజాగదిలో సాష్టాంగపడి విల పిస్తున్నాడు.

# ప్రాణదానం

దుఃఖసాగరంలో మునిగిపోయిన అశ్వఘోష్‌కు తల్లి అంత్యక్రియలనుంచి విముక్తుడగుసరికి పగటిరెండోజాము దాటిపోయింది. ప్రభకొరకు కలవరపెడుతున్న అంతస్తమ ఆదుర్దాను అణచుట యిక సాధ్యంగానిపని. అభిజ్ఞునివ శిరస్సువంచి బయలుదేరాడు.

ప్రభ అశ్వఘోష్‌తోనే వుంటుందని నిశ్చింతు యున్న దత్తమిత్రదంపతులు అతనిద్వారా విన్నపు ఖంగారుతో కళవళపడుతూ, అటూయిటూ వెదుకసాగారు. ప్రభ అశ్వఘోష్‌తో వుండివుంటుందనుకున్నారు వారు. తండ్రియింటికే వెళ్ళిందనుకున్నాడు అశ్వఘోష్. భవన మంతటను, చుట్టుప్రక్కల వెదికి నిరాశతో భీతిజెందుతూ వెదికినచోటే వెదుకుతున్నారు. అశ్వఘోష్ ప్రభగదిలో ప్రవేశించి, ఆమెశయ్యాను, పెట్టెను, టేబులును మతిబోయిన వానినలె పరిశీలిస్తున్నాడు. గోడమీద కప్పివున్నపరదాను తొలగించాడు. జీవత్వముట్టిపడు తనచిత్రపటము వ్రేలాడు తున్నది. ఆ చిత్రపటలేఖనకొరకు ప్రభఆజ్ఞతో తాను ఖైదీ వలె మొన్నోమూాపులు కదలకుండా కూర్చున్నాడు. ఆ పటం ప్రక్కగా కుంచెలున్నచోట ఒక తాళపత్రం తాడుతో చుట్ట

బడివుంది. అశ్వఘోష్ మితిమించిన ఆదుర్దాతో ఆ తాళ పత్రాన్ని తీసిచూశాడు. చుట్టినదారంమీద తడిమట్టి అదిమి దానిమీద ప్రభవుంగరముద్ర వేయబడివున్నది. ఆ మట్టి యింకా పూర్తిగా యెండిపోలేదు.

అశ్వఘోష్ ఆ దారాన్ని వూడబెరికి, మడతవిప్పి పత్రాన్ని చదివాడు. "ప్రియఅశ్వఘోష్, ప్రభ నీనుంచి సెలవుతీసుకుంటున్నది. నన్ను సరయూనదీతరంగాలు రమ్మని పిలుస్తున్నవి. నీవు నా కిచ్చిన అభయాన్ని యెన్నటికీ మరువ వద్దని నాప్రార్థన. శాశ్వతమైన యవనత్వంలోని సౌందర్య రాశియైన ప్రభప్రతిమను నీ హృదయఫలకంలో వదిలి వెళు తున్నాను. కాలమార్పులకుగురిగాని, చిరతారుణ్యప్రభను నాకు ప్రదానంచేసి వెళుతున్నాను. నా ప్రేమ, నా శాశ్వత యవ్వనము నీకు ప్రేరణనిస్తుంటవి. కాని యీప్రేరణను అవ హేళనచేయనోకు కవి. నీ కావ్యప్రేరణకుమాత్రమే నా అక్షుణ్ణయవనాన్ని నీకు ప్రదానమొనరుస్తున్నాను. నాప్రేర ణతో నీ అభయాన్ని నిలుపుకుని, మనప్రేమకు శాశ్వతకీర్తి లభించు కావ్యరచన సాగించకపోతే, నేనుచేసిన యీప్రాణ దానము, ఆత్మహత్యగా పరిణమిస్తుంది. ఆత్మహత్యను నేను యెంత ఘృణీకరించుకుంటానో నీకు తెలుసు. కనుక నా నిర్వా ణాన్ని ప్రాణదానంగా రూపొందించు నీ భారాన్ని నేను విశ్వసిస్తున్నాను కవి."

వలుకుతున్న అశ్రువులను అద్దుకుంటూ, అశ్వఘోష్ వుత్తరాన్ని సమాప్తంచేశాడు. కాని అది చేతిలోనుంచి జారి పడిపోయింది. మంచంమీద కూలబడిపోయాడు.

హృదయం దడదడలాడుతున్నది. హృదయగతి ఆగిపోనున్నట్లు బంధనశ్వాసలో నేత్రాలు తేలవేసి వెర్రిచూపులు చూస్తూ శిలాప్రతిమవలె వుండిపోయాడు. వెలుపలి పరిశోధనలు ముగించుకుంటూ వచ్చిన, దత్తమిత్రదంపతులు యీస్థితిని జూచి నివ్వెరపోయారు. అశ్వఘోష్‌లో ప్రాణమున్నదో లేదో అని వారు శంకించారు. ప్రక్కగా పృధ్వీమీదపడివున్న తాళపత్రాన్ని తీసి చదివి దుఃఖావేశులై విలపించారు. ప్రభతల్లి పృధ్వీమీదపడి దొర్లిగింతలుపెట్టింది. దత్తమిత్రుడు కార్చిన కన్నీటికి అంతులేదు.

గొప్పదుఃఖంలో ఆలోచనలు అంతరించి, ఆక్రందనలుమాత్రమే మిగులుతవి. సమయంజరిగినకొద్ది విచక్షణాజ్ఞానం పొడసూపుతుంది; దుఃఖం సన్నగిలుతుంటుంది. ఆరాత్రంతా కదిలికలు మెదిలికలు లేకుండా అశ్వఘోష్ చైతన్యహీనునివలె అలానే వుండిపోయాడు. ఆమరునాడు సంధ్యాసమయంలో చూచినపుడుకూడా అలానే వున్నపుడు దత్తమిత్రుడు చకితుడై వాపోతూ, నోదార్పప్రయత్నించాడు. కాని మాట పలుకు లేదు. శ్వాసఆడుతున్నది. శరీర వేడి సాధారణరూపంలో వున్నది.

ఆమరునాటిపుదయం జ్ఞానోదయంకలిగినవానివలెఅశ్వఘోష్ వుత్సాహోద్వేగంతో లేచి దత్తమిత్రదంపతుల ముందు సాష్టాంగపడి, "నన్ను ఆశీర్వదించండి. ప్రభ నాద్వారా కోరిన కార్యసాధన ప్రారంభిస్తాను.ఆమె నాకొసంగిన అమూల్యమైన ప్రాణదానాన్ని విస్మరింపను. రాగంతో గూడిన తానాన్నికల్పించి శాశ్వతస్థాయిని నింపుతాను.

నాకర్తవ్యాన్ని గుర్తుజేసి ప్రేరణనుకల్పించి వెళ్ళింది ప్రభ. నాలోనిప్రమత్తతనుతొలగించి తనప్రాణదానంద్వారా నాలో వుత్తేజననుకల్పించి వెళ్ళింది ప్రభ." అంటూ వారిఆశీర్వాదాలుపొంది, హాల్లోకి వచ్చాడు. ఎవరికొరకో యెదురు చూస్తూ హాలులోనిబల్లమీద కూర్చునివున్న ధర్మరక్షిత్ భిక్షుమహాశయునిజూచి అశ్వఘోష్‌శరీరం కంపించిపోతున్నది. అనభిజ్ఞునివలె ఆయనముందు మోకరిల్లి పంచప్రతిష్టిత్ వందన మాచరించి, పాదాలమీదికి వరిగిపోయాడు. ధర్మరక్షిత్ ధైర్యాన్నిపూరిస్తూ "దుఃఖం అంధకారంలాంటిది నాయనా, సుఖం వెలుగులాంటిది. ధైర్యంతో దుఃఖాన్ని యెదుర్కొన గలిగినపుడు తప్పక వెలుగుకనిపిస్తుంది. అధైర్యపడరాదు." అన్నాడు భిక్షువు.

"నా కార్యభారాన్ని ప్రభ నిర్దిష్టరూపంలో సూచించి పోయింది. అందుకుతోడుగా నేను చేయదలచిన కార్యరంగం మొత్తాన్ని నిర్ణయించుకున్నాను. నన్ను వెంటనే తమసంఘ భిక్షువుగా స్వీకరించండి భిక్షుభగవాన్." అని ప్రార్థించాడు.

"అశ్వఘోష్, నీవు దారుణమైనదుఃఖంలో వున్నావు..." అన్నాడు భిక్షువు.

అశ్వఘోష్:- నా దుఃఖం దారుణమైందే, కాని ఆకారణంతో నేను భిక్షుసంఘంలో చేరగోరుటలేదు.

ధర్మరక్షిత్ భిక్షువు:- అయినప్పటికి, భిక్షుసంఘం అంత తొందరపడదు. కనుక కొంతకాలం వేచివుండాలి.

అశ్వం:- సంఘశరణులోవుంటూ, నేను శాంతిపొంద గలను. సంఘంలో వెంటనే మీరు స్థానమివ్వజాలకపోతే

ఆతరువాత అవుసరమేవుండకపోవచ్చు. సంఘశరణ్యంలో నాకుకావలసిన శాంతి, ప్రభప్రేరణకు ప్రోత్సాహము లభ్యంగావచ్చు.

ధర్మరక్షిత్ :- తలిదండ్రుల అనుమతిలేనిదే, భిక్షుసంఘంలో చేర్చుకొనేఅధికారం మాకులేదు కుమార్.

అశ్వఘోష్:- అయితే, నేను తప్పక ఆజ్ఞతీసుకునే వస్తాను.

అశ్వఘోష్ తనఆత్మలోని ఆందోళనాఫలితంగా తండ్రిని వత్తిడిపెట్టి, ఆత్మహత్యకుద్యుక్తుడై భిక్షుసంఘంలో చేరుట కనుమతినిపొందాడు.

మహాస్తవీర ధర్మసేన్, ధర్మరక్షిత్ మొదలగు బౌద్ధభిక్షునాయకులఆధ్వర్యంలో అశ్వఘోష్ బౌద్ధమతాన్నిస్వీకరించాడు. ప్రభకు విశ్వస్తమైన ఆమెమతాన్ని స్వీకరించుట ద్వారా తనఆత్మకు తృప్తిని శాంతిని కల్పించుకున్నాడు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B128 |
| పుస్తకం పేరు | ~~ప్రవాహం~~ ప్రేమదానం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 291 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | H[illegible] |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |